# చతుర

మార్చి 1978

సంపుటి: 1 సంచిక: 2

## చతుర ద్వితీయ కానుకగా సమర్పిస్తున్న సమగ్ర నవల...

తనను ప్రేమించిన వారిని దూరం చేసుకున్నాడు. తాను అవిరతంగా ఆరాధించిన వ్యక్తికి తానే దూరమయ్యాడు. జరిగిన తప్పులకు, చేసిన పొరపాట్లకు పశ్చాత్తాపంతో కుమిలిపోతూ ఆత్మీయ హృదయం కోసం అన్వేషణలో మునిగాడు. ఆ యువకుడికి ఆ అన్వేషణలో ఎదురయింది......

# జనారణ్యం

జనసందోహంతో సందడిగా ఉండే మహానగరం అతనికి కీకారణ్యంగా, పల్లెలు, పట్నాలు చీకటి అడవుల్లా ప్రత్యక్షమయ్యాయి. ఆ అన్వేషణలో, ఆ జనారణ్యంలో అతనికి మానవాకారాల్లోని బెబ్బులులూ, భీత హరిణాలూ, కుందేళ్ళూ, గుంట నక్కలూ ఎన్నెన్నో ఎదురయ్యాయి. అతని ఆలోచనల్ని మండించి, ఆశలను హతమార్చిన ఆ జనారణ్యపు విభిన్న జీవితాల సమగ్ర చిత్రణ ఫలితం ఈ 'జనారణ్యం' నవల —రచన ...

## రామవరపు వేణుగోపాలరావు

## ఈ నెల ముఖపత్రం :

చిత్ర కళలోని అనేక సాంప్రదాయిక విధానాలలో 'బతిక్' పద్ధతి ఒకటి. ఈ పద్ధతిలో వస్త్రంపై చేతితో రంగులు వేయటం జరగదు. మైనంతో రేఖలు గీసుకుని ఆ వస్త్రాన్ని రంగులో ముంచితీయటం ద్వారా కావలసిన రూపాల్ని, రేఖల్ని సృష్టిస్తారు. చిత్రంలో ఎన్ని రంగులుండాలంటే అన్నిసార్లూ అలా వేర్వేరు రంగుల్లో ముంచి తీయవలసిన క్లిష్టమైన ప్రక్రియ, అనుకరణ సాధ్యంగాని సాటిలేని ప్రక్రియ 'బతిక్' పద్ధతి. ఈ పద్ధతిలో రూపొందిన పల్లెపట్టుల్లో ఎదురయే జానపద కథకుల చిత్రమే ఈ నెల 'చతుర' ముఖ పత్రం.

## రెండవ కవరు :

అపురూపశిల్ప సంపదకు అలవాలమైన భారతీయ శిల్పాల్లో ఒకటి క్రీ.పూ. మూడవ శతాబ్దినాటి మౌర్యుల కాలపు ఈ 'చామర ధారి.' ప్రస్తుతం పాట్నా మ్యూజియంలో ఉన్నది.

## మూడవ కవరు :

క్రీ.శ. రెండవ శతాబ్దినాటి కుషాణుల కాలపు మధురలో లభ్యమైన సుందర శిల్పం. చిలకకు పలుకులు నేర్పుతున్న పడతి. ప్రస్తుతం కలకత్తా మ్యూజియంలో సున్నది.

## నాలుగవ కవరు :

ప్రాచీన కాలపు శిల్పుల ఉపజ్ఞకు, ఓర్పుకు అద్భుతమయిన ఉపమానం ఈ పింగాణీతో తయారుచేసిన దీపపు సెమ్మా. కొరియా దేశపు కళాకారుని అపూర్వ సృష్టి.

చతుర

ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ,
హైదరాబాద్-500 004.

లండన్ వార్తా పత్రికల్లో, ఉగాండా అధ్యక్షుడు ఫీల్డ్‌మార్షల్ ఈదీఅమీన్‌ను గురించి నరరూప రాక్షసునిగా వర్ణిస్తూ వచ్చే వార్తలు ఇంకా కొనసాగుతూనే వున్నాయి.

అతని అంతరంగిక సేవకుడైన మోసెస్ అలోగా చెప్పిన విషయాల ఆధారంగా, లండన్‌టైమ్స్ వార్తాపత్రిక ఇటీవల మరికొన్ని విశేషాల నందించింది.



# అమీన్ సరదాలు

అమీన్‌గారి అనేక భవనాల్లో, ఒక ముఖ్యమైన భవనం కంపాలాలో వుంది. ఇందులో బొటానికల్‌రూం అని ఓ గది వుంది. ఈ గదిలో ఏముందో ఎవ్వరికీ తెలీదు. ఎప్పుడూ తాళం వేసి ఉండేది. అమీన్ తనకు అత్యంత సన్నిహితులైన స్నేహితులతో అప్పుడప్పుడు ఇక్కడికి వచ్చేసి, గాన పానాదులతో కులాసాగా కాలక్షేపం చేసి వెళ్తుంటాడు. "దీన్ని శుభ్రపరిచేందుకూ, అక్కడి అవసరాల్ని చూసేందుకు నియమించబడ్డ సేవకుడే మోసెస్ అలోగా. ఈ బొటానికల్ రూంలో రెండు పెద్ద రిఫ్రిజిరేటర్లున్నాయి. ఒకరోజు— అధ్యక్షులవారి శ్రీమతి అక్కడికి వచ్చేసి ఆ బొటానికల్ రూం చూడాలని కుతూహలపడింది. ఆ రిఫ్రిజిరేటర్లలో ఏమున్నాయో తెల్సుకోవాలని సరదాపడింది. అలోగా అందుకు ఒప్పుకోకపోయే సరికి, ఆ రిఫ్రిజిరేటర్ తెరిచి, అందులో ఏమున్నాయో చూపిస్తే, కొంత పారితోషికమే గాక, తనింట్లో ఎక్కువ జీతంతో వుద్యోగం కూడా ఇస్తానని ఆశ పెట్టి, రిఫ్రిజిరేటర్లు తీసి చూపేందుకు ఒప్పించిందామె. ఆ విధంగా ఎలాగైతేనేం ఫ్రిజ్ తలుపులు తెరిపించింది.

ఆ రిఫ్రిజిరేటర్‌లో ఆమెకు ఓ రెండు తలకాయలు కనిపించాయి. అందులో ఒకటి అధ్యక్షులవారి ఆప్తుడైన జెస్సీ గిట్టాది, రెండోది అందాలరాణి 'రూత్ కంబ్సిన్‌జిటీ'ది. ఆమె అలా తెలివి తప్పి పడిపోయిన సమయంలోనే అకస్మాత్తుగా అక్కడ శ్రీమాన్ అధ్యక్షుల వారు ప్రత్యక్షమయారు. అలోగా పరిస్థితి గమనించి ఓమూల నక్కేడు. అధ్యక్షుల వారు భార్యని బయటికి ఈడ్చుకు వస్తూ కనిపించారు. అతని చేతిలో తుపాకి వుంది.

అలోగా తన స్నేహితులతో కలిసి మూడ్రోజుల పాటు రహస్యంగా గడిపి, ఆ తర్వాత తన భార్యతో కలిసి ఒక ట్రక్కు డ్రైవరు సహాయంతో కెన్యా దేశానికి వలసపోయాడు.

ఆ తర్వాత రేడియో వార్తల్లో శ్రీమతి అమీన్ చికిత్సకోసం లిబియా లోని ట్రిపోలీకి తరలించబడిందనీ విన్నాడు.

# బహు పక్షివ్రతం

భార్య బ్రతికివుండగా మరో పెళ్ళి చేసుకుంటే ఏమవుతుందో తెలుసుగా! ప్రభుత్వం గనక పసిగడితే వెంటనే ఆ శ్రీకృష్ణుడిని జన్మస్థానానికే పంపేస్తుంది. మరి పక్షులమాటేమిటి? నవ్వకండి మరీ- పక్షుల్లో కూడా బహుభార్యాత్వం, ఏక పత్నీవ్రతం వున్నాయి. ఎక్కడోకాదు సాక్షాత్తూ ఈ భారతదేశంలోనే. కొన్ని నీటి పక్షులు అపరపాంచాలులై గుడ్లను పెట్టగానే భర్తలను వదిలిపేస్తూ గుడ్ల సంరక్షణలో మునిగిపోతూవుంటాయి.

కోడిపుంజు అనేక పెట్టల్ని వివాహం చేసుకోవడమే గాకుండా, తన గోపికలందర్నీ బుద్ధిగా చూస్తుందిట. ఆహారం కనబడగానే భార్యల్ని పేరు పేరునా పిలిచి ముందువాటిని తిననిచ్చి, తర్వాతే తను తింటుందట. నిప్పు కోడి కూడా బహుభార్యాత్వం ఆచరిస్తుంది.



మనుషుల్లో లాగానే పక్షుల్లో కూడా ఇద్దరు భార్యల్నీ లేదా భర్తల్నీ కలిగి వుండటం, విడాకులు భగ్న వివాహాలు లాంటి సకల సదాచారాలూ, అలవాట్లూ వున్నాయట. పక్షులు సైతం పత్నీమణుల కోసం పరస్పరం కలహించుకోక తప్పదు. మగనెమళ్ళు ఒక సీజన్ రాగానే ఆడనెమళ్ళను ఆకర్షించేందుకు నృత్యం చేస్తాయనేది సర్వవిదితం. ఇలా రకరకాల అలవాట్లతో మనుషులకి సైతం పాఠాలునేర్పే పక్షులు మన దేశంలోనే గాక, చైనా, మలయా, ఆఫ్రికా, ఆస్ట్రేలియాల్లో కూడా వున్నాయి.

# లక్షాధికార్ల గ్రామం



ఆ గ్రామం జనాభా 4,500 మాత్రమే కానీ అక్కడి బాంకుల్లో వారు దాచుకున్న సొమ్ము 16 కోట్ల రూపాయలకి పైగా వుంది. బొంబాయి ఉత్తర ప్రాంతంలో బాలాడియా అనే గ్రామం మెట్ట ప్రాంతం కావడం వల్లా, ఏ మాత్రమూ సేద్యానికి యోగ్యమయిన భూములు లేకపోవడం వల్లా అక్కడి యువకులంతా పనులు వెదుక్కుంటూ విదేశాలకి వెళ్ళిపోయారు. గ్రామంలో వుండేది ముసలీ, ముతకా, చిన్నాచితుకూ మాత్రమే. కొడుకులు పంపేవాట్లో తిండికి పోను మిగతాదంతా బ్యాంకుల్లో వేయడమే వీరిపని.

ఇప్పుడా గ్రామంలో బ్యాంక్ ఆఫ్ ఇండియా, బ్యాంక్ ఆఫ్ బరోడా బ్రాంచీలు న్నాయి. ఇంకా అనేక బ్యాంకులు బ్రాంచీలు తెరవడానికి పోటీపడుతున్నాయి.

విదేశాల్లో వుద్యోగాలు చేసే ఆ వూరి యువకులు ఎప్పుడైనా సెలవులకి వచ్చినప్పుడు విదేశాల్లో తాము అనుభవించే అన్ని సౌకర్యాలూ ఇక్కడ కూడా యధావిధిగా అనుభవించేందుకు కార్లు, బాత్‌టబ్‌లూ, కరెంటు, టెలివిజన్లు, టెలిఫోన్లు వంటి వన్నీ తమ తమ ఇళ్ళల్లో అమర్చుకున్నారు. సెలవులయిపోయాక వాళ్ళు వెళ్ళిపోతే, కార్లు గేరేజిల్లో దుమ్ము కొట్టు కుంటూ వుండాల్సిందే.

బాలాపియా గ్రామస్తులు ఇంత ధనవంతులైనా ఆవూరి వాతావరణం మాత్రం నికృష్టంగా వుంటుంది. ఎవరి గొడవ వారిదేతప్ప, ఊరుబాగు చేయిద్దామన్న ధ్యాసఎవరికీలేదు. రోడ్లన్నీ దుమ్ముకొట్టుకుపోయి అసహ్యంగా వుంటాయి. స్కూలు, ఆసుపత్రి, సినిమాహాలు లాంటివేమీ లేవక్కడ. అక్కడి అమ్మాయిలు మాత్రం ఎలాగూ పెళ్ళి కావాలి గనక,విదేశాల్లో వుంటున్న ఆ యువకుల అభిరుచికి అనుకూలంగా ఇప్పుడిప్పుడే దగ్గర్లోవున్న ఓ ప్రైవేటు స్కూల్లో చేరి ఇంగ్లీషు నేర్చుకుంటున్నారు.

ప్రస్తుతం ఆ గ్రామస్తులు మేము బ్యాంకుల్లో వేసిన డబ్బుల్లో పైసాకూడా కదిలించం కదా! అందువల్ల మాకు ఆ డిపాజిట్లమీద చక్రవడ్డి ఇవ్వడం న్యాయం అంటూ గొడవచేస్తున్నారు.

## టూత్ బ్రష్ సంగీతం

ప్రఖ్యాత సినీగాయకుడో, గాయనీమణో సంగీత కచ్చేరీ చేయబోతున్నారనే ప్రకటన చూడగానే, టిక్కెట్లుకొనో, గోడ దూకో ప్రోగ్రాంకి వెళ్తుంటారు సంగీతప్రియులు. అయితే, మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీ విద్యార్థి ఎస్వీ. కణ్ణన్ తన ఆర్కెస్ట్రాతో అందర్నీ ముగ్ధుల్నే గాక, ఆశ్చర్యచకితుల్ని కూడా చేస్తున్నాట్ట! ఈ ఆర్కెస్ట్రాలో వుండేది కణ్ణన్ ఒక్కడే. అతని వాయిద్యాలు కేవలం ఒక టూత్ బ్రష్, ఓ చిన్న



గొట్టం, చిన్న చిన్న చెక్కముక్కలు ఇంతే. వీటితోటే రకరకాల వాయిద్యాల ధ్వనులు సృష్టిస్తాడతను. గొట్టంతో సాక్సోఫోన్, బ్రష్‌తో సితార్. చెక్కముక్కల్తో ఎలక్ట్రిక్ గిటార్ ధ్వనుల్ని పుట్టిస్తుంటే అంతా నోళ్ళు వెళ్ళబెడుతున్నారు. ముక్కుతో క్లారినట్, నోటితో వయొలిన్. పెదవులతో హార్మోనియం ధ్వనులు అద్భుతంగా పలికిస్తాడతను. వందలూ వేలూ పోసి వాయిద్యాలు కొనడమెందుకండీ? ఓ టూత్ బ్రష్ వుంటే దాలదూ? ఇకనుంచీ అడ్వర్టయిజ్‌మెంట్లలో 'మెరిసే పళ్ళకి, మధురమైన సంగీతానికి మా టూత్ బ్రష్‌నే వాడండి" అంటారేమో!



# స్ప్రింగు నాడాలు

సాధారణంగా ఆడవాళ్ళ నడకని హంస నడకతో పోలుస్తారు. కానీ, ఎవరైనా అమ్మాయిని "మీ నడక గుర్రం నడకలా వుంది" అన్నామంటే మాత్రం చివాట్లు తప్పవు. అయితే ఇకముందు ఆ ప్రమాదం లేదు. ఎందుకంటే, గుర్రాలు గట్టి రోడ్లు, రాతీనేలమీద పరిగెత్తేప్పుడు, వాటి గిట్టలు దెబ్బతిని, బాధకలక్కుండా కొత్తరకం నాడాలు కనిపెట్టారు. కాలికి ఒత్తిడి తగలకుండా ఈనాడాలకిఅడుగున స్ప్రింగులుంటాయి. ఒరుసుకుపోకుండా లోపల మెత్తటి కుషన్ కూడా వుంటుంది. ఈ నాడాల్ని మామూలుగా ఇనుముతో చేస్తున్నా, రేసుగుర్రాల కోసం తేలికగా ఉండేందుకని ప్రత్యేకంగా అల్యూమినియంవి కూడా చేస్తున్నారు. స్ప్రింగు నాడాలతో నడిచే గుర్రాల ఒయ్యారం చూడాల్సిందేమరి!

# అంకెల్లో అదృష్టం

ఇళ్ళు, పొలాలు, స్థలాలు, ఇలాంటివాటిని వేలం వేస్తారని మనకందరికీ తెలుసు. కానీ, ఆఫ్రికాలో మోటారు వాహనాల నంబర్ ప్లేట్లనికూడా వేలంవేస్తారు! అక్కడి ప్రజల్లో మూఢనమ్మకాలు ఎక్కువ. వేలంలో ఎక్కువకి పాడుకున్నవారికే లక్కీనెంబర్లు దొరుకుతాయి. అక్కడి రోడ్డు రవాణాశాఖ అధికారులకి లంచం యిచ్చి అయినా సరే తమకి కావల్సిన నెంబర్లను సంపాదించడం మరీ ఎక్కువయి పోవడంతో, 1973 నుంచీ ఆఫ్రికా ప్రభుత్వం ఈ విధానం ప్రవేశపెట్టింది.




గత డిసెంబర్లో '1000' అంకె గల ఒక నంబర్ ప్లేటు 18,000 డాలర్లకు (1,26,000 రూపాయలన్నమాట) పాడాడో పెద్దమనిషి. '10'అంకె అంటే ప్రజల్లో మోజెక్కువ. 1977, జనవరిలో ఈ పది అంకెగల నంబరు ప్లేటు 45 వేల డాలర్లకు కొనుక్కున్నారొకరు. 1 నుంచీ 100 వరకూ, 1,23,8888 అంకెలుగల నంబరుప్లేట్లు ప్రభుత్వం రిజర్వు చేసి ఉంచుకుంటుంది. ఎవ్వరికీ అక్కర్లేని అంకె 9413. చైనాభాషలో 9413అంటే 'ఒకటి కోసం తొమ్మిది బలి కావాలి' అని అర్థమటమరి!

## క్లియోపాట్రా ముద్దు

మీరెప్పుడైన కోయంబత్తూర్ వెళ్ళినప్పుడు "క్లియో ప్యాట్రాను చూశారా, ఎలావుంది?" అని ఎవరైనా అడిగితే తెల్ల మొహం వెయ్యకండి. వాళ్ళు అడిగితే క్లియోప్యాట్రా సినిమా గురించి కాదు. కోయంబత్తూర్ దగ్గర్లోని మెట్టుపళాయం అనే వూళ్ళో ఉన్న రామకృష్ణా ఫార్మ్‌లో గల అపురూపమైన అడవి గులాబీల తోట పేరు క్లియోప్యాట్రా.



రకరకాల రంగుల్లో విరబూసే అక్కడి గులాబీలు మిమ్మల్ని మంత్ర ముగ్ధుల్ని చేస్తాయి. సినీ తారలు కూడా కోయంబత్తూర్ వచ్చినప్పుడు ఈ క్లియోప్యాట్రాను చూసి మైమరచి పోతూ ఉంటారట!

ఇలాంటి రంగు రంగుల అడవి గులాబీ తోటలు దేశం మొత్తం మీద ఊటీలోని బొటానికల్ గార్డెన్‌లోనూ, ఇక్కడ మాత్రమే వున్నాయంటుంది ఆ తోట యజమానురాలు శ్రీమతి వేలుమణి అమ్మాళ్.

ఓ పక్క నీలగిరి కొండలూ, మరో పక్క కొబ్బరి, తాటి తోపులూ— మధ్య 40 ఎకరాల విస్తీర్ణంలో అందంగా అమరి వున్నదీ గులాబీతోట. ఒకప్పుడు అరణ్యంలా వుండే ఈ ప్రాంతం, చదును చేయబడి సుందర నందనవనంగా రూపు దిద్దుకున్నది. "మా క్లియో పాట్రాని చూసి ముద్దు పెట్టుకోకుండా వెనక్కి వెళ్ళ లేరెవరూ" అంటుంది తోట యజమానురాలు సగర్వంగా.

## చౌక బేరం

మద్రాసులోని అశోక్‌నగర్ ప్రాంతంలో 24 కుటుంబాలు ఒకే కాంపౌండులో వున్నాయి. ఆ ఇళ్ళలోని పిల్లలకీ, పెద్దలకీ టెలివిజన్ చూడాలని కోరిక కలిగింది. వాళ్ళల్లో వాళ్ల కూడ బలుక్కుని చందాలు వేసుకుని వాయిదాల పద్ధతి మీద ఓ టెలివిజన్ సెట్టు కొనుక్కొచ్చారు. అయితే అంతమంది కలిసి ఎక్కడ కూర్చుని చూడాలి ?

ఆ కాంపౌండులోనే వున్న కారు షెడ్డుమీద వాళ్ళ దృష్టి పడింది. కారుని బయటికి గెంటేసి, షెడ్డులో ఓ టేబులు అమర్చి, దానిమీద ఈ టెలివిజన్‌ని పెట్టిఉత్సాహంగాచూసు కుంటున్నారు. ప్రతి శని ఆదివారాల్లో రెండు సిని



మాలు, మంగళ శుక్రవారాల్లో లైట్ అండ్ సౌండ్ ప్రోగ్రాంలు కూడా కష్టం లేకుండా చూడ గలుగుతున్నాం" అంటారు ఆ ఇళ్ళల్లో బహు కుటుంబీకులు.

నా హృదయం ఏనాడో చచ్చిపోయింది. కానీ నేనింకా బతికే ఉన్నాను. హృదయం చచ్చిపోయినా శరీరం బతికి ఉండడం ఎంత బాధాకరం!

నన్ను నేను పరిచయం చేసుకోవడానికి ఈ మూడు వాక్యాలూ చాలనుకొంటాను. ఎందుకంటే ఇది నా కథ కాదు. ఈ కథకు నేను నాయకుడినీ కాదు.

ఇది రజని కథ. రాజు కథ కూడానూ. వాళ్ళిద్దరి జీవితాలూ; అవి తిరిగిన మలుపులూ నేను కళ్ళారా చూశాను. వాళ్ళ జీవితాల్లో చిందిన ఆనందం, కమ్మిన విషాదం, సుఖ దుఃఖాలూ నాకు తెలుసు. వాళ్లు అనామకులు అయితేనేంగాక, అమృత మూర్తులు. వాళ్ళిద్దరి జీవితాలకూ నేను సాక్షిని. వాళ్ళ జీవితాల్లోని అయోమయాన్ని కొద్దిగానేనా అర్థం చేసుకొన్నవాడిని నేనొక్కడినే. అందుకే వాళ్ళ కథ చెప్పే అర్హత నాకు తప్ప మరెవ్వరికీ లేదు.

ప్రపంచంలో ఒక్కొక్కరూ ఒక్కొక్క తీరుగా ఉంటారు. కొన్ని సందర్భాల్లో ఒకే వ్యక్తి వివిధ వ్యక్తుల దృష్టికోణాల్లో అనేక రీతులతో కన్పిస్తాడు. ఏదైనా చూసేవారిని బట్టి ఉంటుంది. అందరి పరిశీలనలూ ఒకేలా ఉండవు. ఉండడం అసాధ్యం....నాదైన దృక్పథంతో నాదైన పరిశీలనతో వాళ్ళ గురించి చెప్తాను. అలా చెప్పగా విన్నవాళ్లు నాలాగే వారిని అర్థం చేసుకోవాలని నియమం ఏముంది? నేను కన్నవీ, విన్నవీ ఉన్నది ఉన్నట్టు చెప్తాను. ఆయా సంఘటనలకు సంబంధించి నాకు తోచిన వ్యాఖ్యలేవో నేను చేస్తాను. వాటిని విన్నవారు నన్నూ నా భావాలనూ సమర్థించనూ వచ్చు. ఖండించనూ వచ్చు. లేదా నేను చెప్పిన వాటిమీద ఆధారపడి, ఆయా సంఘటనలకు వేరువేరు అర్థాలు అంతర్యాలు ఊహించుకోనూవచ్చు. నాకు తెలిసిన విషయాలూ, నాలో మెదిలిన ఆలోచనలూ నిజాయితీగా చెప్పడమే నా పని.

రజనీ, రాజుల కథ చెప్పబోయే ముందు— వాళ్ళ జీవిత కథకుడిగా నా పరిచయం మరికొంత అవసరం అనుకొంటాను.... నా వ్యక్తిత్వం కొంత తెలిస్తే— తద్వారా, వాళ్ళిద్దరి గురించీ ఎవరికి తోచిన అభిప్రాయాలకు వారు రావచ్చు. అయితే ఒక విషయం...నేను చూడగలిగినది మాత్రమే చూసి— రాయగలిగినది రాస్తున్నాను. లేనిపోని అతిశయోక్తులూ, స్త్రీలను కానీ, పురుషులను కానీ ఏ కారణం చేతనైనా గానీ కించపరచడాలూ, పనికట్టుకొని ఏదో ఒకి వర్గాన్ని దుమ్మెత్తిపొయ్యడాలూ, ఊహాగానాలూ... ఇవంటే నాకు విశేషమైన అసహ్యం అని మాత్రం ఎవరైనా గ్రహిస్తే చాలు.

ఇక నా గురించి

నా పేరు గోపీనాథ్. నన్నందరూ గోపీ అనంటారు. నాకు ఇప్పుడు ముప్పయ్యేళ్లు. నేను సన్నగా పొడవుగా ఉంటాను నాకు బట్టతల లేదు. పొడవుకు తగ్గ లావు ఉంటే బాగుండేది అనేవారు—

ఒకప్పటి నా మిత్రులు. నా శరీరవర్ణం చామనచాయలో ఉంటుంది. ఇవి నా దేహానికి సంబంధించిన వివరాలు. నేనంత ధనవంతుడినీ కాను, దరిద్రుడినీ కాదు. కానీ, జీవితంలోని ఎన్నో ఎగుడు దిగుళ్ళకు నేనూ గురి అయ్యాను. కడుపు నిండని బేరంతో కృంగిన రోజులూ ఉన్నాయి. కడుపు నిండిన బేరంతో కమ్మని కలలు ఝామ్మనికన్న రోజులూ ఉన్నాయి. ఒకప్పుడు— బేంక్‌లో నోట్లు లెక్కపెట్టే ఉద్యోగం నా జీవనోపాధి. విధీ విరామం లేకుండా ఏడేళ్ళు లెక్కపెట్టి— అనివార్య కారణాలవలన(అవేవో మరోసారి చెప్తాను) విసుగొచ్చి దానికి రాజీనామా చేశాను. అలా రాజీనామా చేసిననాడు గానీ, చేసిన తర్వాతగానీ— ఇకముందు ఎలా జీవించాలన్న ఆలోచనకు ఎక్కువగా తావియ్యలేదు నేను. నిక్షేపంలాంటి ఎనిమిది వందలు వచ్చే ఉద్యోగాన్ని ఎటువంటి ఆధారం ఆస్తి వగైరాలులేని నేను— ముందుచూపు లేకుండా సిల్లీ అనిపించే సాకు చూపించి— రాజీనామా చేశాను. ఈ నా మాటల్లో పోజులేదు. ఎలాగో ఒకలా బతకలేనా అన్న ధీమా, ఆత్మస్థయిర్యం, గుండె నిబ్బరం లాంటివి పుష్కలంగా ఉన్న వాడినని చాటుకోవడం నా ఉద్దేశం కాదు. కాని అది నిజం అంతే.

నిజాన్ని అలాకాక, ఇంకా సూటిగా చెప్పాలంటే— సరిగ్గా అప్పుడే నా హృదయం చచ్చిపోయింది. ఆ తర్వాతే ఉద్యోగానికి రాజీనామా. హృదయం చచ్చిపోయాక ఇంక తుచ్ఛశరీరంతో నాకు పనేముంది ? గ క ర కా ల నా స్యా లు చే సి డబ్బు సంపాదించి, ఆ హా రం కొ ని ఆ దే హా న్ని పోషించినందువల్ల ప్రయోజనం లేదు. అందుకే నేను భవిష్యత్తు గురించి ఆనాడు ఏమీ ఆలోచించలేదు. ఆనాటినుంచే నాకు జీవితం మీద విర క్తి ఏర్పడింది. ఆనాటి నుంచే—చచ్చిపోవాలన్న కోరిక నా నర నరాల్లో నాటుకుపోసాగింది. ప్రతిక్షణం అదే ఆలోచన. అనుక్షణం అదే ధ్యాస. ఎన్నోసార్లు ఎన్నెన్నో భయంకర పరిస్థితుల్లో ఇరుక్కున్నాను. చిత్రహింసలు పెట్టే చిక్కుల్లో చి క్కు కొ న్నా ను. ఎవ్వరూ ఊహించలేని మానసిక చిత్ర వధల్లో న ర కం అనుభవించాను... తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. ఇన్ని బాధలూ ఓర్చుకోగలిగానేకాని, చేజేతులా బలవంతాన నా ప్రాణం తీసుకోవాలని పించలేదు. ఏ ప్రమాదంలోనో ఏ భయంకరవ్యాధి వల్లనో ప్రాణం పోతే బాగుణ్ణనుకొన్నాను గాని దానిని నాకై నేను అం తం చేసుకోలేకపోయాను. ఆత్మహత్య చేసుకోలేకపోయాను. అంటే— హృదయం చచ్చిన ఈ జీర్ణదేహంలో ఇంకా ఏదో ఆశాకిరణం వెలుగుతోందన్న మాట...అవును.

ఆ ఆశాకిరణం పేరే నాగరత్నం

నాగరత్నం అతిలోకసుందరీ కాదు. లక్షాధికారి గారాబుపట్టీ కాదు. తెల్లగా బొద్దుగా ఉండే మామూలు స్త్రీ. నా హృదయానికి చేరువగా వచ్చిన మొట్ట మొదటి ఆడది నాగరత్నమే. తుఫాన్‌లా నా జీవితంలోకి ప్రవేశించి అంత ఉధృతం

గానూ నిష్క్రమించింది. ఆమె నిష్క్రమించి నేటికి దాదాపు అయిదు సంవత్సరాలైంది. నాగరత్నం నిష్క్రమణం— నా హృదయం మరణం ఒకే సారి జరిగాయి. ఈనాటికీ నేను నాగరత్నం కోసం కళ్ళలో ప్రాణాలు పెట్టుకుని వెతుకుతూనే ఉన్నాను. ఆత్మశూన్యమైన దేహాన్ని మోస్తూ— విధి విసిరిన చోటికి ఎగిరిపడ్తూ — ఈ అయిదేళ్లూ భారంగా ఇలా కాలం గడుపుతున్నాను.

నాగరత్నం ఎవరో, నాకెలా పరిచయం అయిందో, ఆ పరిచయం ఎలా ప్రేమగా మారిందో, ఆ ప్రేమ, ఆ పరస్పరాకర్షణ ఎవరివల్ల ఎందుకు ఎలా విఫలం అయిందో — చెప్పాలంటే చాలా ఉంది. కాని, నేను చెప్పబోయేది నా ప్రేమకథ కాదు. అదేమంత చెప్పుకోదగ్గది కాదు. అయినా, అది నా ఉద్దేశమూ కాదు. అందుకు ఇది సమయమూ కాదు. నాగరత్నం స్మృతులు, నామీద వల్లమాలిన ప్రేమతో ఆడిన మాటలూ, వాగిన వాగుడూ, రాని కోపం నటించి నన్ను మాటల్తో ఆమె గాయపరచాలని చేసిన ప్రయత్నాలూ, నా సామీప్యం కోసం దేనికైనా తెగించగల ఆరాటం... ఇవి పదిమందికీ చెప్పుకోవడం నాకు ఇష్టం ఉండదు. నా మనఃస్థితి, నా పరిస్థితి, కొద్దిపాటి నా వ్యక్తిత్వం వివరించవలసివచ్చింది కాబట్టి నాగరత్నం ప్రసక్తి వచ్చింది. లేకపోతే, ఆమె ప్రసక్తి తెచ్చేవాడినే కాదు.

నాగరత్నం నాకు దూరమయ్యాక, ఆమె కోసం పిచ్చివాడిలా ఎక్కడెక్కడో తిరిగాను. ఎన్నెన్ని ప్రదేశాలలో అన్వేషించాను. ఆమె గురించి ఎవరెవరో ఏమేమో ఎన్నెన్నో చెప్పారు. ఏవీ నమ్మలేకపోయాను.చివరికి— ప్రపంచంలో దేనికీ ప్రాముఖ్యత ఇవ్వలేని విరాగ స్థితికి వచ్చేశాను.

రకరకాల ఉద్యోగాలు చేశాను. వివిధ ప్రాంతాలు తిరిగాను. ఎక్కడైనా నాగరత్నం కన్పించకపోతుందా అన్న ఆశ నాలో ఏ మూలో ఉండేదని అనుకొంటాను. ఆమె కోసం అనవసరంగా నేను నా జీవితాన్ని వ్యర్థం చేసుకొంటున్నానంటూ—ఆ రోజుల్లో మా విషయం తెలిసిన మిత్రులు ఆడిపోసుకొన్నారు...

'నాగరత్నం కాకపోతే మరో నాగసుందరి. అదీ కాకపోతే ఎవత్తో నరసరాణి... ఈ విశాల భారతంలో వీళ్ళకు కరువేమిటోయ్? మగాడికి ఏ ఆడదైనా ఒకటే... కామం ఆరోగ్య లక్షణం— ప్రేమా గీమా పిచ్చి వాగుడు. జబ్బు లక్షణాలు...' అని మరికొందరు నన్ను మందలించారు.

వాళ్ళకు నేనేమీ సమాధానం చెప్పలేకపోయాను. సమాధానం లేదని కాదు. ఉంది. కాని వెల్లడించాలంటే నాకు సిగ్గు. నా నిజస్వరూపం బహిర్గతంచెయ్యాలంటే చచ్చే సిగ్గు. నాగరత్నానికి నేను అన్యాయం చేశాను. నాకు తెలుసు. నాగరత్నానికీ తెలుసు. అందుకే ఆమె కోసం ఆశ... అన్వేషణ... ఒకనాటిదీ కాదు, మూన్నాళ్ళదీ కాదు. అయిదేళ్ళ నిరంతరాన్వేషణ...

సరిగ్గా ఇక్కడే రజని, రాజుల కథ

ప్రారంభమవుతుంది.



## 2

భూగోళం మీద తిరుగాడే జీవులన్నింటి లోకీ అతి అభాగ్య జీవి మా న వు డే- అన్నది కవి వాక్కు.

కాలం గడిచేకొద్దీ కలుగుల్లోని ఎలు కలు ఊరికే ఉండవు. ఋతుధర్మం ఊరికే ఉండనివ్వదు. సంయోగ వియో గాల ఫలితంగా మరికొన్ని జీ వు లు పుట్టుకొస్తాయి. నానాటికీ వాటి సంఖ్య పెరుగుతుంది. పెరుగుతూన్న కొ ద్దీ కలుగు ఇరుకైపోతుంది. అలా ఇరుకు అవుతూన్న కలుగులో తమస్థానం సుర క్షితం చేసుకోడానికి అవి పోటీలు పడి యుద్ధాలు చే స్తా యి. ఒకదాన్నొకటి చంపుకొంటాయి. ఎలుకలే కాదు, ఇతర మృగసముదాయానికీ ఇదే ధర్మం.

అటువంటి ధర్మం-ధర్మంగా కల మృగాలకన్నా అభాగ్యుడైన మానవుడి పరిస్థితి మరోలా ఉంది. ఎన్ని కుటుంబ నియంత్రణ పథకాలు ప్రచారం చేసినా, ఎంత అధికంగా పంటలు పండినా-వాటిని మించిన వేగంతో ప్రపంచం మొత్తం మీద రోజుకు రెండు లక్షల మంది పైగా పుట్టుకొచ్చేస్తున్నారు. అధునాతన వైద్య పద్ధతుల మూలంగా మనిషి స గ టు ఆయుః ప్రమాణం పెరిగింది. ఆ పుట్టే వాళ్లు సంపన్న దేశాలలో కాక, 90శాతం మంది బడుగుదేశాల్లోనే పుడుతున్నారు. ఈ లెక్కని మరో పదేళ్లపోతే-దేశంలో మనుషులు అంగుళం మేరయినా ఖాళీ లేకుండా కిటకిట లాడతారు. ఏదో అలాగే సర్దుకుపోతారు గానీ, ఎలుకల్లా ఇతర మృగాల్లా ఒకరినొకరు కొట్టుకు చావరుట! గుంపులు గుంపులుగా కలిసి జీవించే అలవాటుకి అనాదిగా బానిస గనుక- మానవుడు అలాంటి అత్యా చారానికి పాల్పడే ప్రమాదం లేదని ఒక శాస్త్రజ్ఞుడు ఎక్కడో రాస్తే చదివాను. చదివిన తర్వాతే - అప్పటికి జనసమ్మ ర్దంతో కిటకిట లాడుతున్న మద్రాస్ మహానగరంలో నాకు చోటే దొరకక్క పోతుందా అని బయలుదేరాను.

నగరంలో అడుగుపెట్టిన నాలుగే రోజులకు ఒక కథల పత్రికలో ఉద్యో గం దొరికింది. నోట్లు లెక్కపెట్టే ఉద్యో గం ఉన్న రోజుల్లో సినిమాలూ, షికార్లూ, చిలిపి సరదాలూ లాంటి వాటికి నేను దూరంగా ఉండేవాడిని. అలాగని చెప్పి వాటి వంకేనా చూడకుండా ముక్కు మూసుకు కూర్చున్నానని కాదు: ఎప్పుడో తప్ప ఎక్కడికీ వెళ్ళేవాడిని కాదు.

ఆ రోజుల్లో నాకొక లాయరు గారితో స్నేహం అయింది. ఆ య న కి నేను ఎప్పుడో ఉబుసుపోక రాసిన ఒకటి రెండు కథలు నచ్చాయి. తనకు నచ్చిన కథలు రాసినందుకు నేనూ నచ్చేను. సాయంకాలాల పూట రోజూ కలుసు కొనే వాళ్లం. టౌన్ హాల్ దగ్గర సముద్రపు ఒడ్డున కూర్చొని షేక్స్

పియర్ గురించీ, షా గురించీ, అస్తమానూ మాట్లాడేవాడు. ఆయన చెప్పిన విషయాలు తలకి ఎక్కినట్టే ఉండేవి. కానీ వెంటనే దిగిపోయేవి...కొన్నాళ్లకు వాటిని చదవాలన్న జిజ్ఞాస రేకెత్తింది. అలా ప్రారంభమైన పుస్తకదాహం నానాటికీ ఎక్కువైంది. అప్పటినుంచీ— నా ప్రపంచం, నా లోకం పుస్తకాలే అయ్యాయి. ఎప్పుడూ ఏదో చదువుతూ ఉండడం.........చదవనప్పుడు ఏదో ఆలోచన...!

ప్రేరణ అనేది ఎలా వచ్చిందో చెప్పలేను కానీ సరిగ్గా ఆనాటి నుంచే రాయాలనే తపన నాలో ప్రారంభం అయింది. ఏదేదో గొప్పగా రాయాలని ఏమేమో రాశాను. అదృష్టవశాత్తూ అవి అచ్చయ్యాయి. కొందరు గొప్పగా ఉన్నాయన్నారు. కొందరు ఫర్వాలేదన్నారు. మరికొందరు ఏమీ అనకుండా మౌనంగా ఉండిపోయారు...

నేను చేసిన ఆ కొద్దిపాటి రచనలూ నాకు కథల పత్రికలో సహసంపాదకుడి ఉద్యోగాన్ని సంపాదించి పెట్టేయి.

కొత్త ప్రదేశం. భాషరాదు. స్నేహితులు లేరు. అంచేత, ఏ మాత్రం ఖాళీ దొరికినా నేను సెంట్రల్ స్టేషన్‌కి వెళ్లి అక్కడి ప్లాట్ ఫారాలమీద జనాన్ని చూస్తూ, గంటల తరబడి గడిపే వాడిని. అంతకన్నా చవకయిన, అందుబాటులో ఉన్న కాలక్షేపం మరేదీ కనిపించలేదు నాకు.

ఆ రోజూ అలాగే వెళ్లాను. ప్లాట్‌ఫామ్ టికెట్ కొనుక్కొని లోపలకు ప్రవేశించాను. జనసమ్మర్దంగా ఉన్న ప్లాట్‌ఫారాలమీది జనాన్ని చూస్తూ కాసేపు పచార్లు చేశాను. కొంత సేపటికి ఓ సిమెంటు బెంచిమీద కూర్చొని చేతిలోని పత్రికను విప్పాను. ఓ పక్క రణగొణధ్వని అదరగొడ్తూ ఉంటే పుస్తకం మీద దృష్టి ఎలా నిలుస్తుంది? బొమ్మల్ని చూస్తూ యదాలాపంగా పేజీలు తిప్పుతున్నాను పేజీలన్నీ తిప్పడం అయ్యాక పుస్తకం మూసేసి ఒళ్ళు విరుచుకొన్నాను.

అంతలో ఎదురుగుండా కనబడిన వ్యక్తిని చూసి ఆశ్చర్యంతో నిశ్చేష్టుడిని అయ్యాను.

నాకు రెండు గజాల దూరంలో ఒక ట్రంకు పెట్టె ఉంది. పక్కనే ఓ అమ్మాయి నిలబడి ఉంది. నా ఆశ్చర్యానికి ఆ అమ్మాయే కారకురాలు. ఆమెను చూశాక నా జ్ఞాపకాల తెరలు రెప రెపలాడసాగాయి. కాస్సేపటికి— రెప రెపలాడుతున్న తెరలు తుఫాన్ గాలితాకిడికి అల్లల్లాడనారంభించాయి.

ఆమె నాగరత్నం కాదుగదా!

ఎంత ఆశ! నా పేరాశకి నాకే నవ్వు వచ్చింది. ఆమె నాగరత్నం కాదు. నాగరత్నమే అయితే ఇంకా అలాగే నిలబడి నా వంక ఎందుకలా చూస్తుంది? 'గోపీ' అంటూ సుడిగాలిలా వచ్చి లతలా నన్ను వాటేసుకోదూ? కాదు, నాగరత్నంకాదు. మరెవరు? ఎందుకలా చూస్తోంది? తెప్పరిల్లిన కాస్సేపటికి పరిస్థితి ఏమిటో గ్రహించాను.

బెంచి మధ్యని కూర్చున్నవాడినల్లా

ఓ మూలకు జరిగాను. ఆమె వేపు చూసి కూర్చోమన్నట్టు సైగ చేశాను. ఆమె మరొక్క నిమిషం ఆలస్యం చెయ్యకుండా కూర్చుంటూ "థాంక్స్" అంది. ఫర్వా లేదన్నట్టు నవ్వేశాను.

ఆమె ఎటో చూస్తోంది. ఎవరికోసమో ఎదురు చూస్తోంది కాబోలు ... ఉండి ఉండి నావేపు చూస్తోంది. ఏదేనా సంభాషణ ప్రారంభించాలని ఉంది నాకు. కాని, నాకు భాష రాదే! ఎలా? ఒక వేళ ఆమె సంభాషణ మొదలెట్టినా మాత్రం ఏం లాభం?

ఆమెను చూస్తూ ఉంటే అలనాటి నా నాగరత్నాన్ని చూస్తున్నట్లు అనిపించింది నాకు. అయితే, ఈమె నాగరత్నంకన్నా పొడగరి. జుత్తు మాత్రం కురచ. నాగరత్నం జుత్తు అలా కాదు. తలంటి పోసుకొని జుత్తు విరబోసుకుందంటే— పట్టపగలు చీకటిలా ఉంటుంది. ఒంటి జడ వేసుకుంటే ఆ బారెడుజడా పిరుదుల కిందికి వస్తుంది. కళ్లూ ముక్కూ మాత్రం ఒకటే.

అంతలోనే నాలో ఏదోనిరాశ.ఎవరినో చూసి, ఎవరి పోలికలో వాళ్లలో కల్పించుకొని సంతృప్తి పడడంలో ఏం ఆనందం ఉంది? ఏ మాటకామాట చెప్పకోవాలంటే ఇద్దరికీ హస్తి మశకాంతరం తేడా ఉండొచ్చు ... కన్పించవచ్చు ... మనసులో గీసుకొన్న బొమ్మకన్నా ఎదురుగా జీవమున్న బొమ్మలో మనకాకావలసిన లావణ్యాలు చూడడం...చూశామనుకోవడం ఆత్మవంచన. పరస్పర విరుద్ధమైన ఆలోచనల్తో ఏం తోచక తల కిందికి దించుకొని మళ్ళీ పుస్తకం తెరవబోయాను.

"అమ్మయ్య! మీరు తెలుగువాళ్లేనా?" అంది ఆమె అకస్మాత్తుగా.

ఎదురుచూడని ఆమె ప్రశ్న-నా తెలుగుదనం ఆమెకెలా తెలిసిందన్న ఆశ్చర్యం నన్నోక్షణం కంగారుపెట్టేయి. నా చేతిలోని పుస్తకం చూశాక సంగతి అర్థమైంది.నా ఆశ్చర్యం అదృశ్యమైంది.

ఆమె ప్రశ్నకు స మా ధా న ం గా "అవును" అన్నాను.

నవ్వుతూ "ఆఁహాఁ" అంది.

ఆ కళ్ళలో ఏదో విశేషం ఉంది. కళ్ళలోనేనా? కాదు, చెంపలు, పెదిమలు నవ్వినప్పుడు కనబడే తెల్లని పలువరస...అసలు ఆమె నవ్వులోనే ఏదో ఇంద్రజాలం ఉంది. కొందరు ఎప్పుడూ నవ్వుతూనే ఉంటారు. ఆ నవ్వుకి ఫలానా కారణం ఉండాలని లేదు. దగ్గరవాళ్ళను చూసినప్పుడు, అభిమాన పాత్రులను కలుసుకొన్నప్పుడు, సంతోషకరవార్త విన్నప్పుడు, మనసులో ఏదో అందమైన ఆలోచన వచ్చినప్పుడు ...చప్పుడు కాని నవ్వు...ముత్యాల్లాంటి పలువరస కన్పించేలా ఎర్రని పెదిమలుకదులుతూ...చెంపల మీదికి ప్రాకి...కళ్ళలోకి నుదుటి మీదికి కన్బొమల పైకి చర చర పాదరసంలా వ్యాపించే అంత మనోహరమైన దరహాసం చాలా కొద్ది మంది సొత్తు.

"ఎక్కడికి వెళ్తున్నారు మీరు?" అనడిగాను ఆమె చెవులకు ఉన్న పెద్ద పెద్ద రింగులను చూస్తూ.

"మద్రాసే... మాది"

"అంటే?"

ఆమె మరోసారి నవ్వింది.

"మాది ఈఊరే. మావారికి ఇక్కడ పోర్ట్‌లో ఉద్యోగం. ఢిల్లీ కేంప్‌కి వెళ్తూ నన్ను మా వాళ్ళింటికి విజయవాడ దిగబెట్టారు. విజయవాడనుంచి నేనూ, ఢిల్లీ నుంచి ఆయనా ఇవాళ ఇక్కడికి చేరాలని అనుకున్నాం. నేను ముందొచ్చేశాను. దక్షిణ్ ఎక్స్‌ప్రెస్ గంటలేటు... అందులో ఆయనొస్తారు. కలిసే ఇంటికి పోదామని వెయిట్ చేస్తున్నాను."

"వారికేం ఉద్యోగం?"

"పోర్ట్‌లో కన్‌స్ట్రక్షన్ ఇంజనీరు."

పిల్లలా — అని అడుగుదామనుకొని మానేశాను. వెధవ ప్రశ్న. మరింకేదీ లేనట్టు!

"పుట్టింటి నుంచి చాలా తెచ్చినట్టున్నారే ... అంత పెద్ద పెట్టె పట్టుకొచ్చారు..." అన్నాను.

అదే నవ్వు. మొహంలో అదే ప్రశాంతత.

"వారికి సున్ని ఉండలూ, అరిసెలూ చాలా ఇష్టం. వెల్లుల్లి ఆవకాయ అంటే ప్రాణం ... మా అమ్మ చేత అవన్నీ చేయించేను..." అంది.

అంతలో దక్షిణ్ ఎక్స్‌ప్రెస్ త్వరలో వస్తున్నట్టు ఎనౌన్స్ చేశారు. ప్లాట్‌ఫామ్ మీది జనంలో కలకలం హెచ్చింది. చక్రాల్లాంటి కళ్ళు తిప్పుతూ అటూ ఇటూ చూస్తోంది ఆమె.

"అన్నట్టు—మీరేం చేస్తుంటారు?" అంది హఠాత్తుగా నా వేపు తిరిగి.

చెప్పాను.

మొహం అదోలా పెట్టింది. "అబ్బ. మీ పత్రిక వట్టి బోర్. ఒక్క కథా బాగుండదు" అంది.

నాకు ఏదోలా అన్పించింది. "ఏం చేస్తాం? వచ్చిన వాటిలో బాగున్నవి..." అంటూ సమర్థించబోయాను.

"మీరూ ఏమైనా రాస్తారా?" అంది.

"ఏదో... అప్పుడప్పుడు..."

"వెరీ గుడ్. మీ పేరు?"

"గోపీనాథ్"

— అని సమాధానం చెప్పానే కాని ఆమె విన్నట్టు లేదు.

కూర్చున్నదల్లా హఠాత్తుగా లేచి నిలబడింది. నా వేపు చూస్తూ "అలా లేడీస్ వెయిటింగ్ రూమ్‌వేపు వెళ్ళొస్తానండీ... కాస్త ఆ పెట్టె చూస్తూ ఉండండి" అంది.

ఈసారి కూడా నా అంగీకారం వినకుండా ప్లాట్‌ఫామ్‌కి ఆ చివరనున్న లేడీస్ వెయిటింగ్ రూమ్ వేపు విస విసా నడవడం ప్రారంభించింది.



## 3

ఆమె వెళ్ళి చాలా సేపైంది. అరగంట పైగానే అయింది. ఇంకా రాదేం? హిగిన్ బాదమ్స్‌లో ఏవైనా పుస్తకాలు కొనుక్కుందుకు ఆగిందేమో... అయితే మాత్రం ఇంత సేపా? అన్నట్టు ఆవిడ పేరు? అడగడం మర్చిపోయాను.

ఛ. ఛ.

అల్లంత దూరాన దక్షిణ్ ఎక్స్‌ప్రెస్ బొయ్యిమని కూత పెట్టింది. బంధువుల్నీ, హితుల్నీ రిసీవ్ చేసుకోవడానికి వచ్చిన వాళ్ళతో, పోర్టర్లతో ప్లాట్ ఫామ్ సందడి మరింత ఎక్కువైంది.

ఎక్స్‌ప్రెస్ వస్తున్నట్టు తెలిసికూడా-తిరిగి రాదేం? పైగా ఈ ట్రెయిన్లో తన భర్త వస్తున్నాడంది. ఒకవేళ...ఆమెకు ఏమయినా అయిందేమో! లేడీస్ వెయిటింగ్ రూమ్‌లో హఠాత్తుగా స్పృహ తప్పి... గుండె ఆగి...!!

ఆ ఆలోచన రాగానే నా గుండెలో రైళ్ళు పరుగెట్టేయి. అంతలో దక్షిణ్ ఎక్స్‌ప్రెస్ ప్లాట్ ఫామ్ మీదికి రానే వచ్చింది.

తమ కోసం వచ్చిన వాళ్ళని పలకరిస్తూ, పోర్టర్లకు లగేజి పురమాయిస్తూ, సామాన్లు లెక్క చూసుకొంటూ, ప్రయాణీకులు ఒక్కొక్కరే బండి దిగుతున్నారు. వాళ్ళలోనే ఉండి వుండాలి ఆమె భర్త. దిగుతున్న వాళ్ళలో అతన్ని ఊహించడానికి ప్రయత్నించాను. కాని నా వల్ల కావటం లేదు. తల తిప్పి మళ్ళీ లేడీస్ వెయిటింగ్ రూమ్ వేపు చూశాను. ఎక్కడా ఆమె జాడలేదు.

అంతవరకూ ప్రశాంతంగా ఉన్న నా మనస్సు అల్లకల్లోలం అయిపోయింది. పోనీ-లేడీస్ వెయిటింగ్ రూమ్ వరకూ పోయి ఆమె సంగతి కనుక్కొందామంటే-ఈ పెట్టెని ఏం చెయ్యాలి? పెట్టె చిన్నదీ చితకదీ కాదు. భోషాణం పెట్టెలా ఉంది. మోసేబలం నాకులేదు. వెనకటికి సిద్ధుడిచ్చిన పాదలేపనం ప్రవరాఖ్యుడిని బంధించింది. ఈనాడు-నన్నీ ట్రంకు పెట్టె ఇక్కడ కట్టిపడేసింది. చేసేది లేక, రకరకాల ఆలోచనలతో సతమతం అవుతూ అలాగే నిలబడిపోయాను. దక్షిణ్ ఎక్స్‌ప్రెస్‌లోంచి జనాభా అంతా దిగిపోయారు. ఆవిడగారి భర్త వచ్చినట్టు లేదు. వస్తే......ఆమె కోసం తను ఎదురు చూసేవాడేగా! మరి ఆ బాపతు మనిషెవరూ నాకు తటస్థపడలేదు. నా శరీరం అక్కడున్నా, మనస్సు ఇంకెక్కడో ఉంది. ఎంత ఆలోచించినా ఏమీ తట్టడం లేదు. పెద్ద భోషాణంలాంటి ఆ పెట్టె మాత్రం నన్ను వెక్కిరిస్తోన్న దిష్టిబొమ్మలా ఉందక్కడ.

అంతలో నా మెదడులోకి మరో పురుగు ప్రవేశించింది. ప్రవేశించడం తడవు ఒళ్లంతా చెమట్లుపట్టాయి. కొంచెం వణుకు కూడా ప్రారంభమయింది. అతి ప్రయత్నం మీద జేబులోంచి సిగరెట్ తీసి పెదిమల మధ్య ఇరికించాను. గీస్తూంటే మూడు అగ్గిపుల్లలూ వెలిగి ఆరిపోయాయి. చివరిది-నాలుగోది వెలిగింది. గట్టిగా దమ్ములాగి గుండెల నిండా పొగ పీల్చాను. దడదడ లాడుతున్న గుండెలతో పిరిగ్గా ఆ పెట్టెవేపు చూశాను. అదెక్కడికి పోతుంది? ఎక్కడికీ పోదు. అక్కడే ఉంది.

మెదడులోకి మరిన్ని పురుగులు బిలబిలలాడ్తూ రాసాగేయి. చిత్తం వచ్చినట్టు విశృంఖల విహారం చేస్తున్నాయి. మెదడు మొద్దుబారిపోతూంది. ఆ పెట్టె వేపు చూస్తూఉంటే ఏవేవో సినిమాలూ,

పుస్తకాల్లో చూసిన కథలూ గుర్తుకు రాసాగేయి.

కొంపదీసి— నా అనుమానం గనక నిజమే అయితే...

డబ్బు కోసమో, లేకపోతే పర పురుషుడి మీది వ్యామోహం వల్లనో ఆమె తన భర్తని చంపి ఉంటుంది. శవాన్ని ఖండఖండాలుగా నరికి ఈ పెట్టెలో పెట్టి ఉంటుంది. ట్రెయిన్‌లోనో, ప్లాట్ ఫామ్ మీదో వదిలేసి పోదామను కొని ఉంటుంది. అంచేత, ఇలా కట్టుకథ అల్లి పెట్టెను నాకు అప్పచెప్పింది... అంతేనా?

లేకపోతే స్పృహతప్పి పడిపోవడం లాంటిదిగాని జరిగిందా? అటువంటిది ఏదైనా జరిగితే నాకు తప్పక తెలుస్తుంది. పైగా లేడీస్ వెయిటింగ్ రూమ్ పెద్ద దూరంలో ఏం లేదే! ఏం జరిగినా ఇక్కడికి స్పష్టంగా కనిపిస్తుంది.

పోనీ — ఇంకొకలా జరిగి ఉండ కూడదూ? అంత అందగత్తెను, మిసమిస లాడే యవ్వనంలో ఉన్న అమ్మాయిని ఎవరైనా ఎత్తుకు పోలేదు గద! మరీ ఇంత ఘోరమా? పబ్లిక్ ప్లాట్ ఫామ్ మీద—పట్టపగలు - ప్రవాహంలా జనం ఉంటూ ఉండగా—ఎత్తుకు పోవడానికి ఎవడికేనా ఎన్ని గుండెలు ఉండాలి?

మరైతే-ఏమైఉంటుంది? ఈ ప్రశ్న నాలో నేను లక్షసార్లు వేసుకున్నాను. కాలం గడిచిపోతున్నది కానీ 'ఆమె' తిరిగి వచ్చే సూచనలు కన్పించడంలేదు. నేను మాత్రం ఇక్కడ—ఈ ప్లాట్ ఫామ్ మీద ఎంతకని ఉండగలను? ఆ పెట్టెనీ, నన్నూ చూసి, టిక్కెట్టు లేని ప్రయాణీకుడి కింద జమకట్టి వందలు వందలు పెనాల్టీ కట్టమంటారేమో... నా ప్లాట్ ఫామ్ టిక్కెట్టు చూపించి 'ఆమె'సంగతి చెప్తే మాత్రం ఎవరు నమ్ముతారు? కళ్లు తెరవని పసిగుడ్డు కూడా నా కథ విని నవ్వుతాడు... ఇప్పుడేం చెయ్యడం? సిగరెట్ పీలుస్తూ రెండు నిమిషాలపాటు ఆలోచించాను...చాలా దీర్ఘంగా ఆలోచించాను.

అంతలో దూరంగా పోలీసులు కనిపించారు. ఇన్‌స్పెక్టర్‌తో కలిపి అయిదారుగురు ఉన్నారు. ప్లాట్‌ఫామ్ మీద ఉన్న సామాన్లన్నీ పరీక్షగా చూస్తున్నారు. అనుమానం ఉన్న పెట్టెల్ని తెరిపించి మరీ చూస్తున్నారు. ఇటువంటి పరిస్థితిలో నన్ను ఇరికించి వెళ్లిపోయిన ఆమెను కసితీరా తిట్టుకోవడం ప్రారంభించాను. తరవాత నన్ను నేను తిట్టుకొన్నాను.

వాళ్లు దగ్గరికి వచ్చేస్తున్నారు.

చేతిలోని సిగరెట్ పారేసి కింది చూపుల్తో వాళ్ల బూట్లవేపే చూస్తున్నాను నేను. బూట్లు మరీ దగ్గరికి వచ్చేశాయి. "హలో" అంటూ నవ్వుతూ పలకరిస్తున్న కుర్ర ఇన్‌స్పెక్టర్ని అయోమయంగా చూశాను. అతను ఒక అడుగు ముందుకు వేసి, తలమీది టోపీని తీసి చేత్తో పట్టుకున్నాడు. తన కుడిచేతిని ముందుకుచాస్తూ— "నన్ను గుర్తుపట్ట లేదా?" అన్నాడు.

కరచాలనం చేస్తూంటే జ్ఞప్తికి వచ్చింది.

సుధాకర్‌రావు అతని పేరు. వచన కవిత్వం రాస్తాడు. తను రాసిన కవిత్వం పట్టుకొచ్చి-రెండుగంటలు సేపు చదివి వినిపించాడు...పత్రికలో అచ్చయ్యేలా చూడమన్నాడు...... మీరింకా కృషి చెయ్యాలి అని నేనేదో పెద్ద లెక్చరిస్తే బుద్ధిగా విని అలాగే అని వెళ్లిపోయాడు.. ఎప్పుడూ? నిన్ననేగా! మరి తను ఇన్‌స్పెక్టర్‌గా పని చేస్తున్నట్టు చెప్పలేదేం? అలా అనుకొంటూనే మిగతా పోలీసుల్ని ఓరకంట గమనించాను. వాళ్ల దృష్టి ఆ ట్రంకు పెట్టె మీదే ఉంది.

ఈ సంకట పరిస్థితి ఎలా తప్పుతుందో నాకు అర్థం కాలేదు. అతనికీ నాకూ పెద్ద స్నేహం ఏం లేదు. కేవలం పరిచయం. అదీ ఒక్క రోజే. ఆ పరిచయం మాత్రం ఎలాంటిది? పత్రికలో పనిచేసే వాడికీ-కొత్తగా కవిత్వం మొదలెట్టిన కవికీ ఎలాంటి పరిచయం ఉంటుంది?

నా గోడు ఇతను నమ్ముతాడన్న నమ్మకం లేదు.

"ఏం సార్, ఇంకా గుర్తుకు రాలేదా? నిన్న మీ 'కాంతి' ఆఫీసుకి వచ్చాను. నా కవిత్వంతో పాపం మిమ్మల్ని రెండు గంటలు ఊదరగొట్టేశాను..."

"నోనో...అలా ఎందుకనుకుంటున్నారు?" అన్నాడు నొచ్చుకున్నట్టు మొహం పెట్టి.

"నిజం చెప్పండి... జ్ఞాపకానికి వచ్చేనా?" అన్నాడు మళ్లీ.

"ఆఁ. వచ్చారు లెండి"

"సరే- కానీ- ఇక్కడున్నారేమిటి? ఎవరి కోసమైనా నిరీక్షణా!"

జరగబోయేదీ ఎలాగూ జరగక మానదు. అతనికి అసలు విషయం ఉన్నది ఉన్నట్టు చెప్పేద్దామనిపించింది. నీడా మునిగాక చలేమిటి?

"రండి కూర్చుందాం" అంటూ సిమెంటు బెంచి మీద నేను కూర్చున్నాను. సిగరెట్ పేకెట్ తీసి అతని కొకటి ఆఫర్ చేశాను. మరొకటి పెదమల మధ్య పెట్టి జేబుతడుముకో సాగాను. అంతలో సుధాకర్ అగ్గిపుల్ల గీసి నా సిగరెట్ వెలిగించాడు. సిగరెట్ పీలుస్తూ- జరిగినదంతా ఒక్కొక్కటే పూసగుచ్చినట్టు వివరంగా చెప్పాను. నేను చెప్పిన దానిమీద నమ్మకం కుదరక పోతే-నేను చేయగలిగిందేమీ లేదనీ- తనిష్టం వచ్చినట్టు చేసుకోమనీ చెప్పాను. అంతా వినినవ్వుతూ లేచాడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్. పోలీసుల వేపు తిరిగి-పెట్టె తాళం బద్దలు కొట్టమన్నాడు.

తాళం ఒక పట్టాన ఊడిపడలేదు. ఈలోగా చుట్టూరా జనం చేరారు. పెట్టె లోపల చూశాక నాకు మతిపోయింది. నేను అనుమానించినట్టు శవమూ, చట్టి బండలూ లేవు. అయితే అందులో ఉన్న దేమిటో ఎంత చూసినా అర్థం కాలేదు నాకు.

"మిమ్మల్ని చూసి ఏ వూరికైనా ప్రయాణం కట్టేరేమో...అసలు పెట్టె మీదేనేమో అనుకున్నాను. మొదట్లో నాకేం అనుమానం రాలేదు. మీరు అసలు విషయం చెప్పేసరికి-వెతుకుతున్న తీగ కాలికే తగిలినట్టయింది.." అంటున్నాడు

సుధాకర్.

అయినా నాకేమీ అర్థం కాలేదు.

"ఏమిటలా చూస్తున్నారు? అవేమిటో తెలుసా? నల్లమందు, గంజాయి... ఈ పెట్టెలోని సరుకు విలువ కనీసం పాతిక వేలు ఉంటుంది. శ్రీకాకుళం ముఠా ఒకటి రెగ్యులర్‌గా ఈ పని చేస్తూంది"

"అంటే–ఆవిడ స్మగ్లింగ్..."

"అంతే మరి. నిజం చెప్పాలంటే– ఆ ఆడదానికోసం పిచ్చివాడిలా వేటాడేను ఇన్నాళ్లూ. అయినా దొరకలేదు. ఈసారి కూడా సరుకు వదిలేసి నా కంట్లో కారం కొట్టి మరీపోయింది... ఎప్పటికేనా నా చేతికి దొరుకుతుంది లెండి!"

ఆమెను ఎలాగైనా పట్టుకు తీరాలన్న పట్టుదల ధ్వనించింది అతని మాటల్లో.

ఎదురుగా పోలీసులు. జనం. పెట్టె. దాంట్లో నల్లమందు. గంజాయి. నా కళ్ళను నేనే నమ్మలేకపోతున్నాను.

"మీరున్నారు కనక, మీ సంగతి కాస్తో కూస్తో నాకు తెలుసు కనక సరిపోయింది. లేకపోతే మీ స్థానంలో ఇంకెవరున్నా–నా అనుమానాలకు అంతుండేది కాదు..."

"ఆ దౌర్భాగ్యుడి పాట్లు కూడా అనంతమేగా!" అన్నాను నేను గుండె తేలిక పడగా.

"కదా మరి!" అని నవ్వేడు. అంతలో మళ్ళీ నా వేపు తిరిగి "అయినా మీరొకసారి స్టేషన్‌కి రండి. ఇక్కడే, ఆ ఆడమనిషిని మీరు దగ్గరగా చూశారు గనక– ఆ వివరాలు చెప్పండి... రికార్డ్ కోసం..." అంటూ పెట్టె వేపు తిరిగాడు.

పోలీసుల తంతు ముగిసే వరకూ నేనూ అందరితోపాటు బొమ్మలా నిలబడిపోయాను.

స్టేషన్‌కి నడుస్తున్నప్పుడు 'ఆమె' నా మనోనేత్రం ముందు ఒక్కసారి మెరుపులా మెరిసింది.



# 4

పత్రికలో నాతోపాటు వాసు అనే కుర్రాడు పనిచేస్తూ ఉండేవాడు. అతను అకస్మాత్తుగా చనిపోయాడని విన్నాను. వాసు పుట్టుపూర్వోత్తరాలేం నాకు తెలీవు. పరిచయం ఏర్పడి కలసి పని చేసిన నెలరోజుల్లోనూ వాసు అంటే నాకు మంచి అభిప్రాయమే ఏర్పడింది. ఇరవై ఏళ్ళలోపే ఉండి, ఎంతో చురుగ్గా పని చేసేవాడు. నన్ను 'గురువుగారూ' అంటూ పిలిచేవాడు. అంతే. అవి తప్ప అతని కుటుంబ విషయాలేవీ నాకు తెలీదు. అతను లేనిలోటు కన్పించసాగింది. నా పనీ, అతని పనీ పూర్తి చేసేప్పటికి తల ప్రాణం తోకకి వస్తోంది... ఇదిలా ఉండగా పత్రిక ప్రింటు అవుతున్న ప్రెస్ ఆర్థిక ఇబ్బందులవల్ల మూలపడింది. అరువుగా

అచ్చేసే మరొక ప్రెస్సు దొరికేవరకూ పత్రిక కూడా తాత్కాలికంగా ఆగిపోవాల్సి వచ్చింది...దాంతో నాకు కాస్త తీరుబడి దొరికింది. సెంట్రల్ స్టేషన్ లోని ఆ 'సంఘటన' జరిగి అప్పటికి నెల దాటింది.

ఈ నెలరోజుల్లో నేనేం చేస్తున్నప్పటికీ, కనీసం రోజుకు ఒకసారైనా 'ఆమె' గుర్తుకువచ్చేది. మెరుపులా మెరిసి మాయమైపోతూ ఉండేది.

ఆమె నవ్వు...ఆమె మాటలు...పదే పదే జ్ఞాపకం చేసుకొనేవాడిని. తియ్యగా మాట్లాడి మోసం చేసిందన్న కోపం కొన్నాళ్ళుండేది. కాని దాని స్థానే కుతూహలం ఏర్పడింది ఇప్పుడు.

ఇరవై ఏళ్లన్నా ఉంటాయో ఉండవో...పెళ్ళిగిళ్ళీచేసుకొని సుఖంగా కాపరం చేసుకోక - ఈ 'నల్లమందు' గొడవల్లోకి ఎందుకొచ్చిపడిందో? ఆమె పేరు నాకు తెలీదు. రూపం కూడా మర్చిపోయాను. ఎంతో ప్రయత్నిస్తేగానీ ఆమె పూర్తి ఆకృతిని ఊహించుకోలేక పోతున్నాను. నా ఊహలు ఒక కొలిక్కి రాకముందే నాగరత్నం నా కళ్ల ముందు నిలుస్తోంది. ఇంకొకరెవరైనా అయితే 'ఆమెను' బాగా గుర్తుపెట్టుకొనేవారు. కాని నా పరిస్థితి వేరు. నా మనసు నిండా నాగరత్నం నిండి ఉంది. కలలో మెలకువలో నాకు కన్పించేది నాగరత్నం రూపమే... ఇంకొకరికి... ఇంకెవరికీ కాస్తయినా చోటు లేదు. నా కంటికి అందరు ఆడవాళ్ళూ ఒక్కలాగే కన్పిస్తారు. ఒక్క నాగరత్నమే భిన్నంగా తోస్తుంది. అయితే, నాగరత్నం పోలికలు ఏ ఒక్కటి అయినా ఎవరిలో కన్పించినా కాసేపు అటే చూస్తాను. ఆ రోజు సెంట్రల్ స్టేషన్‌లో 'ఆమె' నన్ను ఆకర్షించడానికి కారణం కూడా అదే !

అయిదేళ్ళనాడు నా జీవితంలోంచి అదృశ్యమైన నాగరత్నాన్ని నా కళ్ళ ముందు సాక్షాత్కరింపజెయ్యడమే ఆమె లోని విశేషం. తియ్యని కబుర్లు చెప్పి ప్రమాదం పసిగట్టగానే నన్ను ఇరికించి, పోలీసుల కళ్ళు కప్పి మాయంకావడం... అదంతా తల్చుకొంటే నాకు ఒళ్ళంతా జలదరిస్తుంది. ఏదో అద్భుత దృశ్యం చూసిన భ్రాంతి కలుగుతుంది.

ఒక్కసారి—అంతా కలా నిజమా అని కూడా అన్పిస్తూ ఉంటుంది.

అంతవరకూ నాగరత్నం తప్ప మరొక స్త్రీ గురించి. నేనెన్నడూ ఎక్కువగా ఆలోచించలేదు. కాని, ఆ సంఘటన జరిగాక 'ఆమె' గురించి ఆలోచనలు రాసాగాయి. 'ఆమె' మళ్ళీ మరొక్కసారి—ఒకే ఒక్క సారి కన్పిస్తే బావుణ్ణని చాలాసార్లు అనుకొన్నాను.

నాలోని ఈ మార్పుకి కారణం ఏమిటి ?

నాగరత్నం మరి కనబడదని నేను నిరాశ చేసుకొంటున్నానా ? నాగు రూపాన్ని—నాగరత్నం సజీవ రూపాన్ని 'ఆమె' సామీప్యం వల్ల సాధించగలనా ? ఏమో ! మళ్ళీ ఎప్పుడో ఎక్కడో ఆమె నా కళ్ళ ముందు మెరుపులా మెరిసి మాయం అవుతుంది ... కాని ఏం లాభం? తను ప్రత్యక్షమైన ఆ ఒక్క

క్షణం నా నాగరత్నాన్ని నా కోసం నా ముందు నిలబెడుతుంది. ఆ తరవాత?,

ఎక్కడుంది నాగరత్నం? ఏమైంది??

కణతలు రుద్దుకొంటూ లేచాను. చేతి నిండా పని లేకపోయేసరికి ఆలోచనల నాడి ఎక్కువైంది. ఊరు కాని ఊరు. భాష రాదు. పోనీ సుధాకర్ వచ్చినా కాస్త బాగుండేది. ఈ సారి వచ్చినపుడు అతని అడ్రెస్ తీసుకోవాలి ... గది తలుపు తాళం వేసి రోడ్డెక్కాను.

* * * *

గీతాలో టిఫిన్ కాఫీ అయ్యాక, సిగరెట్ కాలుస్తూ హోటల్ బైట నిలబడ్డాను. అదేరోడ్డు. అదే జనం. అవే వాహనాలు. అవే చెట్లు. అవే లైట్లు అవే షాపులు. కాని నాకెప్పుడూ కొత్తగానే ఉంటుంది. ఆ హడావుడి జీవితాన్ని చూస్తూ ఆ వేగాన్ని నేనుఅందుకోగలనా-అని ఆలోచిస్తాను. విశ్వ రహస్యం అంతా ఆ ప్రదేశంలో ఉన్నట్టూ—దాన్ని ఛేదించగలనా, బ్రతకగలనా అని ఆలోచిస్తూ ఉంటాను. ఈ మహాజన ప్రవాహంలో నాగరత్నం ఎక్కడైనా ఉందేమో!

ఏమో !!

"సార్!"

నా ఏకాగ్రతని భంగం చేసిన ఆ వ్యక్తి వేపు చూశాను. తమిళంలో ఏదో అంటున్నాడు. అతని సైగలను బట్టి, అతని నోట్లోని బీడిని చూసి అగ్గిపెట్టె ఇచ్చాను. బీడీ వెలిగించుకొని అగ్గిపెట్టె తిరిగి ఇచ్చేస్తూ మళ్ళీఏదో అని వెకిలిగా నవ్వాడు ... అయినా నా మొహంలో మార్పు రాకపోవడం చూసి భాష మార్చాడు. ఈ సారి ఇంగ్లీష్ దంచి పారేస్తున్నాడు. రహస్యంగా చెప్తున్నట్టు గొంతు తగ్గించి పావుగంట సేపు నాతో అతను మాట్లాడిన ఆంగ్ల భాష సారాంశం ఇది:

'దగ్గర్లోనే సినీతార వంటి అందమైన అమ్మాయి లభిస్తుంది. కొత్తగా వ్యవహారంలోకి అడుగు పెట్టింది. సంసార్లుండే కొంపలో ఉంటున్నది గనక గుట్టు చప్పుడు కాకుండా పని ముగించుకోవాలి. మూల్యం అతి స్వల్పం. కేవలం పది రూపాయిలు మాత్రమే. నేను రెండు రూపాయల్లోనే సంతృప్తి పడగలను.'

ఏ గుమాస్తానో, బట్లరో మాట్లాడినట్టు కాక ఇతని ఇంగ్లీష్ నిర్దుష్టంగా ఉంది. సరైన ఉచ్చారణ. ఆకారం చూస్తే వికారంగా ఉంది కాని, మాటలు వింటే బాగా చదువుకొన్నవాడిలా ఉన్నాడు. మరేమిటీ ఖర్మ ?

అదే అడిగాను.

అతను విసుక్కోలేదు. అదే వెకిలి నవ్వు. ఆరిపోయిన బీడీని అంటించుకోవడానికి మరొకసారి నా అగ్గిపెట్టె ఇచ్చాను. గట్టిగా నాలుగు దమ్ములు లాగి నా వేపు చూశాడు. మరుక్షణం మరో వేపు మొహం తిప్పి "నా ఖర్మ కాదు; ఈ దేశం ఖర్మ ఇది!" అన్నాడు.

'నీ పేరు?'

'అది అంత అవసరమా?'

'లేదులే. కాని, ఈ పని చెయ్యడానికి నీకు మనసెలా ఒప్పింది?'

'ఆ పని చేసేవాళ్ళకి వాళ్ళ మనసు

ఒప్పుకోవడం ముఖ్యం. నాకేం ? నేను కేవలం మధ్యవర్తిని.'

'చదువూ సంధ్యలు లేనివాళ్ళు ఇలా దిగజారేరంటే అర్థం ఉంది. చదువుకొన్న వాడివి నీ కిదేం బుద్ధి?'

నా మాటలు విని నన్నతను చురుగ్గా చూశాడు.

అతని కళ్ళలో నీళ్ళు కదిలినట్టయింది. అయినా కంఠంలో మొండితనం పోలేదు.

'ప్రపంచమంతటా ప్రతి చోటా ఈ వ్యాపారం సాగుతోంది. తాహతున్న పెద్దలు పెద్ద ఎత్తున వ్యవహారం చేస్తున్నారు. లేనివాళ్ళు చిన్న తరహాలో చేస్తున్నారు ...' అంటూ ఆగి మరోసారి నన్ను చూశాడు.

'దీని గురించి గంటల తరబడి చెప్పుకోవచ్చు. అందుకు ప్రస్తుతం నాకు ఓపికా, వ్యవధీ రెండూ లేవు. మళ్ళీ మనం ఎప్పుడైనా కలుస్తే తీరిగ్గా మాట్లాడుకోవచ్చు...ముందీ సంగతి తేల్చండి. నేను చెప్పిన చోటికి వస్తారా, రారా?' అన్నాడు.

ఇంత సేపూ మాసంభాషణ ఇంగ్లీష్ లోనే సాగింది... అతని ప్రశ్నకి ఏం సమాధానం చెప్పాలా—అని ఒక్క క్షణం ఆలోచించాను.

వెంటనే తలూపి 'ఆల్ రైట్. పద' అన్నాను.

అతను ముందు, నేను వెనకా నడక ప్రారంభించాం.



## 5

అలా అరమైలు దూరం నడిచాక ఒక చీకటి సందు వచ్చింది. సందులో కాస్తంత దూరం నడిచిన తర్వాత ఒక శిథిలమైన డాబా ఇంటి ముందు ఆగేం. నన్నక్కడే ఉండమని చెప్పి అతను లోపలికి వెళ్ళేడు. అంతలోనే మళ్ళీ వచ్చి నన్ను డబ్బడిగాడు. ఒక పది రూపాయిల నోటూ, రెండు రూపాయిల నోటూ అతని చేతిలో పెట్టాను. అతను మళ్ళీ ఆ ఇంట్లోకి వెళ్ళాడు.

ఏవో లాంతర్లూ, కోడిగుడ్డు దీపాలూ తప్ప ఆ వీధిలో ఎవరి ఇంట్లోనూ విద్యుద్దీపాలున్నట్టు లేదు. అంతా... ఆ వీధి అంతా మసకమసగ్గా ఉంది. గాల్లో తేలుతోన్న దయ్యాల్లా మనుషుల ఆకారాలు... ఏవేవో నీడలు...స్మశానంలో చితి కాలుతున్నట్టు పదధ్వనులు. ప్రేతాత్మల ప్రేలాపనల్లా తాగుబోతుల ఉన్మత్త ప్రలాపాలు. వీటన్నింటి మధ్యా కీచుమంటూ ఎవరో స్త్రీ ఆర్తనాదం. ఉలిక్కి పడ్డాను. ఇవన్నీ నేను ఊహించుకొంటున్నానా? ఇవి నిజమేనా? కళ్ళు నులుముకొని మరోసారి ఇటూ అటూ చూశాను. నిజమే... ప్రజ్వరిల్లే చితిమంటల్తో రాత్రిపూట స్మశానవాటికలా

ఉంది ఈ సందు. ఆ నీడలు... ఆ ధ్వనులు... ప్రలాపాలు... కీచు కేక... ఇవన్నీ యదార్థమే !

ఈ చీకటి సందులోకి నేనెందుకు వచ్చాను?

స్త్రీల కుసుమకోమలశరీర స్పర్శా సుఖాలకా?

కాదు. నేనూ సగటు మనిషినే. అందరిలాగే నాకూ నా బలహీనతలు ఉన్నాయి. నేనొక పెద్దమనిషిననీ, నీతి పరుడననీ చాటుకోగలిగిన ఆత్మవంచ కుడిని కాలేను. ఎవరికీ ఏ హానీ కలిగించ కుండా నా చిలిపి సరదాలు నేను చాలా కాలం క్రిందటే తీర్చేసుకొన్నాను. నాలో- ఇప్పుడు ఇంకా ఆ సరదాలు మిగిలి వున్నాయని నేను అనుకోవడంలేదు.

'అందమైన అమ్మాయి' లభించును- అంటూ చక్కని ఇంగ్లీష్‌లో ఆహ్వా నించిన ఆ వ్యక్తి వెంటపడి ఈ చీకటి సందులోకి రావడానికి కారణం కేవలం స్త్రీ వాంఛ కానేకాదు. నిజం చెప్పాలంటే నాగరత్నంలో తప్ప నేను మరే స్త్రీలోనూ పరిపూర్ణ స్త్రీత్వాన్ని సందర్శించలేను. మరెందుకు ఇతని వెంటపడి రావడం?

అందుకు ఒక కారణం కాదు. సవా లక్ష కారణాలు ఉన్నాయి.

నా శరీరం ఇప్పటికి మూడు పదుల జీవితం మాత్రమే గడిపింది. కాని, శతాధిక వయస్కుడికి ఉండదగిన మనః పరిణతిని పొందాను. ఎలా? నేను చూసిన జీవితాలు నేను తిరిగిన ప్రదేశాలు నాకు తారసపడ్డ వందలాది స్త్రీ పురు షులు. వాళ్ళ అంతరంగ జీవితాలు. నా అదృష్టమో, దురదృష్టమో కాని, నాతో ఏమాత్రం పరిచయం పెరిగినా, మగా, ఆడా కూడా తమ జీవితాల్ని పుస్తకంలా తెరిచేవారు. అందులో జటిలమైన, క్లిష్ట మైన సమస్యల వలయాలు... సూక్ష్మ దర్శినితో చూసినట్టు చూశాను. వాళ్ళలో చాలామందికి నా సంగతి తెలుసు. బహుశాః నాలోని రచయితని ఎప్పీల్ చేయడానికే వాళ్ళలా ప్రవర్తించే వారేమోనని నా అనుమానం. నా మూడు పదుల జీవితంలోనూ నేను ఎక్కువ కాలం ఒకేచోట గడపలేదు. పుట్టుక ఒకచోట. పెరగడం ఒకచోట. విద్యా భ్యాసం, ఉద్యోగాన్వేషణ, ఉద్యోగం, అది మాని మరో ఉద్యోగం, అదీ మానేసి వేరొక ఉద్యోగం.. వివిధ ప్రాంతాల్లో విభిన్న వాతావరణాల్లో కొనసాగేయి.

నా పద్దెనిమిదవ ఏట- అను కొంటాను-నా కళ్ళు పూర్తిగా తెరిచి లోకాన్ని చూడడం ప్రారంభించాను. చూసిన ప్రతిదీ అర్థం చేసుకోడానికి ప్రయత్నించాను. మొట్టమొదటిసారి నా కౌమార హృదయాన్ని గాయపరిచి శాశ్వత ముద్ర వేసిన సంఘటన ఒరిస్సాలో జరిగింది. అప్పుడు ఉద్యోగ రీత్యా మా నాన్నగారు ఛత్రపూర్‌లో ఉండేవారు. సెలవులకు అక్కడికి వెళ్ళాను నేను...'ఆకలిబాధకు తాళలేని ఒక స్త్రీ తన కన్న కూతుర్ని-పదేళ్ళ కుర్రదాన్ని-ఏభై రూపాయలకి అమ్మే సింది' అని ఒకరోజు విన్నాను నేను. విని నమ్మలేకపోయాను. రూఢి చేసు

కుందామని కనిపించిన ప్రతివారినీ అడిగాను. అంతా నిజమేనన్నారు. ఆనాడు నా మనస్సెంత గాయపడిందో, ఎంత చిందరవందర అయిందో ఎవరూ ఊహించలేరు. ఆనాటి సంఘటన వేసిన ముద్ర, పన్నెండేళ్ళ తర్వాత, ఈనాటికీ నా మస్తిష్కంలో చెక్కుచెదరకుండా ఉంది,

తల్లి క్షుధార్తికి కన్నకూతురు బానిసగా మారింది. వయస్సు వస్తోన్న కొద్దీ, వయస్సు మీరుతూన్న కొద్దీ ఆమె ఇంకెందరి దాహాలకు ఆహుతి అవుతుందో?! మరెన్ని చేతులు మారుతుందో. ఇదొక్కటే కాదు, ఇంకెన్నో సంఘటనలు కూడా చూశాను. చదివాను. విన్నాను. అగ్నిసాక్షిగా పెళ్లాడిన భార్యనే రెండు వేల రూపాయలకు ఒక భర్త అమ్ముకొన్నాడు. నాటి అరబ్ దేశాల్లోనే కాదు, స్త్రీల బానిసత్వం భారతదేశంలో కూడా ఈనాటికీ ఉంది. అయితే అక్కడి పరిస్థితి వేరు. ఇక్కడి పరిస్థితి వేరు. అక్కడ— నడిబజార్లో బానిస స్త్రీ అంగాంగాల్నీ పరీక్షించి, వయసు పొంగులకూ దృఢశరీరానికీ వెలకట్టి కొంటారు. ఆ బానిసను యధేచ్ఛగా వాడుకొని విసుగు వచ్చేక మరొకరికి అమ్మేస్తారు... ఇక్కడా దాదాపు అదే తంతు. అయితే—ముసుగులు మాత్రం రకరకాలు. నూటికి ఏ కొద్దిమందో గౌరవప్రదమైన, స్వేచ్ఛాయుతమైన జీవితాన్ని గడుపుతున్నారు. మిగిలిన వారంతా బానిసలే. అన్ని తరగతుల్లో—అన్ని రకాలవారిలో—ఈ బానిసత్వం ఉంది. దాస్యసదృశమయిన జీవితంలో సతమతం అయ్యే మగవారికి బానిసత్వం చెయ్యడానికి ఎంతో ఓపిక, మరెంత మనోనిబ్బరం ఉండాలి!

బానిసకు బానిస కావడం ఎంత ఘోరం?

ఒకనాడు ఉండేదనుకొన్న అటవీ న్యాయం—అప్పటి సంగతేమో కాని—నాకు ఇప్పుడే స్పష్టంగా కన్పిస్తున్నది. ఇది నా దృష్టి లోపం కాదు. మానవ స్వభావాన్ని విశ్లేషణ చేసి చూసే నా ప్రయత్నంలోని లోటు ఎంత మాత్రం కాదు.

నాగరిక మానవులుండే నగరంలోని మానవుడిగా కాక, కీకారణ్యంలోని జంతువులా సంచరిస్తున్నాను... నేను! ఏనుగులు, సింహాలు, పులులు, చిరుతలు ఎలుగు బంట్లు, తోడేళ్లు, నక్కలు, చారల గుర్రాలు, గుర్రాలు, ఒంటెలు, గాడిదలు, ఆవులు, లేళ్ళు, దుప్పులు, గొర్రెలు, కుందేళ్లు, పాములు, తేళ్లు... తదితర జీవాలు సంచరించే అరణ్యం అది. భయంకరమైనవీ, విషతుల్యమైనవీ సాధువర్తనం కలవీ, అమాయకమైనవీ.. అయిన ఆ జంతువుల మధ్య సహజీవనం చేస్తూ జీవితం ఎలాంటిదో అనుక్షణం చూస్తోనే ఉన్నాను.

ఈ జనారణ్యంలో నాకు ఆసక్తి కలిగించని విషయం అంటూ ఉండదు. లేదు. ఒక్కొక్క విషయం తెలుసుకొంటున్న కొద్దీ— నేనెంత అల్పుడినో, నా ఉనికి ఎంత మూల్యరహితమో నాకు తెలిసివస్తున్నది. ఆ అనుక్షణ అన్వేషణా ఫలితమే నా ఈ చీకటి సందు



# 6

లోపలికి వెళ్ళినవాడు ఇంకా రాలేదు.

అసహనంగా జేబులోంచి సిగరెట్ తీసి వెలిగించాను. అంతలో నాకు మరొక ఆలోచన తట్టింది. ఇది కూడా మోసం కాదు గద! ఈ చీకట్లో నన్నిక్కడ నిలబెట్టి తనెటో పారిపోయాడేమో! నగరంలోకి కొత్తగా వచ్చిన వాళ్ళనీ, అమాయకుల్నీ ఇలా మోసం చెయ్యడం చాలా సార్లు విన్నాను. విన్నప్పుడల్లా మోసగించినవాడి తెలివితేటలకు సంతోషించి, మోసపోయినవాళ్లమీద కసితీర్చుకున్నట్లు ఆనందించేవాడిని. అవును మరి. ఉద్యోగం దొరక్క, సంపాదించిన డిగ్రీతో నాలిక గీక్కోలేక, ఆకలిని చంపుకోలేక ఎవరైన అర్ధా. రూపాయి అడిగితే ఈ పెద్దలేవిసుక్కొంటారు. శారీరక ఆనందాలు దొరికే చోటుచూపించే గైడ్‌కి మాత్రం అయిదులూ పదులూ ధారపోస్తారు ... ఇలా రకరకాల ఆలోచనల్లో నేను కొట్టుమిట్టాడుతూ ఉంటే— ఎదురుగా డాబా తలుపు చప్పుడైంది.

నెమ్మదిగా నడుచుకొంటూ అతను నా వేపు వచ్చాడు. ఎప్పట్లాగే ముఖంలో వెకిలినవ్వు.

"మీరు లోపలకు వెళ్ళండి. ఏంభయం లేదు. మీరొచ్చేవరకూ అదుగో ఆ సారా కొట్లో ఉంటాను" అన్నాడతను ఇంగ్లీష్ లోనే. అనేసి విసవిసా అటు వెళ్ళిపోయాడు. సరిగా డాబా ఇంటికి ఎదురుగానే ఉంది ఆ సారా కొట్టు. నేనింత వరకూ అది గమనించనే లేదు.

జాగ్రత్తగా అడుగులు వేస్తూ ముందుకు నడిచాను. డాబాఇంటిలోపలికి వెళ్ళి తలుపులు దగ్గరగా మూశాను. నా ఎదురుగా పెద్ద గది ఉంది. గదిలోకి కూడా నడిచి— కోడిగుడ్డు దీపం వెలుగులో స్త్రీ ఆకారం కోసం అన్వేషించాను. అంత పెద్ద గదిలో చిన్న కుక్కి మంచం, గోడవారన చిన్న టేబిలూ, ఆ పక్కని స్టూలూ తప్ప మరేవస్తువూ లేదు. మంచం మీద ఏదో బొంతలాంటిది ఉంది. తలగడకు గలీబు లేదు. నూనెజిడ్డు మరకలు కాబోలు నల్లగా ఉన్నాయి. టేబిలు మీద ఏవో పుస్తకాలు... పాత పత్రికలు అట్టలు ఊడినవీ, నలిగినవీ ఉన్నాయి. గోడమీద ఏదో ఫొటో తగిలించి ఉంది. స్టూలు మీదున్న గుడ్డి దీపం రెపరెపా కొట్టుకొంటూ గుడ్డి వెలుతురు విరజిమ్ముతోంది.

అతను చెప్పిన అమ్మాయేదీ?

నాకెక్కడా కన్పించదే!

ఇంత పెద్ద ఇంట్లో ఆమె ఒక్కత్తీ ఉంటోందా? పక్కని మరో గది ఉన్నట్టుంది. కాని చీకటి మూలాన సరిగ్గా తెలియడం లేదు.

"ఎవరూ లేరా?" అన్నాను పెళ్ళూడినగోడల్ని చూస్తో.

'కూర్చోండి ... ఇదిగో...' అంటూ

తెలుగు సమాధానం వినవచ్చింది. ఆ కంఠం స్త్రీదే! కాని...

అంతలో నాదృష్టి గోడమీది ఫొటోపై పడింది. మరింత దగ్గరగా వెళ్ళి చూశాను. ఆ ఫొటో వాసుది! నాతో పాటు పత్రికలో పని చేసి ఇటీవలే మరణించిన వాసు ఫొటో!! అతనొకడే ఆ ఫొటోలో ఉన్నాడు. అతని ఫొటో ఇక్కడ ఎందుకుంది? కొంపదీసి...

ఆలోచనల బరువుతో నా మస్తిష్కం మొద్దుబారిపోయింది. 'గురువుగారూ...' అంటూ ఎంతో ఆప్యాయంగా పిలిచే వాసు కంఠం నా శ్రవణేంద్రియాల్లో హోరుమంటూ ప్రతిధ్వనించ సాగింది.

నిస్సత్తువగా మంచం మీద కూలబడ్డాను. నా చేతులకు ఏదో తగిలింది. తీసి చూశాను. దశాబ్దాల తరబడి వాడకంలో ఉన్న చవకబారు మనీ పర్సు.

అంతలో గది ఇవతల గుమ్మంలో చప్పుడైంది. తలెత్తి చూశాను. గది గుమ్మాన్ని ఆనుకొని క్రింది చూపులు చూస్తూ నిలబడింది ఆమె.

ఆమె నిలబడిన తీరూ వాలకమూ చూస్తూ ఉంటే, ఈ వ్యవహారంలో ఆరి తేరిన దానిలా లేదు. నిన్న కాక మొన్న రంగప్రవేశం చేసినట్టు ఉంది.

"ఇలా రా" అని పిలిచాను.

ఆమె ఉలకలేదు. పలకలేదు.

"నిన్నే. ఇలా రా" అన్నాను.

అప్పటికీ ఆమె అడుగు ముందుకు వెయ్యలేదు.

ఏం చెయ్యాలో తోచలేదు నాకు. ఇలాంటి 'డాబా ఇళ్ళు' నేను గతంలో ఎన్నో చూశాను... విన్నాను... కాని, ఇలాంటి దృశ్యం నాకు ఎక్కడా ఎదురు కాలేదు. అన్నట్లు...ఆ ఫొటో సంగతి... ఈ ఇంట్లో ఎందుకుంది...అది తేల్చుకోవాలి ముందు. మళ్ళీ ఆమెకేసి చూశాను. ఇంకా తల క్రిందికి దించుకొనే ఉంది.

"పది రూపాయలు సమర్పించింది ఇందుకేనా?" అన్నాను తెచ్చి పెట్టుకొన్న కోపాన్ని కంఠంలో పలికిస్తూ.

ఈసారి మాటలు మంత్రంలా పని చేశాయి. తడబడే అడుగులతో నడిచి వచ్చి, నా పక్కనే మంచం మీద కూర్చుంది. ఇందాకట్లా కాక పోయినా, బుర్ర మాత్రం పూర్తిగా ఎత్తలేదు, ఓర కంట నన్ను చూస్తోంది...

హృదయ విదారకమైన దృశ్యం చూసినట్టు నామనస్సు విలవిల్లాడి పోయింది. నన్ను నేను నమ్మలేక మరోసారి ఆమెను దీక్షగా తదేకంగా చూశాను. సిగ్గుతో, వ్యధతో నా తల బద్దలు కొట్టుకోవాలనిపించింది.

మానవత్వపు విలువలు నిశ్శేషమైన ఈనాటి ఆటవిక జీవనంలో, తన కోమల శరీరాన్ని పణంగాపెట్టి, అమూల్యమైన పొందును కేవలం పది రూపాయలకు అందించడానికి సిద్ధపడ్డ ఆ అమ్మాయి వయస్సు— అవును — ఆ అమ్మాయి వయస్సే— పదమూడేళ్ళకు మించి ఉండదు! నడుం ఇంకా సన్నబడలేదు. పిరుదులు లావెక్కి, గుండ్రం కాలేదు. వక్షోజాలు ఇంకా మొలకలదశలోనే ఉండి పరిపూర్ణస్థితికి రాలేదు. అంతెందుకు— కౌమార్యదశ దాటి పది రోజులైనా

అయిందా— అన్నట్టుంది. ఆ చిరుగుల చీరా, జాకెట్టులకుబదులు, పరికిణీ జాకెట్టు తొడిగి— ముఖంలోని విషాదం పీకిపారేసి నవ్వేని అతికిస్తే— ఏ టెన్త్ క్లాస్ స్టూడెంటు లాగానో ఉంటుంది. ఏ బాదర బందీలు లేకుండా, స్వేచ్ఛగా లేడిలా పరుగులు తియ్యాల్సిన వయస్సులో — ఆ అమ్మాయి ఏం నేరం చేసిందని ఈ పడుపువృత్తి పాశాల్లో చిక్కుకుంది.

ఆమెనుండి నా చూపులు మరల్చలేక పోతున్నాను.

ముఖం విషాదంతో గంభీరంగా ఉన్నా నిర్మలంగా గులాబీలా ఉంది. చక్కని తెలుపు. తీరైన ముక్కు.

ఆమె తలను చేత్తో నా వేపు తిప్పుకొన్నాను. రెప్పలు అల్లార్చుతూ నావేపు బితుకు బితుకుగా చూసింది. మళ్ళీ క్రింది చూపులు. మా వాళ్ళు చెప్పినట్టు విని నా ఇరవయ్యో ఏటనే నేను పెళ్ళి చేసుకొని ఉంటే— నాకు ఇంత కూతురే ఉండేది కదూ ? అసంకల్పితంగానే నా చేతిని ఆమె భుజం మీద వేశాను. ఒంటి మీద తాచుపాము పడ్డట్టు ఆమె అదిరిపడ్డం గమనించి చేతిని తీసేశాను. ఆమె చేతినే నా చేతిలోకి తీసుకుని మృదువుగా రాశాను.

"నీ పేరేమిటి పాపా ?" అన్నాను.

"పార్వతి'' అంది వెంటనే.

''నీకెన్నేళ్ళు?"

'ఎన్నేళ్ళయితే నీకేం ? పది రూపాయలు ఇచ్చావుగా... నీ పని చూసుకు వెళ్ళు !' అన్నట్టు చూసింది. అంతటి అమాయక వదనంలో కూడా కటువైన భావాలు కదలాడడం నాకు ఆశ్చర్యం కలిగించింది.

"చెప్పవేం? నీ వయసెంత ?"

''ఏమో నాకు తెలీదు.''

"చదువు రాదా ? అసలు ఎంత వరకూ చదువుకొన్నావు ?''

''ఎనిమిది చదివి మానేశాను.''

''మరి నీ పుట్టిన తేదీ నీకు తెలీదా?"

"తెలుసు"

"మరి చెప్పవేం?"

"తెలుసుకొని ఏం చేస్తారు?"

ఆ ప్రశ్నకు తెల్లబోయాను. అవును తెలుసుకొని ఏం చేస్తాను ? ఫలానాచోట, ఫలానా పన్నెండేళ్ళ అమ్మాయితో రాసలీలలు సాగించానని డైరీలో రాసుకోవడానికా ?

"ఊరికే తెలుసుకొందామని"

"పదమూడు... వచ్చే ఉగాదికి పధ్నాలుగు ఏళ్ళు వస్తాయి."

"సరే కానీ— ఆ ఫొటోలో ఉన్నది వాసూ కాదూ?"

—ప్రశ్నిస్తూ ఆమెను చూశాను.

సింహగర్జన విన్న లేడిలా త్రుళ్ళిపడింది. ఆత్రంగా నా వేపు చూసి "అవును. మాఅన్నయ్యమీకెలా తెలుసు" అంది పార్వతి.

అయితే, నేనూహించింది నిజమేనన్నమాట. వాసు చెల్లెలే పార్వతి !

ఒక్కసారి నా తల గిర్రున తిరిగినట్టయి కళ్ళ ముందు చీకట్లు కమ్మేయి. నా కనుకొలకుల నిండా నీళ్లు. ధారాపాతంగా కారుతూన్న కన్నీటిని చూసి

పార్వతి నివ్వెరపోయింది. ఏదో అందా మని తల తిప్పి నన్ను చూసింది. అంత లో నాలో ఏం చూసిందో మళ్లీ తల క్రిందికి దించుకొని మౌనంగా ఉండి పోయింది.

చాలా సేపటివరకూ ఆగదిలో నిశ్శబ్దం తాండవించింది. నాదుఃఖోద్వేగం తగ్గేక — "ఎన్నాళ్ళనుంచీ?" అన్నాను.

"వారం రోజులైంది."

"నీకు ఇష్టమేనా?"

"ఇష్టం లేకపోతే మాత్రం తప్పుతుందా?"

"నీకు ఇష్టం లేకపోతే ఎందుకు తప్పదు?"

"తప్పించుకొని చేసేదేముంది ?' అంటూ నా కళ్లలోకి చూసింది, 'ఏం అంటావు' అన్నట్టు.

"అది వేరే సంగతి...ముందు నిన్నీ రొంపిలోకి దింపిందెవరు ? ఎవరు చేశారీ దుర్మార్గం?"

"మా అమ్మా... నాన్నా..."

ఆ జవాబు విని మరీ నిర్ఘాంత పోయాను.

"ఎందుకు?" ఈసారి నా గొంతుకలో ఆవేశం లేదు. నిరాశ. బలవంతమైన జంతువును చూసి ఓటమి తప్పదని మూల మూలల దాక్కొనే బలహీన జంతువు పిరికితనం.

"ఆకలి."

వాసు మరణం. వృద్ధులైన తలిదండ్రుల అశక్తత లేమి. నా అన్నవాళ్లు లేకపోవడం. ఇవన్నీ కారణాలు అయి పదమూడేళ్ల పార్వతిని పతన మార్గంలోకి బలవంతాన మళ్లించాయి.

"చూడు పార్వతీ, నాకు తెలిసిన అనాథ శరణాలయం ఒకటి ఉంది. అందులో నిన్ను చేర్పిస్తాను. అక్కడ నీకు ఆశ్రయం దొరుకుతుంది. ఉచితంగా చదువు చెప్పిస్తారు. కూడూ, గుడ్డా ఇస్తారు నీకు యుక్తవయస్సు వచ్చే నాటికి నీ చదువు పూర్తయి ఉద్యోగార్హత వస్తుంది. నీవు నీ కాళ్ల మీద నిలబడగలవు... నీకు తెలియదు... నువ్విప్పుడు ఒక భయంకరమైన ఊబిలో ఉన్నావు. అందులో ఉన్నంతసేపూ అడుక్కి—అట్టడుక్కి పోవడమే తప్ప—తేలేది మరి ఉండదు" అంటూ ఇంకా ఏదో చెప్పబోతున్న నన్ను ఆపి—

"అప్పుడు మాత్రం ఈ పాడుపని చెయ్యవలసిన అవసరంఉండదంటారా?"

ఏంచెప్పను నేను? ఒంటరి ఆడదానికి ఈ సమాజంలో రక్షణ నూటికి తొంభై తొమ్మిది పాళ్లు శూన్యమనీ— ఎవడికో ఉంపుడుగత్తెగా మారినా కూడా ప్రయోజనం అంతేననీ—ఎలా చెప్పేది ?

"ఎందుకు ఉంటుంది ? నిక్షేపంగా ఎవర్నో పెళ్ళాడి..."

"అదలా ఉంచండి...సరేపోనీ మీరు చెప్పినట్టే నేను ఆ ఆశ్రమంలో చేరాననుకోండి. మరి మా అమ్మా నాన్నలకి తిండి ఎవరు పెడ్తారు? ఉన్న ఒక్కగానొక్క అన్నయ్యా పోయాడు. మమ్మల్ని ఆదుకొనేవారు కూడా ఎవరూ లేరు... మహారాణిలా నేనొక్కత్తినీ అక్కడికి వెళ్ళిపోతే వాళ్ళేమై పోతారు?"

ఆమె ప్రశ్నకు సమాధానం చెప్ప

కుండా పార్వతి తలమీద చెయ్యి వేసి నిమురుతూ ఆలోచనలో పడ్డాను. కాస్సేపటికి లేచి జేబులోంచి డబ్బు తీశాను. వందరూపాయలు ఆమె చేతిలో పెట్టాను. ఆ డబ్బునీ, నన్నూ అయోమయంగా చూసింది పార్వతి.

ఈ డబ్బుతో కొన్నాళ్ళు గడపండి. నేను రామానుజం వీధిలో ఏడో నెంబరు ఇంట్లో ఉంటున్నాను. ఈడబ్బు ఖర్చయిపోతే నువ్వుగానీ, మీ నాన్నగానీ, రండి, మళ్ళీ డబ్బు సర్దుతాను. మీ గురించి ఏదో ఒక శాశ్వతమైన ఏర్పాటు అయ్యేలా ఈలోగా ప్రయత్నాలు చేస్తూంటాను. నువ్వు మాత్రం రాత్రుళ్లు ఇలా ఎవర్నీ రానియ్యకు!" అన్నాను.

"మామీద ఎందుకింత దయ ?"

"వాసు నా తమ్ముడిలాంటి వాడు. నువ్వు వాసుకేమౌతావు? నాకేం అవుతావు? అందుకే!" అని నేను అంటూంటే పార్వతి కళ్లు నీళ్లతో నిండి ఆ మసక వెల్తురులో ముత్యాల్లా మెరిసాయి.

"అన్నట్లు పార్వతీ ఈ మనీపర్స్ ఎవరిది?" అంటూ మంచంమీద దొరికిన పర్స్‌ని పార్వతికి చూపించాను.

"రాజుది"

"అంటే—నన్నిక్కడికి తీసుకొచ్చిన అతనేనా?"

పార్వతి తల వంచుకొని "అవును" అంది.

"అతను తెలుగువాడేనా?" అన్నాను ఆశ్చర్యపోతూ.

"అవును."

"అతను నీకు బాగా తెలుసా?"

"ఉఁహుఁ. ఈ మధ్యనే అతనికీ, నాన్నగారికీ పరిచయం అయింది... అంతే."

అంతలో నా చేతిలోని పర్స్‌లోంచి ఏదో జారి పడ్డట్టు అయింది. ఒంగి దాన్ని అందుకున్నాను. ఎవరిదో ఫొటో. దీపం దగ్గరకు వెళ్ళి వెలుగులో చూశాను...

సందేహం లేదు.

అది నాగరత్నం ఫొటో.

అంటే—

నాగరత్నం కూడా...?

పార్వతికి ఆ ఫొటో చూపించి "నీకు తెలుసా?" అని అడిగాను.

"ఉఁహూఁ ఎప్పుడూ చూసినట్టు లేదే !" అంది.

"సరే— నేను వెళ్తా. జాగ్రత్త. నేను చెప్పింది మరచిపోకు!" అంటూ తలుపు తీసుకొని వీధిలోకి నడిచాను. నా వెనుకనే డాబా ఇంటి తలుపు మూసుకొంది. వీధిలో రోడ్డు మధ్య నిల్చొని రాజు కోసం సారా కొట్టు వేపు చూశాను.



# 7

అంత మసక చీకటిలోనూ నావేపు వస్తోన్న ఆ ఆకారం రాజేనని గ్రహించాను. ఇంతకు ముందులా మందకొడిగా లేదు అతని నడక. ఏదో తెచ్చి

పెట్టుకొన్న ఉత్సాహంతో గాలిలో తేలుతున్నట్టు నడిచి నన్ను సమీపించాడు...

"హౌ డిడ్ యు లైక్ హర్?" అన్నాడు ఇంకా నవ్వుతూనే.

"నీతో మాట్లాడాలి. అలా నాతో వస్తావా?"

నా కంఠంలోని గాంభీర్యాన్ని జీర్ణం చేసుకోవడానికి రాజుకి ఎంతో సేపు పట్టలేదు. అతని మొహంలోని నవ్వు మాయమైంది. నన్ను మరింత పరీక్షగా చూశాడు. అంతలోనే యధాప్రకారం మొహంమీద నవ్వు ప్రత్యక్షం.

"నా గురించి తెలిసిపోయిందన్న మాట..." అన్నాడు.

"లేదు. తెలుసుకొందామనే– నాతో రమ్మంటున్నాను..." అన్నాను.

"సారీ...నేను రాలేను."

"ఎందుకని?"

"నా గు రి ం చి తెలుసుకుందామని మీరు అనుకొంటున్నారు... అవునా? మరి అదెందుకని?"

"ఎందుకో ఏమిటో అదంతా వివరంగా ఇక్కడే ఈ నడిరోడ్డు మీదనే చెప్పాలా?" అన్నాను చిరాగ్గా.

"ఒద్దు. చెప్పకండి. మీకు కష్టం... అది చూసి నాకు కష్టం...పోనీ ఓ పని చేద్దామా?" అంటూ అంతలో దగ్గ రాగా రాజు ఆగిపోయాడు. ఖంగు ఖ ం గు మంటూ కాసేపు దగ్గి పక్కకు తిరిగి ఉమ్మేడు.

ఏం చెప్తాడోనని ఆదుర్దాగా చూడసాగాను.

నింపాదిగా బీడీ నోట్లో పెట్టుకొని అగ్గిపుల్ల గీ సి వెలిగించుకొన్నాడు. పొగ వదుల్తూ నన్ను చూశాడు.

"పోనీ–రేపు ఇదే వేళకి రండి నా అడ్రస్ ఇదే– కేరాఫ్ గవర్నమెంట్ ఏరక్ డిపో..." అంటూ అర్థం లేని నవ్వు నవ్వాడు.

"రేపు నాకు వీలు పడదు"

"పోనీ, ఎల్లుండి..."

"ఎల్లుండి అంతకన్నా విలుపడదు" అన్నాను. నాలో సహనం నశిస్తోంది. అతని మనీ పర్స్‌లో నాగరత్నం ఫొటో ఎందుకుంది? ఎవరి కోసం అయిదేళ్ల క్రిందట చచ్చిపోయానో – ఎవరికోసం అయిదేళ్లుగా అన్వేషిస్తున్నానో – ఎవరి కోసం అనుక్షణం తపిస్తున్నానో–ఆ నాగరత్నం ఫొటో ఈ పనికిమాలిన తాగుబోతుకి ఎలా వచ్చింది? నా ఆత్రుతకు తోడు ఇతని ఆలస్యం ఏమిటి? తాగిన మత్తులో ఉన్నాడు. నాలుగు తన్ని ఇంటికి లాక్కెళ్తే సరి! – అన్పించింది. కాని, దౌర్జన్యంచేస్తే లాభం లేదు. మంచిగా, మర్యాదగానే చెప్పించాలి.

"సార్... ఉదయం నుంచీ నాకు తిండి లేదు. కడుపులో కప్పుడు కాఫీ నీళ్ళయినా పోసుకోకుండా ఇప్పటివరకూ రోడ్లన్నీ తిరిగాను. ఏదో ఇ ప్పు డు నాలుగు రాళ్లు సంపాదించేను... ఇన్ని మిల్లీల సారా చుక్కలు కూడా గొంతులో పోసుకున్నాను...నాకు ఇప్పుడు చాలా హాయిగా ఉంది. నా ఆనందం పాడు చెయ్యకండి సార్... నన్నిలా ఉణ్ణియ్యండి...ఎల్లుండి కాకపోతే అవతల ఎల్లుండి రండి... మీ ఇష్టం వచ్చినంత

నేపూ మాట్లాడండి...నేను కాదన్ను!!" అంటూ ప్రాధేయ పూర్వకంగా నా చెయ్యి పట్టుకున్నాడు.

జేబులోంచి అయిదు రూపాయల నోటు తీసి అతని చేతిలో పెట్టేను. దాన్ని తన కళ్లకు దగ్గరగా పెట్టుకొని ఏమిటా అని కాబోలు దీక్షగా చూడ సాగాడు.

"అయిదు రూపాయల నోటిది. నీక్కావలసిన సారా కొనుక్కొని రా. ఇంట్లో బ్రెడ్ ఉంది. ఇస్తాను. నీ పని హాయిగా కానీ-తర్వాతే మాట్లాడదాం!'' అన్నాను.

"ఒన్ మినిట్ సార్...... ఇప్పుడే వస్తాను" అంటూ పరుగెత్తుతున్నట్టు సారా కొట్టు వేపు నడిచాడు రాజు.

* * *

సీసాలోని సగం ద్రవం ఖాళీ అయింది. మొత్తం బ్రెడ్—నేను రెండు రోజులకు సరిపడా తెచ్చుకొన్న బ్రెడ్ తినేశాడు. నన్ను అడగకుండానే నా విల్స్ పేకెట్‌లోంచి సిగరెట్ తీసుకొని వెలిగించుకొన్నాడు. కాల్చుకోమన్నట్టు పేకెట్‌ని నా ముందుకు విసిరేసి, తను అలసటగా వెనక్కి చేరబడ్డాడు.

అతని వయస్సు ముప్ఫయ్యేళ్ళకు పైనే ఉంటుంది. బాగా మాసిపోయిన నల్లని పాంటూ, పువ్వుల చొక్కా తొడుక్కున్నాడు. రెండూ అతని బట్టల్లా లేవు. అవి అతని ఒంటి మీద పరువులుగా ఉండి వేలాడుతున్నాయి. కాస్త పరీక్షగా చూస్తే రెండింటికీ అక్కడక్కడ చిరుగులు కుట్లు కన్పించాయి. నా అంత పొడుగు ఉన్నాడు. జుత్తు మాసిపోయి భుజాల మీద పడుతున్నది. రెండు వారాల నుంచీ పెరుగుతూన్న గడ్డం మనిషిని కురూపిగా చేసింది. కాళ్ళకు జోళ్లులేవు. మట్టికొట్టుకొని అసహ్యంగా ఉన్నాయి.

విలాసంగా సిగరెట్ తాగుతూ—

"ఇప్పుడు చెప్పండి...ఏం మాట్లాడాలి?" అన్నాడు.

"నువ్వే మాట్లాడాలి..."

"అదే— ఏం మాట్లాడాలి ?"

"నీ గురించి..."

"నా గురించా ? దానివల్ల మీకు ఏం ప్రయోజనం?" అంటూ, తనేదో నాకోసం మహా కష్టపడిపోతున్నట్టు చూశాడు.

"నా గురించి ఆలోచన నీకు అనవసరం... కానీ, నువ్వు చెప్పిన దానిమీద నాకు నమ్మకంకుదిరితే నీకు ప్రయోజనం... లాభం కలుగుతుంది.... నా చేతనైన సహాయం చేస్తాను."

నామాటలు విని 'సరే' అన్నట్టు తల ఊపాడు. సాలోచనగా నన్ను చూస్తూ గట్టిగా రెండు దమ్ములు లాగి సిగరెట్ పక్కన పడేశాడు.

"నా పేరు కవిరాజమూర్తి. కానీ నన్నందరూ 'రాజు' అనే పిలుస్తారు. మాది కృష్ణా జిల్లాలో— పేరెందుకులెండి ఒక పల్లెటూరు. నేను బి. ఎస్సీ. ఎగ్రికల్చర్ చదివాను. నా వయస్సు ముప్ఫయ్ఒకటి. ఎన్నెన్నో ఉద్యోగాలు చేశాను. అన్నీ తాత్కాలికాలే. గవర్నమెంట్ జాబ్ కోసం ప్రయత్నించాను. లాభం లేకపోయింది. అన్నట్టు— నాకు

ఇంగ్లీష్ టైప్ రైటింగూ, షార్టుహేండ్ కూడా వచ్చును. అయిదేళ్ళయి ఈ మద్రాసు మహానగరంలో కాలం గడుపు తున్నాను... ఇదే నా కథ... ఇంతే!" అంటూ మరో సిగరెట్ అందుకొన్నాడు. అగ్గిపుల్లగీసి వెలిగించుకొన్నాడు.

సారా కంపు. నా ముక్కుపుటాలను అదరగొడ్తోంది.

"మీ వాళ్లెవరూ లేరా?" అన్నాను.

"ఎవరూ లేరు. ఏకాకిని."

మళ్ళీ మొదటికే వచ్చాడు. మరి ఆ పర్సు..... అందులోని నాగరత్నం ఫొటో...?

సీసాలోని ద్రవాన్ని చూపిస్తూ— "ఏం అలాగే ఉంచేశావేం?"అన్నాను.

"అరె...మరిచిపోయా..." అంటూ సీసా ఎత్తి గడగడా తాగేడు. గట్టిగా ఊపిరి విడుస్తూ— ఇంకా ఖాళీకాని సీసాని బల్లమీద పెట్టి, సిగరెట్ పీల్చ సాగేడు.

"ఈ పర్సు ఎవరిది ?"

"నాదే.... మీకెలా దొరికిందీ ?" అన్నాడు. ఈసారి అతని మాటలు ముద్దముద్దగా వచ్చాయి.

అతని ప్రశ్నకు సమాధానం చెప్ప కుండా పర్సులోని ఫొటోతీసి అతనికి చూపించాను. బుర్ర గోక్కుంటూ రెప్ప వాల్చకుండా ఫొటోని చూశాడు.

ఏ మాత్రం ఆతురత ధ్వనించని స్వరంతో "ఈమె ఎవరు?"అన్నాను... ఏదో యదాలాపంగా అడిగినట్టు.

ఇదివరకులా అతన్నుంచి వెంటనే సమాధానం రాలేదు. ఓరకంట చూస్తే— ఏదో ఆలోచిస్తున్నట్టు కన్పించాడు. ఏమిటా ఆలోచనా ?

'పార్వతిలాగే ఈమె కూడా...'అని అతను ఎక్కడ అంటాడోనని నా గుండె దడదడలాడుతోంది. అదే గనక నిజమైతే— నేనింక మరి భరించలేను. జీవచ్ఛవపు బ్రతుకు కూడా మరింక నేను వెళ్ళబుచ్చలేను.

క్షణాలు గడుస్తున్నాయి. రాజు నోటంట ఏ మాటా పెగిలిరావటం లేదు.

"ఈమె ఎవరో చెప్పవేం?"అన్నాను మళ్ళీ.

"నాకు తెలిసిన ఓ అమ్మాయి"

"పేరు ?"

రాజు మొహంలో నేను ఊహించని మార్పులు వస్తున్నాయి. ఇంతసేపూ తడుముకోకుండా మాట్లాడిన మనిషి... ఇప్పుడు మాటలకోసం వెతుకుతున్నాడు.

కానీ నా ఆత్రుత అతనికెలా అర్థం అవుతుంది ? నా వేదన అతనికేం తెలు స్తుంది ?

"ఇక్కడే ఉంటోందా ?" మళ్ళీ అడిగాను.

"దాని సంగతి ఎందుకు సార్, వదిలేయండి. దాని బాబుల్లాంటివాళ్ళు చాలా మంది ఉన్నారు... రేపు చూద్దాం. డబ్బుండాలే కానీ మద్రాస్‌లో అమ్మాయి లకి కొదవేముంది ?" అన్నాడు తెచ్చి పెట్టుకొన్న ఉత్సాహంతో. బలవంతాన మొహంలోకి బలహీనపు నవ్వును తెచ్చు కొన్నాడు.

మాటలు మళ్ళించాలని చూస్తున్నాడు. అది స్పష్టంగా తెలుస్తోనే ఉంది.

"ఈ అమ్మాయి సంగతి చెప్పు. ఇక్కడే ఉంటోందా ?" కర్కశంగా అడిగాను.

రాజు తెల్లబోయి నన్ను చూశాడు. మరుక్షణం దృష్టి మరల్చి బల్లమీద సీసాను అందుకొన్నాడు. మిగతా సారా కూడా త్రాగేసి సీసాని పెద్దగా చప్పుడు చేస్తూ బల్లమీద పెట్టాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు? చెప్పడం ఇష్టం లేదా?'' అన్నాను అతన్ని చూపుల కత్తులతో కోసేట్టు.

"ఆ అమ్మాయి ఇప్పుడెక్కడ ఉంటోందో నాకు తెలీదు."

నేను విసుగ్గా సిగరెట్ వెలిగించాను.

"రాజూ, నువ్వు నిజం చెప్పడంలేదు. అబద్ధం చెప్పినందువల్ల ప్రయోజనం లేదు. నా సహకారం నీకు మరింక దొరకదు." అన్నాను.

రాజు ఆలోచనలో పడ్డాడు. ఏం నిర్ణయానికి వచ్చాడో కాని, నిశ్చయంగా తలెత్తి నావేపు చూశాడు.

"నేను చెప్పింది నిజమే. ఇక్కడే కాదు, ఈ దేశంలోనే లేదు..."

"మరెక్కడ ఉంది?''

"దుబాయ్‌లోనో... కువైట్‌లోనో ఉంది."

'అరబ్ దేశాల్లో ఆమెకేం పని?' అనుకుంటూ సాలోచనగా సిగరెట్ పీల్చసాగాను. ఒక్క పూటలో ఎన్నెన్ని విశేషాలు వింటున్నాను? ఎన్ని విచిత్ర దృశ్యాలు చూస్తున్నాను?

"అక్కడేం చేస్తోంది?"

"ఏం చేస్తుంది? ఏం చెయ్యగలదు?' అంటూ రాజు విరక్తిగా నవ్వాడు.

"అరబ్ దేశాల్లోని షేక్‌ల సంగతీ, స్మగ్లర్ల సంగతీ మీరు వినే ఉంటారు... ఏమంటారు? ఒక్కొక్కడికీ నలుగురేసి పెళ్లాలూ, లెక్కలేనంత మంది ఉంపుడుగత్తెలూ, బానిసలూ...వాళ్ల ఆచారం!"

"నువ్వనేదేమిటి రాజూ?"

"ఇంకా ఏమీ అన్లేదు సార్ నేను. అనబోతున్నాను... ఏ షేక్ గాడి జనానాలోనో బానిసగా పడి ఉందేమో...!''

"రాజూ!''

అంత బిగ్గరగా కేక వెయ్యగలనని నేనే అనుకోలేదు. ఆ కేక విని రాజు నిశ్చేష్టుడై పోయాడు. అంతలోనే సర్దుకొన్నాను. మళ్లీ మామూలు మనిషిని కావడానికి అయిదు నిమిషాలేనా పట్టి ఉంటుంది.

"నువ్వు చెప్పింది నిజమేనా?''

''నిజమే! అని అందరూ అంటారు''

''ఆ అనే వారెవరు?"

"అది సరేగాని, ఆ అమ్మాయి మీద మీకేమిటి అంత ఇంట్రెస్ట్?" అన్నాడు రాజు నన్ను పరిశీలనగా చూస్తూ.

ఏం చెప్పాలో తోచక తల క్రిందికి వంచుకున్నాను.

"ముందు నా ప్రశ్నకు సమాధానం చెప్పు'' అన్నాను.

"నిజమేనన్న సంగతి నాకెలా తెలుసని కదూ మీ ప్రశ్న? నిజం నాకు తెలీక మరెవరికి తెలుస్తుంది? నాగలక్ష్మి నా చెల్లెలు. ఏడేళ్ల క్రిందట వరంగల్‌లో ఆమె పెళ్లి వైభవంగా జరిగింది. రెండేళ్లు భర్తతో కాపరం చేసింది.

ఇద్దరికీ మధ్య ఏం గొడవలు వచ్చాయో మరి... భర్తని వదిలేసి ఎటో పారి పోయింది... మూడేళ్లపాటు ఆమె జాడ తెలీలేదు. తీరా జాడ తెలుసుకొనే పరిస్థితి వచ్చే సరికి నా స్థితి హీనమై పోయింది...దూరంగా ఉంటూనే ఆమె క్షేమ సమాచారాలు వింటూ కాలం గడిపాను... ఇంతలోనే చెయ్యి దాటి పోయింది.......!'" అన్నాడు రాజు చెప్పేందుకు ఇక మరేమీ లేనట్టు.

కాస్సేపయిన తర్వాత "ఆమె గురించి మీరెందుకంత పర్టిక్యులర్‌గా అడిగారు?" అన్నాడు

మాటలకోసం తడుముకోవడం ఈసారి నా వంతయింది.

"ఏమీ లేదు. ఎక్కడో చూసినట్టూ. ఎంతో పరిచయం ఉన్నట్టూ అన్పించింది. నాకు బాగా కావలసినవాళ్ల పోలికలు ఆమెలో ఉన్నాయి. అందుకే అడిగాను" అన్నాను ఎండిపోయిన గొంతుని తడి చేసుకొంటూ.

"నాగరత్నం దుబాయ్‌లో ఉందని ఏడాది క్రిందట విన్నాను. ఇప్పుడు అక్కడే ఉందో-లేకపోతే ఇంకెటన్నా వెళ్లిందో ఈసారి మౌంట్‌రోడ్ వేపు వెళ్లినపుడు రేణుకాదేవి గారిని అడగాలి.." అన్నాడు రాజు తనలో తాను గొణుక్కుంటున్నట్టు.

"రేణుకాదేవి గారెవరు?"

"నాగరత్నం స్నేహితురాలు. 'శోభ ఎడ్వర్టయిజింగ్'లో పని చేస్తుంది..."

విని, నేనేం మాట్లాడలేదు.

ఊహించని ఈ వార్త వినేసరికే నా శరీరంలోని సర్వశక్తులూ మాయ మయ్యాయి.' కాలు కూడా కదపలేని అశక్తుడినయ్యాను. ఎదురుగా నీలి నీలి మంచుతెరలు. హోరుమంటూ వజవజ వణికించే చల్లని గాలి. దూరంగా ఊదా రంగు కొండల మీద...ఆకాశంలో... చిలిపిగా నవ్వుతూ చిందులేస్తున్న నాగరత్నం...నా నాగరత్నం!

నాగూ! చివరికి నీ జీవితం ఇలా అయిందా? దీనికినేనేకదూ కారణం.నాలో దుఃఖం కట్టలు తెంచుకొంటున్నది....

"చాలా రాత్రయింది... వస్తాను. సార్. మళ్లీ ఎప్పుడైనా వస్తాను సార్!" అంటూ లేచి తూలుతూ బైటికి నడిచాడు రాజు. అలా చాలా సేపు నిశ్చలంగా కూర్చుండిపోయాను.



## 8

నాలో మిగిలివున్న ఆ ఒక్క కడసారి ఆశ కూడా అడుగంటేసరికి, నేనెందుకు మరింక బతికి ఉండటం అన్పించింది. మాటిమాటికీ నాగరత్నమే కళ్ళముందు ప్రత్యక్షం అవుతున్నది. మల్లెల్లాంటి పలువరుస... గమ్మత్తయిన ముక్కు... చిలిపి కళ్లు...మనో నేత్రం ముందు నాగరత్నం రూపం నిలిచినంత

సేపూ నా మెదడునిండా మృత్యువు గురించి ఆలోచనలు...

పత్రిక పూర్తిగా ఆగిపోవడంతో నాకు రోజుకు ఇరవై నాలుగు గంటలూ ఇదే పని... అదృష్టవశాత్తూ నా నవలలు రెండు పుస్తకరూపంలో వేస్తానని ఓ ప్రచురణకర్త తీసుకున్నాడు. పేజీకి ఇంత అని లెక్కవేసి మూడు వేల రూపాయలు ఇచ్చాడు. మారు మాటాడకుండా ఆ డబ్బు తీసుకొన్నాను. సమయానికి సరిగ్గా ఆ డబ్బు చేతిలో పడకపోతే...నా గతి ఏమై ఉండేదో... !

ఉదయం లేవగానే కాలకృత్యాలు తీర్చుకొని కాఫీ, టిఫిన్ అయ్యేక ఓ గంటసేపు పేపర్ చదవడం.... మధ్యాహ్నం ఏవో ఇన్ని మెతుకులు మింగడం.... కాసేపు నిద్రపోయి సాయంకాలం లేవడం... ఆలోచనలు... మళ్ళీ తిండి.... ఆలోచనలు.... ఆలోచనలు...రాత్రల్లా జాగరణ !— ఇదే నా దినచర్య.

నాగరత్నం గురించి రాజు వెల్లడి చేసిన ఆ భయంకర సత్యం మానుతోన్న నా గుండె గాయాన్ని హఠాత్తుగా కెలికి రేపెట్టినట్టు అయింది... ఆనాటి రాత్రి—మళ్ళీ ఎప్పుడేనా వస్తానని వెళ్ళిన రాజు పదిరోజులు దాటినా మళ్ళీ కన్పించలేదు.

అన్నట్టు పార్వతి ఎలా ఉందో ? ఏం చేస్తోందో ? ఓసారి చూసి వద్దామనిపిస్తోంది.

ఇది నా కథగానీ, నాగరత్నం కథగానీ కాదని మొదట చెప్పినట్టు ఉన్నాను. కానీ, నాగరత్నం అన్వేషణలో నా అనుభవాలు చెప్పక తప్పదు.

అసలు, నిజానికి వస్తే— రాజునీ, రజనినీ మరచిపోవాలనీ, నా స్మృతి పేటికలోంచి వాళ్ళిద్దర్నీ శాశ్వతంగా తొలగించాలనీ నేనెన్నో ప్రయత్నాలు చేశాను. కావాలని వాళ్ళిద్దర్నీ మరచిపోవాలనీ, అనుక్షణమూ నాగరత్నం ఆలోచనల్లో గడిపేవాడిని. వాసు—పార్వతిల గురించీ, నా భవిష్యత్ గురించీ ఆందోళన చెందేవాడిని... కాలక్రమాన ఆ ఊళ్ళో నా ఉనికి చాలా మందికి తెలిసిపోయింది. ఒకప్పటి నా స్నేహితులూ, నన్ను అభిమానించేవాళ్లూ నా దగ్గరికి రావడం.... వారివారి గొడవలు వెళ్ళబోసుకోవడం... సలహాలు అడగడం... లేదా నా సానుభూతి అపేక్షించడం... కొందరు నాతో వాగ్వాదాలు పెట్టుకోవడం... ఇలా రకరకాల వ్యాపకాలతో నిమగ్నమైపోయేవాడిని...

అయినా రాజు గుర్తుకు వచ్చేవాడు... ఆనాడు గీతాలో కాఫీ తాగి బైటికివచ్చిన తరువాత నన్నుచూసి అతను నవ్విన నవ్వు... అతని మాటలు...వాలకం... అన్నీ గుర్తుకు వచ్చేవి... అతను నా మనస్సులో నాకే తెలీనంత బలంగా ముద్ర వేశాడు అతని వ్యక్తిత్వంతో ! అతన్ని ఎంతగా అసహ్యించుకొందామని ప్రయత్నించినా నాకు సాధ్యం కావటం లేదు. ఇంతవరకూ రాజు గురించే చెప్పాను. రజని గురించి ఇంకా చెప్పాల్సి ఉంది...

* * *

ఓనాటి సాయంకాలం బట్టలువేసుకొని

పానగల్ పార్క్‌వేపు వెళ్దామనుకొంటూ ఉండగా — వీధి తలుపు చప్పుడైంది. వెళ్ళి తీశాను. ఎవరో స్త్రీ నన్ను చూస్తూ "'క్రాంతి' పత్రికలో పనిచేసే గోపీగారు మీరేనా ?" అంది.

"అవును" అన్నాను.

"మీతో మాట్లాడాలి" అంది నన్ను చూస్తూ.

ఆ చొరవకు కొంచెం ఆశ్చర్యపోతూ "రండి" అంటూ గుమ్మానికి అడ్డుతొలగి, లోపలకు నడిచాను. నా వెనుకనే వచ్చింది ఆమె. కూర్చోమంటూ కుర్చీ చూపించాను.

నాపేరు ఎలిజా. శోభ ఎడ్వర్టయిజింగ్‌లో స్టెనోగా పనిచేస్తున్నాను. నేనీ వీధిలోనే ఉంటున్నాను. చాలా కాలం క్రిందట 'క్రాంతి' పత్రికకు నేనొక నవల రాసి పంపించాను. అది తిరిగివచ్చింది... నవల బాగానే రాశానని నా నమ్మకం. మరైతే ఎందుకు తిరిగి వచ్చిందో నాకు అర్థం కావటంలేదు. మీ పత్రికే కాదు, తెలుగు దేశంలోని పత్రికలన్నీ నా నవలను తిరస్కరించాయి. నవలను మీరు చదివారు గనుక అందులోని లోటుపాట్లేమైనా మీరు చెప్తారేమోనని వచ్చాను..." అంది నన్ను చూస్తూ.

ఆ గొంతులో వినయం లేదు. అతిశయం అంతకన్నా లేదు. అర్థింపూ లేదు.

కానీ, నేను చిరాగ్గా మొహం పెట్టాను.

"మీ గురించి చాలా విన్నాను. మిమ్మల్ని ఎన్నోసార్లు చూశాను. చెప్పానుగా మా ఇల్లు ఇక్కడే వుంది. అయితే, మీ ఎదుట పడాలంటే చాలా మొహమాటం వేసింది... చివరికి ఇవాళ తెగించి వచ్చాను...మీకేమీ అభ్యంతరం లేకపోతేనే మీ అభిప్రాయం చెప్పండి. లేదంటే నా దురదృష్టం" అంది ఎలిజా.

ఆమె మాటలూ, ఆ చొరవా నాకు బాగా పరిచయం ఉన్నట్టనిపించాయి. ఎక్కడ చెప్మా ?! ఆలోచనలో పడ్డాను. సిగరెట్ వెలిగించి ఎలిజావేపు చూశాను. ఆమె నా ఆలోచన సంగతి పసికట్టినట్టుంది. "నవల గుర్తుకు రావడంలేదా!" అంది.

"అవును. ఏదీ—కొద్దిగా దాని జిస్టు చెప్పండి..." అన్నాను.

"నవలలో నాయిక అనిత. చదువూ సంస్కారాలూ ఉన్న స్త్రీ. అరుణ్‌ని ప్రేమించి పెళ్లి చేసుకొంటుంది. అతను త్రాగుబోతు. తన ఆర్జనలో సగభాగం దానికే వెచ్చిస్తూ ఉంటాడు. ఆ అలవాటు మాన్పించాలని అనిత ఎంతో ప్రయత్నిస్తుంది. కానే విఫలమవుతుంది. చివరికి పిచ్చి కోపంతో తనూ త్రాగుడు మొదలెడ్తుంది. అక్కడినుంచీ సంసారం నరకం అవుతుంది... వాళ్లిద్దరికీ! ఏం జ్ఞాపకం వచ్చిందా?"

"ఆఁ...చెప్పండి. చెప్పండి" అన్నాడు

"కొన్నాళ్లకు కలతలు చెలరేగి ఇద్దరూ విడిపోతారు. అనిత ఒంటరిదవుతుంది. అరుణ్ కోసం తను ఇదివరకు దూరం చేసుకొన్న తలిదండ్రుల్ని చేరాలంటే బిడియం, ఆత్మాభిమానం అడ్డొస్తాయి. అన్నా వదినలు ఆదరించరేమోనని

అనుమానం...అనిత ఒంటరితనం అందరికీ తెలుస్తుంది. మగవాళ్లు రకరకాల ప్లానులు వేస్తూ, ఆమెను చూసి సూటీపోటీ మాటలు అంటూవుంటారు. ఈ బాధ పడలేక డగ్గరున్న డబ్బయిపోయేక- ఏదైనా ఒక ఉద్యోగం చేసి తన పొట్ట తాను పోషించుకోవాలన్న నిర్ణయానికి వస్తుంది..." అంటూ ఆగింది ఎలిజా.

"చాల్లెండి. గుర్తుకొచ్చింది" అన్నాను నవ్వుతూ.

ఎలిజ మొహం వికసించింది.

"నవల పేరు 'ప్రేమాగ్ని' కదూ" అనడిగాను.

"అవును"

"ఆ తర్వాత కథ నేను చెప్తాను. రకరకాల ఉద్యోగాలకు అప్లయ్ చేస్తుంది. ప్రతీ చోటా మగాళ్ల కళ్లు తోడేళ్లలా ఆమెను వెంటాడుతాయి. చివరికి చేసేది లేక ఓ కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్ కామదాహానికి ఆహుతై స్టెనోగా ఉద్యోగం సంపాదిస్తుంది. ఒకరిద్దరు యువకులు తారసపడి ప్రేమ అంటూ ఆమె వెంట పడతారు. మళ్లీ పెళ్లి చేసుకొని జీవితంలో స్థిరపడాలనుకొంటుంది అనిత. కానీ, ప్రేమంటూ వెంటపడిన మగాళ్ల ఉద్దేశం అది కాదని గ్రహిస్తుంది...... తీవ్రమైన సంక్షోభం చెలరేగుతుంది ఆమెలో...చివరికి మేనేజింగ్ డైరెక్టర్ అండని ఉంటూ స్వైరిణిగా మారుతుంది. ప్రతీకారం తీర్చుకోవాలన్న ఉద్దేశంతో- ఇదేగా మీ కథ?" అన్నాను ఎలిజాను చూస్తూ.

"అవును. అంతే. స్త్రీ వైవాహిక జీవితంలోని ఒత్తిడులు ఎలాంటివో, వ్యక్తిత్వం గల స్త్రీ ఒంటరిగా ఈ సంఘాన్ని ఎలా ఎదుర్కోవాలో, నవలలో సూచించాను. ఓ రకంగా చెప్పాలంటే—పిరికి మనసులున్న ఆడవాళ్లకి ధైర్యసాహసాలు నూరిపోశాను. ఇప్పుడు చెప్పండి...నా రచనలో లోపం ఏమిటి?" అందామె ఆవేశంగా.

"లోపాలు చెప్పే అర్హత నాకు లేదండీ...అయినా మీ రచనలో నాకేమీ లోపాలు కన్పించలేదు" అన్నాను.

"మీరు తప్పించుకోవడానికి ఎత్తు వేస్తున్నారు. పోనీ, ఒక మామూలు మనిషిగా మీ అభిప్రాయం చెప్పండి... నా ప్రయత్నం ఉదాత్తమైనది కాదా?"

"మీ ఆశయం మంచిదే. ప్రయత్నమూ బాగుంది. కానీ, అటువంటి ఇతివృత్తం ఉన్న రచనలను సాధారణంగా చాలా పత్రికలు వెయ్యవు. ఏదైనా ఓ మంచి ప్రేమకథ రాయకపోయారా, ప్రచురణ భాగ్యం, వెండితెర భాగ్యం కూడా కలిగేవి..."

"కారణాలు ఏమై ఉంటాయో...... పోనీ కనీసం ఊహించి చెప్పగలరా?" అంది ఎలిజా పట్టు వదలని విక్రమార్కుడిలా.

"ఆడది మద్యపానం చేయడం.. కొన్నిచోట్ల ఒంటరి అనితను వల్లో వేసుకోవాలని కొందరు ముస్లిమ్, క్రిస్టియన్ యువకులు ప్రయత్నించడం...ఈ మత ప్రసక్తి అనవసరం! హిందూ యువకుల్లో మాత్రం అలాంటి దౌర్భాగ్యులు లేరా? ఎమ్.డి. పశువాంఛకు లొంగిపోయి,

అనామకంగానైనా ఉండిపోయి, స్వతంత్రంగా జీవించాలను కోవడం...ఏమిటో ఇదంతా వినడానికి బాగానే ఉంటుంది గానీ 'అనిత' పాత్రపై సానుభూతి చూపించే పాఠకులే కరువైపోతారు మీకు. ఆఖరికి ఆడవాళ్లు కూడా 'అనిత'ను అసహ్యించుకుంటారేమోనని నా అనుమానం"

"ఎందుకని?"

"తరతరాలుగా దేశంలోని సాహిత్యంలో హిందూ స్త్రీ ఇమేజ్ ఒక మూసలో పోసినట్టుగా వస్తోంది. దానికి భిన్నంగా– ప్రయోజనాత్మకంగా, ఎవరు ఎంత బ్రహ్మాండంగా రాసినా కానీ దానికి గుర్తింపు ఉండదు. హర్షించడం సంగతి సరేసరి! ఏమో ఇది నా సందేహం సుమండీ...! లైక్ చేసే వాళ్లెవరేనా ఉంటే ఉండొచ్చు..." అన్నాను.

క్షణంపాటు నా కళ్లలోకి తీక్షణంగా చూసింది ఎలిజా.

"అంతే నంటారా...అంతే అయి ఉంటుంది లెండి. నాదే పొరపాటు, మన దేశంలోని ఆడదానికి వ్యక్తిత్వం లేదు. కేవలం సెక్స్ ఆబ్జెక్టు. అందుకు ఖజురాహో, కోణార్క్ శిల్పాలే సాక్షి. భారత స్త్రీ తనకు తానుగా ఎవర్నీ ప్రేమించలేదు. శారీరక సౌఖ్యం ఇవ్వడానికి మాత్రం సంసిద్ధం కాగలదు. పిల్లల్ని తయారు చేసే యంత్రంగా మారగలదు. ఆడదాని ఉన్నత ఉరోజాలూ, పెద్ద నితంబం, చంద్ర బింబం లాంటి ముఖం...ఈ సౌందర్యం అంతా మొగుడనే పీనుగకు అర్పించడానికే— రోగిష్టివాడైనా, వ్యసనపరుడైనా, దౌర్భాగ్యదామోదరుడైనా, చివరికి నపుంసకుడైనా భారతనారికి పతియే ప్రత్యక్ష దైవం... యుగాలనాటి దాస్యమే ఆడదానికి మనుగడ... లేకపోతే—"

ఆమె మాటలు వింటూ నేను సిగరెట్ వెలిగించాను. సాలోచనగా ఆమెను చూస్తూ సిగరెట్ పీల్చసాగాను...ఎలిజా మాటలు వింటూ ఉంటే నాకు తెలిసిన ఎవరెవరో గుర్తుకు వస్తున్నారు. ఎందరి కన్నీటిగాథలో చెప్తున్నంత ఆవేశంగా ఉందామె.

"ఒంటరి ఆడదానికి ఈ ప్రపంచంలో రక్షణ లేదు. లేదు గాక లెదు! అంతే కదండి, ఎవరి అభిప్రాయమైనా?" అంది.

"అవును. నిజం కూడా అదే."

"ఇకనుంచీ నా అభిప్రాయం, ఆలోచనా విధానం మార్చుకొంటాను లెండి... ఇందాక నవలలోని 'అనిత' పాత్ర గురించి అందరూ అనుకొనే మాట చెప్పారు... కాని, వ్యక్తిగతంగా మీ అభిప్రాయం ఏమిటి?"

సిగరెట్ గాఢంగా పీలుస్తూ ఒక్క నిముషం ఆలోచించాను.

"అనిత పాత్ర మీద నాకు చాలా సానుభూతి ఉంది. ఆమె సాహసాన్నీ, చర్యలనూ నేను అర్థం చేసుకోగలను. నిజం చెప్పాలంటే– నిజజీవితంలో అటువంటి యువతిని చూడాలని ఉంది నాకు" అన్నాను.

ఎలిజా మొహం గర్వంతో మెరిసిపోయింది.

"థాంక్స్. శ్రమ ఇచ్చినందుకు క్షమించండి" అంటూ లేచింది.

"అబ్బే. దాన్దేముంది లెండి" అంటూ నేనూ లేచాను.

బైటికి దారి తీస్తూ హఠాత్తుగా గుమ్మం దగ్గర ఆగిపోయి నావేపు తిరిగింది ఎలిజా. నన్ను చూసి నవ్వుతూ—"నేనే ఆ అనితను. నా జీవితాన్నే ఆమెకు అంటగట్టాను...మీరు మగవారు గనక మీ చుట్టూ ఉన్న 'మగమాలో కాళ్ని' కదిపి చూడండి... నా గురించి ఎన్ని అభూత కల్పనలు చెబుతారో... ఓపికా వ్యవధీ ఉంటే నాకథ రాయండి... పోనీ ఓ పని చెయ్యండి. పాఠకుల సానుభూతి సంపాదించడంకోసం నన్ను కథ చివర్న చంపెయ్యండి... వస్తానండీ! మరోసారి థాంక్స్!!" అంటూ రోడ్డు మీదికి అడుగెట్టింది.

నా మెదడు ఖాళీ. ఎవరెవరో రావడం. ఏమేమో చెప్పడం. ఎన్నెన్నో ఆలోచనల్తో యుద్ధం... దీనికిక అంతం లేదేమో!?

ఒకసారి కళ్ళు మూసుకొని అంతా గుర్తుకి తెచ్చుకొన్నాను. నాగరత్నం గురించి రేణుకాదేవిని వాకబు చెయ్యాలని మాటల సందర్భంలో రాజు అన్నాడు. ఆమె 'శోభ ఎడ్వర్టయిజింగ్'లో పని చేస్తోందని కూడా చెప్పాడు. ఇప్పుడు ఈ ఎలిజా కూడా అక్కడే పని చేస్తోంది స్టెనోగా...

అరెరె. విచారించాను. ఎలిజా మరి కాస్సేపు ఉంటే బాగుండేది... నాగరత్నం గురించి ఆమెకేమన్నా తెలుసేమో... అయినా, ఇప్పుడేం మించి పోయింది? రేపో ఎల్లుండో మౌంట్ రోడ్ వెళ్తే సరి! అన్నట్టు ఈ వీధిలోనే ఉంటున్నానని చెప్పిందిగా...మరింకేం?

ఆలోచిస్తున్నాను గాని మస్తిష్కం శూన్యం.

చూస్తున్నాను కాని కళ్ళ ముందు చీకటి.

అంతలో ఉలిక్కిపడ్డాను. ఊహాలోకం నుంచి యదార్థంలోకి వచ్చే సరికి ఎదురుగా ఒక స్త్రీ ఆమె వెనుక సంచులు పట్టుకొని ఇద్దరు పది పన్నెండేళ్ళ ఆడపిల్లలు.

మెదడులో మెరుపు మెరిసినట్టయింది.

ఆమె...ఆ నవ్వు...ఆ మొహం... ఆ కళ్ళలో ఏదో విశేషం... కళ్ళలో నేనా...కాదు...చెంపలు... పెదిమలు... చిన్ని నుదురు...

ఆఁ. గుర్తుకొచ్చింది... నాగరత్నం కాదు. ఆ పోలికలు ఉన్న 'ఆమె'...

'ఆమె' అంటే ఆనాడు సెంట్రల్ స్టేషన్లో మెరుపులా మెరిసి మాయమైన ఆ స్త్రీ!

నా హృదయం ఆనందంతో ఉప్పొంగింది. మనస్సు రెక్కలు కట్టుకొని ఎక్కడెక్కడికో ఎగిరిపోసాగింది. కొంచెం వెనక్కి జరిగి—ఆమెను సూటిగా చూస్తూ "ఏం కావాలండీ?" అని అడిగాను.

"మీ మంచితనం."

నా ఖర్మ. నాకు తారసపడ్డవాళ్ళందరూ నవలల్లో డైలాగులూ, సినిమా డైలాగులూ తప్ప రక్తమాంసాలున్న

మనుషుల్లా మాట్లాడంలేదీమధ్య!

"ఎన్ని టన్నులు కావాలి?"

"ఒక వీసమెత్తు చాలు!"

"మీరు...?" అంటూ ఆమెనూ, ఆమె వెనుక అ మా య క వ ద నా ల్తో, చేతులలో సంచుల్తో నిలబడున్న అమ్మా యిల్ని పరీక్షగా చూశాను.

"చెప్తాను... పదండి లోపలికి..." అంటూనే చరచరా ఇంట్లోకి వచ్చే సింది. ఆమె వెనుకనే మంత్రముగ్ధుడిలా నడిచాను.

మనోహరంగా నవ్వుతూ నన్ను చూసింది. "కూర్చోండి" అంది.

నా ఇంట్లో నాకే మన్నన!

మరబొమ్మలా నేను కూర్చున్నాక తనూ కూర్చొంది. తన వెనక వచ్చిన అమ్మాయిలను చూసి "కూర్చోండర్రా" అంది. తలో కుర్చీలో వాళ్ళు కూర్చు న్నారు.

నాకంతా అయోమయంగా ఉంది. ఆనందంగానూ ఉంది. ఒక్క క్షణం కూడా వృథా పోనివ్వకుండా ఆమెనే దీక్షగా చూస్తున్నాను. ఆమె ఏమను కొంటుందో అన్న సంకోచం కూడా లేకుండా తదేకంగా చూస్తున్నాను. నాగ రత్నాన్ని మరపించే ఆ అందం... శిరోజాలు...చక్కని నడుం... ఉన్నత వక్షస్థలం... నా చూపులు ఆ మె ను అతుక్కుపోయాయి...

"నా పేరు రజని" అందామె.

అందమైన ర ం గు ల క ల కంటూ ఉంటే– ఎవరో బలవంతాన దాన్ని భగ్నం చేసినట్టయి మెలకువ వచ్చి నట్టయి – ఆ మె కే సి చూ శా ను.

"ఆఁ" అన్నాను పరధ్యానంగా.

"నాపేరు రజని"అందామె మళ్ళీ.

అప్పటికిగానీ ఈ లోకంలోకి రాలేదు నేను.

'అమ్మయ్య. ఈమేనన్నమాట... ఈమె పేరు రజని.... ఎంత అందమైన పేరు?!' అనుకొన్నాను.

ఆమె మొహాన్ని మనోహరమైన ఆ నవ్వు ఇంకా వీడిపోలేదు.

భయంకరమైన మృత్యువును కూడా ఇంత మోహనంగానూ నవ్వుతూనే– ఆహ్వానించగలదు కాబోలనుకున్నాను.

ఆమె మాటలు వింటూంటే — నాగి రత్నంతో నేను గడిపిన క్షణాలు గుర్తు కొస్తున్నాయి. నాకు ఎంతో ఇష్టమైన 'అమృతవర్షిణి' వీణమీద వింటున్నట్టు తన్మయత్వం...

మరోసారి వినాలని "ఏమన్నారు?" అన్నాను బల్లమీది సిగరెట్ పేకెట్ అందుకొంటూ.

ఆమె గలగలా నవ్వింది. నవ్వుతూ తనతో వచ్చిన అమ్మాయిల్ని చూసింది. తరవాత నన్ను చూసి "నా పేరు రజని అన్నాను–అంతే!"అంది బిగ్గరగా.

నాకు చెముడు అనుకొంది కాబోలు. ఎందుకో నాకూ్కుడా నవ్వొచ్చింది. నవ్వేశాను.

"ఈ ఇ ం ట్లో మీరొక్కరేనా ? ఇంకెవరేనా ఉంటున్నారా?"అంది మళ్ళీ బిగ్గరగానే.

నేను చెవులు మూసుకొని"బాబోయ్.. మెల్లిగా మాట్లాడండి... నాకేం చెవుడు

లేదు" అన్నాను.

రజని మొహంలో నవ్వు మాయమై ఒక్క క్షణం సందేహం.... ఒక్క క్షణమే...మళ్ళీ యధాప్రకారం నవ్వు...



## 9

నిరుపేదకు పెన్నిధి దొరికినట్టు.... చూస్తున్నానామెను. ఆమె నా చూపులు చూసి మరోలా అనుకొంటుందేమో అన్న ధ్యాసేలేదు...ఆనాడు సెంట్రల్ స్టేషన్లో నన్ను మోసంచేసి పారిపోయిందన్న విషయం అంతగా నన్ను బాధించటం లేదు. దేవతలా ప్రత్యక్షమై దర్శన భాగ్యం దక్కించింది చాలు.... ఆమె ఎన్ని తప్పులు చేసినా క్షమించెయ్యగలను...

"మీరేమిటో చాలా దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టు ఉన్నారే ?" అంది రజని.

"అబ్బే ఏంలేదు. చెప్పండి ఏం పని మీద వచ్చారు?" అన్నాను.

"ముందు నా ప్రశ్నకి మీరు సమాధానం చెప్పండి. ఇంట్లో ఎవరూ లేరా?" అంది.

"నేనున్నాను చాలదూ ? ఇంకెవరు ఉండాలని మీ ఉద్దేశం?"

"అహఁ. అదికాదు. మీ భార్యా..."

"ఎవరూ నాకు లేరు. నేనొక్కణ్ణే ఉంటున్నా"

"అంటే మీకు...?"

"నా వ్యక్తిగత వివరాలు ఎవరితోనూ చర్చించే అలవాటు నాకు లేదు" ఈమాట కొంచెం కఠినంగానే అన్నాననుకొంటాను. రజని మొహం కాస్త చిన్నబోయింది.

"సారీ..." అంది.

"డోన్ట్ వర్రీ"

కాసేపు అటూ ఇటూ ఇబ్బందిగా చూసింది రజని, ఏదో ఆలోచిస్తూంది. చివరికి అయిదు నిముషాల తర్వాత తలెత్తి నన్ను చూసింది.

"నేను ఈ వీధి చివర్న ఉన్న ఇంట్లో ఉంటున్నానండీ... వరదబాధితుల సహాయార్థం చందాలు వసూలు చేస్తున్నాం... ఆ పనిమీదే ఇప్పుడు వచ్చాను. మీకు తోచింది..." అంటూ ఆగిపోయింది.

నేను చటుక్కున నాలిక కొరుక్కున్నట్టు నటించాను. "నేను అవసరానికి మించి డబ్బు దగ్గర ఉంచుకోనండీ. కావల్సినప్పుడల్లా వెళ్ళి బాంక్ లో డ్రా చేసి తెచ్చుకుంటాను ... ప్రస్తుతం నా దగ్గర డబ్బేం లేదు!" అన్నాను.

జేబులో మూడు వందలు ఉంచుకొని కూడా అబద్ధం ఆడగలిగినందుకు నన్ను నేను అభినందించుకొన్నాను.

రజని నామాటలు నమ్మింది. అవును మరి అంతగా నమ్మించాను. రేపు మళ్ళీ రమ్మంటాను. మరోసారి ఆమెను చూడవచ్చు. మల్లెలు విరిసి నట్టుండే నవ్వునీ, వెన్నెల వన్నెల విసనకర్రలా నవ్వే అందాన్ని ... నా నాగరత్నం ప్రతి

రూపాన్ని ... మరోసారి కళ్లారా చూసే అవకాశం వస్తుందిగా...

"పోనీ రేపు రమ్మంటారా?" అనడిగింది ఆశగా.

'అలాగే రండి' అంటే ఇపుడు వెంటనే వెళ్ళిపోతుందేమో! మరి కాసేపు ఉంచడం ఎలా ?

"ఉండండి ... పెట్లో ఏమన్నా ఉన్నాయేమో చూస్తాను..." అంటూ లేచాను. గది లోపలికి వెళ్ళి అటూ ఇటూ తచ్చాడాను. గుమ్మం దగ్గరికి వచ్చి ఓరగా చూశాను. బల్లమీది వార పత్రికను అందుకొని తిరగేస్తోంది రజని. ఆమెను చూస్తోన్న కొద్దీ ఇంకా అలాగే చూడాలనిపిస్తోంది.

ఏమిటీ ఆకర్షణ?!

నాగరత్నం పట్ల ద్రోహం చేస్తున్నానా ? నాగరత్నం మీది నా ప్రేమ, అనురాగం అదంతా వట్టిదేనా ? నాగరత్నాన్ని నా స్మృతి పథం లోంచి తీసి పారేశానా ? ఆమెను అప్పుడే మర్చిపోయానా? ఇది ఆత్మవంచన...కాదూ?

నాలో సంఘర్షణ. వాగ్వాదం. వాగ్యుద్ధం.

నాగరత్నాన్ని ఇప్పుడే కాదు; ఎప్పటికీ మరువలేను. రజని మీద నాకు ఎలాంటి ఆశా లేదు. వ్యామోహమూ లేదు. సృష్టి వైచిత్రిని చూసి అబ్బురపడే పసివాడిలా, శిల్పి సృష్టించిన సౌందర్యాన్ని ఆరాధించే కళాభిమానిలా- రజని అందాన్ని అవలోకిస్తున్నాను, అంతే!

నా హృదయంలోని నాగరత్నం స్థానాన్ని ఎవరూ ఆక్రమించలేరు. ఎవరికీ ఆ అర్హతలేదు. అందుకు నా మనస్సు అంగీకరించదు.

రజనిని మోసం చేస్తున్న నా అంతరంగాన్ని చీవాట్లు వేస్తూ, ఇబ్బందిగా ముందు గదిలోకి నడిచాను. చూస్తోన్న పత్రికను బల్లమీద పడేసి నా వంక చూసింది రజని. ఇదివరకులా ధైర్యంగా ఆమె మొహంలోకి చూడలేక పోయాను నేను.

"లాభం లేదండీ ... రేపే" అన్నాను క్రింది చూపుల్తోనే.

"పోన్లెండి ... ఫర్వాలేదు. రేపొస్తాను."

సిగరెట్ వెలిగించుకొని కుర్చీలో కూర్చొన్నాను.

"మిమ్మల్నెక్కడో చూసినట్టుందండీ..." అంది రజని.

నా గుండెలో సప్త సముద్రాలు పోటెత్తినట్టు హోరుమన్నాయి ... సెంట్రల్ స్టేషన్‌లో నన్ను చూసినా గుర్తు లేనట్టుంది...ఆ విషయం చెప్పనా? అమ్మో ... చెప్తే – సిగ్గుపడి మరి రాదేమో...!!

"నాకూ అలాగే ఉంది" అని మాత్రం అన్నాను.

"మీ పేరు?"

ఆనాడు స్టేషన్‌లో కూడా ఇలాగే అడిగింది నన్ను. పేరు చెప్పేను. కాని, సరిగా వినిపించుకోకుండానే వెళ్ళిపోయింది. అవును, ఎంతో హడావుడిగా వెళ్ళిపోయింది. ఆ విషయం గుర్తు లేదూ ?

"నా పేరు గోపీనాథ్"

"పేరు విన్న జ్ఞాపకం లేదు కానీ మిమ్మల్ని మాత్రం ఎక్కడో చూసినట్టు బాగా గుర్తుందండీ . . . ఎక్కడో తెలియడం లేదు."

నేను 'అలాగా' అన్నట్టు నవ్వేసి ఊరుకొన్నాను.

"సరే— అదే జ్ఞాపకానికి వస్తుంది లెండి. అన్నట్టు మీరేం చేస్తారు?"

"ఏం చెయ్యను?"

"మరెలా ?"

"ఏమిటి ?"

"దబ్బో...? భోజనం పానం జీవితం ఇవన్నీ ఎలా వస్తాయి ?"

"మావాళ్ళు నాకిచ్చిన ఆస్తి కొంత ఉందిలెండి..." సొరకాయ కోశాను.

"మరైతే—కాలక్షేపం ?"

"పుస్తకాలు చదవడం. షికార్లు, స్నేహితులు...ఇంకేం కావాలి ?"

"ఏం పుస్తకాలు చదువుతారు ?" అంది రజని. అంటూనే తలతిప్పి గోడవారనున్న పుస్తకాల రేక్‌ని చూసింది.

ఏం పుస్తకాలు చదువుతానని చెప్పాలి? అన్నట్టు రజని ఏం చదువుకొందో? వైఖరిచూస్తే అట్టే చదువుకొన్నదానిలా లేదు. ఆ లక్షణాలేం కన్పించడం లేదు.

"చెప్పండి... ఏమేం చదువుతారు?"

"అన్నీనూ"

"అలాకాదు. మీకు ఎంతో బాగా నచ్చిన పది పుస్తకాల పేర్లు చెప్పండి" అంది నా అంతు తేల్చదలిచినట్టు.

"చెప్తే ?" అన్నాను ప్రశ్నార్థకంగా ఆమెను చూస్తూ.

"మీరెలాంటివారో నాకు తెలిసిపోతుంది" అంటూ నవ్వింది. ఆ నవ్వు. .

"చెప్పండీ... ప్లీజ్!" అంది పసిపాప మారాం చేస్తున్నట్టు— గోముగా.

కానీ నేనిక్కడ లేను. నా మనస్సు అయిదేళ్ళ వెనక్కి పరుగులు తీసింది. స్థలం మద్రాస్ కాదు, విశాఖపట్నం! మారాం చేస్తున్నది రజని కాదు, నాగరత్నం !!

* * *

'మాట్లాడు గోపీ, ప్లీజ్!'

'ఏయ్, ఏమిటా ఎంగిలి చెయ్యడం... ఛీ! '

'అబ్బ ! రక్తం వచ్చేలా ఏమిటా పని??'

'ఊమ్మ్మ్మ! ఎముకలు విరిచేసేట్టు ఉన్నావు. నీకు మానవ స్త్రీలు పనికిరారు హిడింబి, శూర్పణఖల కోవకు చెందిన రక్కసిమూక సరిపోతారు'

'గోపీ, పోదాం, రావూ???'

* * *

"చాలా అన్యాయం సార్..... మమ్మల్ని ఎదురుగా కూర్చోబెట్టి ఎవరి గురించో అలా దీర్ఘంగా ఆలోచించడం చాలా అన్యాయం!"

ఒక లోకాన్నుంచి మరో లోకంలోకి..

ఎదురుగా నవ్వుతూ రజని.

పరధ్యానంగా 'ఆఁ' అన్నాను.

"మీరు ప్రాణంగా ప్రేమించే పది పుస్తకాల పేర్లు చెప్పండి...ప్లీజ్!"

"కన్యాశుల్కం, మహాప్రస్థానం, అల్పజీవి, వేమనశతకం, రాధికా

సాంత్వనం, లీవ్స్ ఆఫ్ గ్రాస్, మూన్ ఎండ్ సిక్స్‌పెన్స్, బేంక్ చెక్ బుక్, నేను రాయబోయే..."

"చాల్చాలు. నాకు అర్థం అయింది లెండి" అంటూ నవ్వుతూ లేచింది రజని.

"లిస్ట్ ఇంకా పూర్తి కాలేదు" అన్నాను.

"అన్నం ఉడికిందో లేదో చూడ్డానికి ఒక్క మెతుకు చాలు!"

"ఇంతకూ అన్నం ఉడికినట్టేనా?"

"ఆc. తియ్యని పరమాన్నం కూడా అయిపోయింది"

రజని వ్యక్తిత్వం నాకు మరీ అందకుండా పోతూంది !

"సరేగానీ, మీ గురించి వివరాలేం చెప్పనే లేదు" అన్నాను నిష్ఠూరంగా.

"అవసరం వచ్చినపుడు తప్పక చెప్తాలెండి. అయితే ఒక విషయం మాత్రం ప్రామిస్ చెయ్యాలి..."

"అలాగే— ఏమిటది ?"

"నా గురించి మాత్రం కథలాంటిది ఏదీ రాయకండి."

"అలాగే"

యథాప్రకారం మనోహరంగానవ్వు...

"ఇహ వస్తానండీ...రేపు మళ్ళీ ఇదే వేళకు వస్తాను" అంటూ లేచింది. మరొక్కక్షణం అయినా ఉండక వీధి గుమ్మంవేపు నడిచింది. ఆమె వెనకే ఆ ఇద్దరు ఆడపిల్లలూ వెళ్ళిపోయారు.

చాలా సేపు అలాగే నిలబడిపోయాను. సిగరెట్ చివరంటా కాలి వేళ్లు చురుక్కుమనేసరికి జాగ్రదవస్థలోకి వచ్చాను.

* * *

ఆ మర్నాడు— గిండీలో ఉన్న స్నేహితుడు ఒకాయన నా కోసం వచ్చాడు. రాత్రి డిన్నర్‌కు రమ్మని ఒకటే గోల. నన్ను చూడ్డానికీ, నాతో మాట్లాడ్డానికి చాలా మంది అక్కడ కాచుకొని ఉన్నారని ఒకటే గొడవ. నానా పాట్లూపడి అతని పీడనుంచి విముక్తుడినయ్యాను.

తీరా వెయిట్ చేస్తే— వస్తానన్న రజని రానేలేదు. రజనీకాంతుడు మాత్రం నిండుగా ఆకాశంలో ప్రకాశిస్తూ వెన్నెల వెలుగులు వెదజల్లడం ప్రారంభించాడు.

చూసి చూసి కళ్ళు కాయలు కాచి పోయాయి—వీధి గుమ్మంలో అడుగుల చప్పుడయితే వెళ్ళి చూశాను. రజని కాదు, ఎవరో ముసలాయన.

అతనెవరో కాదు. పార్వతి తండ్రి. వాసుని పోగొట్టుకున్న కన్నతండ్రి. లోపలికి రమ్మని కుర్చీ చూపించాను. ఎనభై ఏళ్ళ వృద్ధుడతను. భార్య బతికే ఉంది. ఈ ముసలాళ్ళిద్దర్నీ పోషించే బాధ్యత పదమూడేళ్ళ పార్వతిది ! ఎంత ఘోరం!! యవ్వనం ఇంకా పూర్తిగా రాని, లోకమే ఎరుగని బాల ఒళ్ళు అమ్ముకొని తలిదండ్రుల్ని పోషించే పరిస్థితి ఎంత అన్యాయం? మానవులు తమ పైశాచికానందంకోసం జంతువులను వేటాడుతారట...

పార్వతి తండ్రిపేరు జానకిరామయ్య. మాస్టరుగిరీ చేసి రిటైరయ్యాడు. ఒకప్పుడు బాగా బతికినవారే...

నేను చేయదల్చుకొన్నది ఆయనకు చెప్పాను. నాకు తెలిసిన శరణాల

యంలో పార్వతిని చేర్పిస్తాననీ, అక్కడ చదువూ వగైరా నేర్పుతారనీ, క్రమేణా తన కాళ్ళమీద తను నిలబడి, వాళ్ళకు ఆసరా అయి పోషించగలదనీ చెప్పాను...అంతా విన్నాడతను.

తన దైన్యపరిస్థితికి దైహికంగా, మానసికంగా క్రుంగిపోయి ఉన్నాడు. నీళ్ళు నిండిన కళ్ళతో—చేతులు జోడించి నమస్కరించాడు. ఆ చేతులను పట్టుకొని వారించాను... పార్వతి తిరిగి వచ్చే వరకూ భార్యాభర్తల ఇద్దరి బాధ్యతా నాదేనని హామీ ఇచ్చాను. కాసేపు ఉండి వెళ్ళిపోయాడాయన.

పెద్దగా శ్రమపడవలసిన అవసరం ఏమీ లేకుండానే పార్వతిని 'మహిళా నికేతన్'లో చేర్పించాను. అయితే, అందుకు చిన్న అబద్ధం ఆడాల్సివచ్చింది. ఆమెకు తల్లిదండ్రులూ, నా అనేవాళ్ళూ ఎవరూ లేరని చెప్పాల్సి వచ్చింది. కొందరు దాతల ఔదార్యంతో, ప్రభుత్వ గ్రాంట్‌తో నడుస్తుంది ఆ నికేతనం. భర్తలచే తిరస్కరింపబడినవారూ, విగతభర్తృకలూ, అనాథస్త్రీలూ...దారి తప్పినవారూ...అక్కడఉండే వాళ్లంతా వీళ్ళే! చదువూ, వృత్తివిద్యా నేర్చి తమంత తాము బ్రతికే శక్తి వచ్చే వరకూ అక్కడ ఉండొచ్చు.

నికేతనం సెక్రెటరీ ఉషారాణితో నాకు ఉన్న పరిచయం చాలా కొద్దిపాటి దైనా, పార్వతి విషయంలో ఆమె చేసిన మేలు ఎన్నటికీ మర్చిపోలేనిది.

వారం రోజులు చాలా బరువుగా దొర్లేయి. కాని, అన్న ప్రకారం 'చందా' కోసం రజని రానేలేదు. మరిహ—రాదేమోనని కూడా అన్పించింది!



## 10

ఒకరోజు సాయంకాలం. సూర్యుడి అంతిమ కిరణాలు ఇంకా అంతరించని వేళ.

'మహిళానికేతన్'కి వెళ్ళి పార్వతిని చూసి వస్తున్నాను. ఇంకో ఇరవై గజాలు నడిస్తే ఇల్లు. ఇంతలో ఎవరిదో కేక వినిపిస్తే ఆగేను.

వీధి గుమ్మంలో నిలబడినరజని నన్ను చూసి నవ్వుతోంది. రమ్మన్నట్టు చెయ్యి ఊపింది. ఇటూ అటూ చూశాను. ఎవరూ, లేరు. నన్ను, నన్నే రమ్మని పిలుస్తోంది. అటు నడిచాను.

"రండి. మీ రాకతో ఇవాళ మా గృహం పావనమైంది" అంటూ ఆహ్వానించింది.

లోపలికి నడిచాను. కుర్చీలో కూర్చున్నాను. బీదతనం స్పష్టంగా కనిపిస్తున్నా, ఇల్లు చాలా శుభ్రంగా ఉంది. గోడలమీద అంగుళంమేర ఖాళీ లేకుండా ఏవేవో కేలండర్లు, దేవతలు, సినిమా తారలు, జంతువులు, పువ్వులు.

ఎప్పటిదో, ఎన్నేళ్లకిందటిదో ఓ సినిమా పత్రికను నా చేతిలో పెట్టి—"ఇది చూస్తూ ఉండండి. . . . ఇప్పుడే

వస్తాను" అంటూ నేను మాట్లాడేంతలో అదృశ్యమైంది రజని.

పక్కగదిలో ఎవరో ఖణేల్ ఖణేల్ మని దగ్గుతున్నాడు. మగ గొంతు. రజనీ, అతనూ మాట్లాడు తున్నారు. మాటలు అస్పష్టంగా ఉన్నాయి. సంభాషణలు బోధ పడటం లేదు.

నాలో ఎన్నెన్నో ప్రశ్నలు. సెంట్రల్ స్టేషన్ సంఘటన ఇంకా మరచిపోలేదు నేను. వరద బాధితుల సహాయార్థం చందాకి రావడం... ఇది కూడా మోసమేనా? అసలు రజని వ్యక్తిత్వం ఎలాంటిది? శీలం లేనిదా? అక్కర్లేనిదా? ఆ మగ గొంతుక ఎవరిది? భర్త కాదు గదా! భర్త ఇంట్లో ఉండగా నన్ను ఆహ్వానించేంత 'విశాల సాంఘిక వాతావరణం' ఇక్కడ ఉందా? నేను అన్ని తరగతుల కుటుంబాలూ, వాతావరణాలూ కొద్దో గొప్పో చూశాను. కాని ఇటువంటి స్త్రీని ఎక్కడా చూడలేదు. చక్కని రూపం. సంస్కార లక్షణాలూ చూస్తే ఉన్నత కుటుంబీకురాలిలా ఉంది. పరిస్థితి మధ్యతరగతికి చెందినట్టు ఉంది. ప్రవర్తన-చర్యలు-చూస్తే 'పచ్చి వ్యభిచారిణి' అన్న.. అనుమానం వస్తున్నది. ఇంతకీ రజని ఎవరు? నా నాగరత్నం పోలికలు పుణికి పుచ్చుకున్న ఈ రజని ఎవరు??

"టీ తీసుకోండి"

పొగలు వస్తున్న టీ కప్పుని నా ఎదురుగా ఉన్న బల్లమీద పెట్టి నిలబడింది రజని.

"ఎందుకూ, అనవసర శ్రమ !" అన్నాను టీకప్పుని అందుకుంటూ. సెంట్రల్ స్టేషన్‌లో నేను పడ్డ శ్రమ... మానసిక వేదన మళ్ళీ జ్ఞప్తికి వచ్చాయి.

"రజనీ," అంటూ ఓ ముసలామె చొరవగా లోపలికి వచ్చింది. నన్ను చూస్తూనే సందేహంగా ఆగిపోయింది. ఆగి, ఎగాదిగా నన్ను పరీక్షగా చూడ సాగింది.

"ఏం దాలమ్మా, తెచ్చేవా ?" అని అడిగింది రజని.

"ఓ" అంది ముసలామె మళ్ళీ నన్ను సందేహంగా చూస్తూ.

"ఏదీ ఇలాగియ్యి. ఫర్వాలేదులే" అంటూ చెయ్యి చాపింది. పైట చాటున దాచిన సీసాని తీసి రజనికి ఇచ్చింది ముసలామె. 'వస్తా' అంటూ వెళ్ళి పోయింది. ఆ సీసాలో ఉన్నదేమిటో స్పష్టంగానే తెలుస్తోంది.సారా. ఆ కంపుని బట్టి ఆమడ దూరంలో ఉన్నా సరే పోల్చ గలను నేను.

ఎవరి కోసం ?

సీసాతో రజని లోపలికి వెళ్ళింది. రెండు నిముషాలైనా కాకముందే మళ్ళీ వచ్చింది.

"ఆ వెధవ తాగుడు లేనిదే ఒక్క రోజుండలేడు... అదేం ఖర్మమో!" అంది రజని, తన చర్యను సమర్థించుకోడాని కన్నట్టు.

ఆ ఉండలేనిదెవరూ ?

భర్తా ?

తండ్రా ?

ప్రియుడా ?

ఇంట్లో ఆ మగప్రాణి లేకపోతే,

ఆమె ఒక్క స్త్రీ ఉన్నట్టయితే, ఆమెను ఎన్నో ప్రశ్నలు వేసి, వేధించి మరీ నా సందేహాలు తీర్చుకొనేవాడిని. ఇప్పుడు ఎలా ? నా అనుమానాలు, నా సందేహాలు, అపరిష్కృతంగా అలా ఉండి పోవలసినదేనా ? ఆమె వ్యక్తిత్వం ఉనికీ, ఊహాతీతంగా మిగిలిపోవలసినదేనా ?

ప్రాణాలు తోడేస్తున్నట్టు.... ఖంగు ఖంగుమంటూ దగ్గు... లోపల్నించి విన వచ్చింది. నాతో ఏదో మాట్లాడానికి, నావేపు చూసిన రజని, ఆ దగ్గు విని అటు చూసింది. దగ్గు ఇంకా తగ్గలేదు. నావేపు ఇబ్బందిగా చూసింది.

"ఇహ, నేవెళ్తాను. ఎప్పుడేనా రండి మీ 'టీ' చాలా బావుంది" అని లేచేను. గుమ్మంవేపు నడిచాను...పరుగు పరుగున లోపలికి వెళ్ళింది రజని.

గుమ్మంవరకూ వెళ్ళిన నేను ఆగిపోయాను. ఆ దగ్గుతూన్న వ్యక్తిని చూడాలి. వెనక్కి నడిచి కిటికీలోంచి చూశాను.

దగ్గుతూ, చేత్తో సీసాపట్టుకొని మంచంమీద కూర్చున్న ఆ వ్యక్తి రాజు !

నాకు ఏదో సమాధానం దొరికి నట్టయింది.

రాజు—రజని.

వీరి బాంధవ్యం ఎలాంటిది? భార్యాభర్తలా ? ప్రేయసీ ప్రియులా ? లేక వ్యభిచార వృత్తిలో అవసరార్థం ఏర్పడిన పరిచయస్తులా ? వాళ్ళగురించి చాలా కాలం ఆలోచించి, చివరికి విసుగొచ్చి మానేశాను.

వాళ్ళగురించి ఆలోచించి, నా టైం వృథా చేసుకోవలసిన అవసరం ఏముంది? వాళ్ళు నాకేం అవుతారు ? ఒకనాటి నా ప్రియురాలి అన్న రాజు. అంతే. మరి రజని...ఏమో !

ఈలోగా నాకు మౌంట్ రోడ్‌లో ఓ ప్రెస్‌లో ప్రూఫ్‌రీడర్‌గా ఉద్యోగం దొరికింది. మకాం కూడా టీనగర్ నుంచి పేరిస్ కార్నర్‌కి మార్చేశాను. ఈ ఉద్యోగంలో చేరిన దగ్గర్నుంచి బొత్తిగా ఖాళీ దొరకటం లేదు. విశ్రాంతీ లేదు. తీరిక దొరికిన సమయం కాస్తా నిద్రకే చాలడం లేదు.

ఒకనాడు రాత్రి తొమ్మిదికి ప్రెస్ నుంచి బైటపడి, భోజనం చేద్దామని హోటలు వేపు వెళ్తున్నాను. ఎవరో నా భుజంమీద చెయ్యివేసి మరీ నన్ను ఆపేరు. వెనక్కి తిరిగిచూస్తే సుధాకర్. ఇన్‌స్పెక్టర్ సుధాకర్. కుశలప్రశ్నాదికాలు అయ్యేక అవీ, ఇవీ మాట్లాడుకొంటూ హోటల్ వరకూ వెళ్లాం. కలిసే భోజనాలు చేశాం.

"అన్నట్టు గురువుగారూ, మీకో విషయం చెప్పడం మరచిపోయాను. మా ఇంట్లో మీరు రాయబోయే నవలకు ముడిసరుకు ఉంది. ఆమె కథగనక వింటే మీరు ఆశ్చర్యపోతారు... ఓసారి రారాదూ ?"

"ఎవరామె ? మీ ఇంట్లో ఉండడమేమిటి ?"

"ఆమె పేరు మహజబీన్. ఒక దుర్మార్గమైన ట్రాప్‌లో నెల్లాళ్లు విలవిలలాడింది. కోర్టుకేసు ఈమధ్యే నడిచింది.

ఎటు వెళ్ళడానికీ వీల్లేని పరిస్థితుల్లో నా కాళ్ళు పట్టుకుంది....ఇప్పుడు మా ఇంట్లో పనిమనిషి..."

"అంతేనా ?"

"ఆఁ అంతే. ఆమె కథవింటే– మీరే కాదు, ఎంతటి కఠినాత్ములైనా జాలి పడతారు. ఆమె గురించి సెక్స్ సంబంధ మైన కోరికలు రావు."

"అయితే పదండి పోదాం"

"అలాగే కానీ, ఓ సీసా కూడా తీసుకువెళ్లాలి. తాగందే నోరు విప్పదు. పైగా దానికి బాగా అలవాటు పడింది."

"అలాగే కానిద్దాం.... ముడిసరుకు కోసం ఆ మాత్రం ఖర్చు పెట్టకపోతే ఎలా ?" అన్నాను నవ్వేస్తూ.

అన్నానే కానీ, ఎలాంటి హృదయ విదారకమైన కథ వినాల్సి ఉందో, ఆ క్షణంలో నేను ఊహించనైనా లేదు. ఊహించి వుంటే నవ్వుతూ అలా మాటాడేవాడినే కాదు.

మరో అరగంటకి సుధాకర్ ఇల్లు చేరాం. కాలింగ్ బెల్ నొక్కగానే తలుపు తెరుచుకొంది. మమ్మల్ని చూసి తలుపుతీసిన యువతి చరచరా లోపలకు వెళ్లిపోయింది. ఇద్దరం లోపలికి నడిచాం. నన్ను కుర్చీలో కూర్చోమని చెప్పి "మీనా" అని కేక వేశాడు సుధాకర్.

ఆమె వచ్చింది. మా ముందు నిల బడింది. సన్నగా తెల్లగా పొడుగ్గా ఉంది. వయస్సు పాతిక లోపే ఉంటుంది. ముఖంలో చక్కని ఆకర్షణ.

"ఈమే 'మహజబీన్'! పేరు మార్చు కొంది. మీనాక్షి అయింది! మా ఇంట్లో నా కాబోయే భార్యకు అసిస్టెంట్‌గా పని చేస్తుంది..." అంటూ ఆమె గురించి నాకు పరిచయ వాక్యాలు చెప్పాడు.

"ఇదిగో–చూడు మీనా, ఈయన గోపీనాథ్ అని నా బెస్ట్ ఫ్రెండ్. మంచి రచయిత. ఆయన నీ గురించి వింటాడు.. ఆయన ప్రశ్నలకు సమాధానాలు చెప్పు... ఏం?"

ఆమె నమస్కరించింది నన్ను చూస్తూ.

"గురువు గారూ, అలా స్టేషన్ వేపు ఓసారి వెళ్లొస్తాను...గంటలో వచ్చేస్తా" అంటూ సుధాకర్ వెళ్లిపోయాడు. వీధి తలుపులు దగ్గరగా వేసింది మహజబీన్, అదే మీనా.

మోటార్ సైకిల్ స్టార్టయినచప్పుడూ, దూసుకుపోయిన చప్పుడూ విన్పించింది బైట.

"కూర్చో" అన్నాను. ఆమె కూర్చో లేదు. ఆమె సందేహం నాకు అర్థం అయింది.

"మరేం ఫర్వాలేదు కూర్చో. నేను మీ అన్నయ్య లాంటి వాణ్ణనుకో. యజమాని ఉన్నప్పుడు సందేహం గాని లేనప్పుడు ఎందుకూ?" అన్నాను.

నా ఎదురుగా గజం దూరంలో ఉన్న కుర్చీలో కూర్చుంది. అసలే సిగ్గు పడక్తా ముడుచుకొని కూచుంటే, జేబులోని సీసాని ఎలా తాగించడం, నాకు అర్థం కాలేదు. నా పరిచయస్తులు చాలా మంది నాకు మాటలాడ్డం సరిగా చేతకాదంటారు. కేవలం సూటిగానో, అవతలి వాళ్లకు నొప్పించేలాగానో మాట్లాడతానుట.

ఏమో, ఆ సంగతి నాకంత తెలీదు. అది నిజమే అయి ఉంటుంది. నాకు ముసుగులో గుద్దులాటలు నచ్చవు. ముక్కెక్కడ అంటే చెయ్యి మూడు వంకరలు తిప్పి చూపించేడం నాకు అసహ్యం.

జేబులోంచి సీసా తీసి బల్లమీద పెట్టేను. "నువ్వు తాగుతావట గదా?" అన్నాను.

ఆమె నన్నొకసారి చూసి మళ్లీ దృష్టి క్రిందికి మళ్లించింది.

"పూర్వం తాగేదాన్ని. ఇప్పుడు మానేసేను. అయినా డబ్బులెక్కడివి? మరెప్పుడూ తాగనని బాబుగారికి ప్రమాణం చేసి చెప్పేను. తాగితే ఆయన కోపం చేస్తారు"

"ఏం ఫర్వాలేదు. ఈ ఒక్కసారీ సుధాకర్ నిన్నేం అనకుండా చూస్తాను. సరేనా?"

ఎంతో బలవంతం మీద కాని అందుకు అంగీకరించ లేదు. చివరికి సీసాలోంచి కొంత గ్లాసులో పోసుకొని వంటింట్లోకి వెళ్లింది. తాగుతుందో పారేస్తుందో చూద్దామని వెనకనే వెళ్లాను. పారబొయ్యలేదు. గొంతులోనే పోసుకుంది. నా ఎదురుగా తాగడం ఇష్టం లేదన్న మాట.

వచ్చి కూర్చుంటూ "ఊఁ. చెప్పండి" అంది నన్ను చూసి.

"ఆ మిగతాది కూడా కానీ..." అన్నాను.

నన్ను ఇబ్బందిగా చూసింది. సీసాలోంచి మరికొంచెం గ్లాసులోకి నేనే ఒంపి ఇచ్చాను. ఇందాకటిలా మళ్లీ వంటింటికేసి వెళ్లలేదు. బల్లమీది జగ్గులోని మంచి నీళ్లు కలుపుతూ నన్ను చూసింది. "బాబుగారు గంటలో వచ్చేస్తారు కదూ?" అంది. ఆ మాటల్లో వచ్చేస్తారేమోనని భయం ఉంది.

"చెప్పలేం ... పనినిబట్టి ఉంటుంది. ఇంకా ఎక్కువ ఆలస్యం కావొచ్చు" అన్నాను.

గ్లాసు ఎత్తి గబగబ తాగింది.

గొంతులోంచి జారిన విస్కీ ఆమెలో పని చెయ్యడం ప్రారంభించినట్టుంది. ఇది వరకులా ముడుచుకొని కూచోడం, బిడియం, క్రింది చూపులూ ఇవేవీ లేవు. మాయం అయ్యాయి. కేర్ ఫ్రీగా కూర్చొంది. సూటిగా నన్ను చూస్తోంది. మనిషిని వెర్రెత్తించే అందం కాదు కానీ, విషాదం మూర్తీభవించిన అందం ఉంది ఆమె మొహంలో. దానికి తోడు తెల్లని తెలుపు. పెద్ద పెద్ద కళ్లు. కాసేపు నన్ను చూసి తర్వాత సీసాలోని మిగిలి ఉన్న ద్రవం వేపు చూసింది.

నేను సిగరెట్ తప్ప మరోదాని జోలికి పోను. మరో చెడు అలవాటు లేదు. విస్కీ, రమ్, జిన్ బీర్, నల్లమందు, గంజాయి, పేర్లు వినడమేగాని వాటిని చవి చూడలేదు. ఎందుకో అవంటే నాకు అసహ్యం... అయితే, వాటికి బానిసలైన వాళ్లని అసహ్యించుకోలేను. సిగరెట్ లాగే అదీ ఓ అలవాటు. దానికేం చేస్తాం? మరీ మితిమీరి వ్యసనపరులైన వాళ్లని చూసి జాలి పడ్తాను.

పైట చెంగుతో మూతి తుడుచుకొని నా వేపు చూసింది ఆమె. కళ్లు ఏవో కలలు కంటున్నట్టున్నాయి. "ఏం చెప్ప మంటారు?" అంది నన్ను.

"నీ గురించి" అన్నాను.

"నా గురించి కాకపోతే ఇంకెవరి గురించి చెప్తాను... అదే లెండి... కాని ఎక్కడనుంచి మొదలుపెట్టాలి?"

"నీ ఇష్టం!"

"చెప్తే మీకేం లాభం?"

"చెప్తే- నీకేం నష్టం లేదుగా?" అన్నాను.

"లేదు"

"అయితే, మరింకేం? కానీ" అన్నాను.

"నేనిప్పుడు మీనాక్షిని. బాబుగారు దయతల్చి వాళ్ళింట్లో ఇంత జాగా ఇచ్చేరు. లేకపోతే- నేనేమయ్యేదాన్నో నాకే తెలీదు. చచ్చి బతికేను. ఇది నాకు మరో జన్మ..." అంటూ ప్రారంభించింది.



## 11

నేను సిగరెట్ వెలిగించుకొని కుర్చీ వెనక్కి చేరబడ్డాను.

"నా పేరు మహజబీన్. ఓ పెద్దింటి పిల్ల పెళ్లి కాకుండానే నన్నుకని తండ్రి చేత నన్ను చెరువు గట్టు మీద పారేయించింది. కాకులూ, గద్దలూ నన్ను పొడవక ముందే ఓ పెద్ద మనిషి నన్ను చూశాడు. నన్నెత్తుకొని, ఎవరైనా పెంచుకుంటారేమోనని ఆ ఊరల్లా తిరిగి అందర్నీ అడిగాడు. ఎవరూ కిమ్మనలేదు. విసిగి, తనే పెంచాలనుకొన్నాడు.

"ఆ ఊరు కోనసీమలోని ఒక పెద్ద పల్లెటూరు. ఆ పెద్ద మనిషి ఒక ముస్లిం. పేరు రజాక్. అతని వృత్తి కసాయిపని. ఆ ఊరంతటికి మాంసం సరఫరా చేసేది అతనే. అతనికి పెళ్లాం పిల్లలూ లేరు. నేను అతనికి దొరికిన నాటికి అతని వయస్సు ఏభై పైనే ఉంటుంది. మహజబీన్‌గా అతని సంరక్షణలో పెరిగి పెద్దయ్యేను. నా పుట్టుకా, ఆ వివరాలు నాకు అతనే చెప్పేవాడు. అతన్ని తాతా అని పిలిచేదాన్ని.

"నాకు థర్డ్ ఫారమ్‌దాకా చదువు చెప్పించి, పెళ్లి చేశాడు. భర్త దగ్గరికి రాజమండ్రి వెళ్లిపోయేన్నేను."

"నెలరోజులేనా కాపరం చేశానోలేదో, నేను బలంగా లావుగా లేననీ, నావి... నా ..నా స్తనాలు చిన్నవనీ, నా భర్త నాకు విడాకులు ఇచ్చి మరొకత్తెని పెళ్ళి చేసుకొన్నాడు. అతనిచ్చిన నూర్రూపాయలు పట్టుకొని తాత దగ్గరికి వచ్చాను. ఇద్దరం మా ఖర్మకి ఏడ్చేం. తాత మళ్ళీ నాకు పెళ్లిచేశాడు. భర్త దగ్గరికి.కాకినాడ వెళ్ళేను. నాభర్తకి ఏభయ్యేళ్లు. అరవై ఏళ్ళ వాడిలా కన్పిస్తాడు. అతనికి నేను మూడో భార్యని. మొదటి భార్యలిద్దరూ ముసలివాళ్లైపోయేరని నన్ను తెచ్చుకున్నాడు. అతనికి బజార్లో పువ్వుల

వ్యాపారం.బాగా సంపాదిస్తాడని అందరూ చెప్పుకొంటుంటే విన్నాను. నాకు వేరే గది. పనేం ఉండేది కాదు. ఎంత సేపూ నిద్ర పోవడమే. అతను ఉదయాన్నే వెళ్ళి రాత్రి పన్నెండు దాటేక వచ్చే వాడు..." అంటూ గ్లాసులోకి సీసాలోది పూర్తిగా వంపేసి, నీళ్లు కలుపుకొని తాగింది.

"రోజూ చిత్తుగా తాగేవాడు. ఒకసారి నాతో కలిస్తే మళ్ళీ నెలరోజుల్దాకా నా ఊసెత్తే వాడు కాదు. కాని, నన్ను కావలించుకొని పడుకునే వాడు. ముసిలి కంపు. అయినా ఆ స్పర్శకి నాకు కోరి కలు కలిగేవి... తెల్లార్లూ మేలుకొని మే లు కొ ని ఎప్పటికో నిద్రపోయే దాన్ని...

"చివరికి ఓనాడు ఏమైతే అదైందని తెగించాను... నా గదికి మరో వేపు తలుపు ఒకటుంది. తలుపవతల పక్కవాటా నాళ్ళు ఉంటారు. తలుపుకి పెద్ద తాళం వేసివుంది. పక్కవాటాలో కాలేజీలో చదువుకొనే అబ్బాయి ఉంటాడని తెలుసుకున్నాను. తాళం చెవిని ఎలాగో సంపాదించి తాళం తీసి, తలుపు చప్పుడు చేసేదాన్ని... అతను కూడా తలుపు కన్నంలోంచి నాకోసం చూడ్డం నేను కనిపెట్టేను...అలాగ — విశ్వనాథంతో నాకు పరిచయం అయింది. విశ్వనాథం నాకన్నా చిన్నవాడే, కాని చాలా చురుకైనవాడు. నా భర్తకు తెలియకుండా, ఇద్దరం ఏడాదిపాటు కలుసుకున్నాం ..

"ఒకరోజు తను మద్రాసు వెళ్తున్నానసీ, నన్ను కూడా రమ్మనీ అడిగాడతను.విశ్వనాథం పాటలు పాడ్తాడు.సినిమాల్లో పాడాలని అతనికి ఆశ.ఆ ప్రయత్నం కోసమే మద్రాసు ప్రయాణం. మా తాత దగ్గరికి వెళ్తున్నానని చెప్పి బొంకి నాభర్త దగ్గర డబ్బు తీసుకున్నాను ... ఇద్దరం కలసి మద్రాసు వచ్చాం. నాకు ఒక్కసారి—జైల్లోనుంచి బైట పడినట్టయింది. విశ్వనాథం రోజూ ఉదయాన్నే వెళ్ళిపోయేవాడు. ఎక్కడెక్కడో తిరిగి రాత్రికి వచ్చేవాడు. అతను వచ్చేవరకూ లాడ్జిగదిలో ఒక్కతినీ బిక్కు బిక్కుమంటూ కూర్చునేదాన్ని. నన్నూ తనతో తీసుకెళ్లమని పోరేదాన్ని. తోకలాగ నువ్వెందుకూ అని విసుక్కునేవాడు.

"ఓనాడు కాఫీ టిఫిన్ చేసేసి విశ్వనాథం వెళ్ళిపోయేడు. కాఫీ కప్పులు తీసుకుపోవడానికి వచ్చిన హోటలుబోయ్ నన్నుచూసి "సినిమా స్టారుల్ని, చూస్తారా అమ్మా" అని అడిగాడు. నాక్కూడా చూడాలనేఉంచి.'చూపిస్తావా?' అని అడిగాను. 'ఓ' అన్నాడు వాడు. ఆ అరవదేశంలో ఆ తెలుగువాణ్ణి చూసి నా ప్రాణం లేచి వచ్చింది. చెప్పకుండా వెళ్తే విశ్వనాథం ఏంఅంటాడో...? నాకు కోపం వచ్చింది. నన్ననడానికి అతనెవరు ?— అనుకున్నాను. బోయ్‌తో కలిసి బైటికి వెళ్ళేను. బోయ్ పేరు అప్పారావు. వాడికి ఇరవై ఏళ్లుంటాయి. మంచివాడిలాగే కన్పించాడు. టేక్సీలో ఊరంతా తిరిగాం. సినిమా స్టూడియోలూ, స్టార్‌ల ఇళ్లూ అల్లదిగో అంటూ దూరం నుంచే చూపించాడు. నేనే డబ్బు ఖర్చు పెట్టేను. అంతా తిరిగేసరికి మధ్యాహ్నం

దాటింది. ఒకచోట ఇంద్రభవనం లాంటి మేడ చూపించి– 'ఇదేంటో తెలుసండీ అమ్మగారూ ?' అన్నాడు అప్పారావు అది సినిమా హాలుట. విని ఆశ్చర్య పోయేను. 'సినిమాచూస్తారా?!' అన్నాడు. 'సరేపద' అన్నాను. 'హైక్లాస్ టిక్కెట్లు' కొనమని దబ్బిచ్చేను. నిజంగానే ఆ సినిమాహాలు ఇంద్రభవనంలా ఉంది. లోపల ఎంతోచల్లగాఉంది.నేలమీదఎర్రని తివాసీ ఎంతో మెత్తగా ఉంది. కుర్చీలో కూర్చొనే సరికి స్వర్గంలో ఉన్నట్టన్పిం చింది. అదేదో ఇంగ్లీషు సినిమాట. ఎంత సేపూ ముద్దులూ, కావిలింతలూ, ఒకరి మీద ఒకరు దొర్లడాలూ ... అంతలో అప్పారావు చెయ్యి నా భుజం మీద పడింది. కుర్రవెధవలా కన్పించి ... ఏమిటీ పని అని ఆశ్చర్యపోయేను. నా మౌనం చూసి ఏమనుకున్నాడో చెయ్యి మరీ క్రిందికి దించేడు. జాకెట్టు గుండీలు తడిమాడు. నా కోసం ఎంతో కష్ట పడ్డాడు. వాణ్ణి తిట్టడానికి నోరు రాలేదు. పోనీలే అని ఊరుకున్నాను. కాని వాడు మాత్రం ఊరుకోలేదు. చొర వగా నా గుండెలమీద చేతులు వేసి నా మీదికి వాలిపోయేడు. ఇదంతా మా వెనుక వరుసలో ముగ్గురు మొగాళ్లు చూస్తున్నా రని అప్పుడు నాకు తెలీలేదు. గ్రహించ లేక పోయేను...

"సినిమా అయిపోయేక హాలు బైటికి వచ్చాం. 'సముద్రపు ఒడ్డుకి వెళ్దాం' అన్నాడు అప్పారావు.

"నా కసలు సముద్రం అంటే ఏమిటో అప్పటివరకూ తెలీదు. 'పద చూద్దాం' అని నడక ప్రారంభించాం. ఆ కుతూహలంలో మా వెనక ఎవరు వస్తున్నారన్న ఆలోచనే లేదు నాకు, సరదా తప్ప. నా దురదృష్టం నన్ను బ్రహ్మరాక్షసిలా వెంటాడుతున్నది. సముద్రాన్ని చూసి చిన్నపిల్లలా గెంతు లేసేను. కెరటాలు చూసి కేకలు వేసేను. చీకటి పడింది. జనానికి దూరంగా ఇసకలో యిద్దరం కూర్చు న్నాం. నాకెంతో ఆనందంగా ఉంది. అంత ఆనందంలోనూ ఏడుపు వచ్చింది. నా మొదటి భర్త మంచి అందగాడు. అతను నాకు విడాకులిచ్చి పంపెయ్య కుండా ఉంటే నా జీవితం ఇలా పాడ య్యేది కాదు. ముసలి భర్తతో కోరికలు తీరక విశ్వనాధాన్ని ఆశ్రయించే దాన్ని కాదు. విశ్వనాధం మాత్రం... అతనికి ఎంత ఆనందం అందించి, ఎప్పుడు కావాలంటే అప్పుడు దబ్బిచ్చేదాన్ని. తన స్వార్థమేగాని నా సంగతి ఏం పట్టించుకున్నాడు... ఇలా ఆలోచనల్లో మునిగి అప్పారావు ప్రయత్నాలు గమ నించలేదు. అప్పారావు హఠాత్తుగా నన్ను కౌగిలించుకుని ఆత్రంగా ముద్దులాడ సాగేడు. ఉన్నట్టుండి నన్ను వెనక్కి లాగేడు. వెల్లికిలా ఇసుకలో పడుకుండి పోయేను. నా మీదికివాలి నన్ను బలంగా అదుముతూ నా జాకెట్టు మీద చేతులు వేశాడు... కెరటాలు... వాటి అందమైన చప్పుడు . . . వెన్నెల...అడ్డుపెట్టలేదు నేను.

"అంతలో అప్పారావు ఒక్క ఉదుటున లేచిపోయాడు. ఎదురుగా

ముగ్గురు మగాళ్లు, నేను కంగారుగా లేచి కూర్చొని నా ఒంటినిండా పైట కప్పుకొన్నాను.

"అందులో ఒకడు అప్పారావుని అరవంలో ఏదో అన్నాడు. ధబీధబీమని అప్పారావుని తన్నేడు. వెధవ. పిరికి వాడిలా, నన్ను ఒదిలేసి పారిపోయేడు. నా కంగారు చెప్పతరం కాదు. గిలగిలా తన్నుకుంటున్నా, నన్ను వాళ్లెత్తుకుని కార్లో కూర్చోపెట్టేరు. నేను అరవకుండా ఒకడు నా నోరునొక్కేడు.

"ఇంక అక్కణ్ణించీ నరకం!! నన్ను ఓ గదిలో పెట్టేరు వాళ్లు. బైట తాళం వేసేవారు. ఎంత అరిచినా ఏడ్చినా ఎవరూ వచ్చేవారు కారు. రోజూ సాయంకాలం ముగ్గురూ వచ్చేవారు. నా చేత బలవంతంగా తాగించేవారు. నాకు ఒంటిమీద తెలివిపోయేలా తాగించేవారు. అందులో ఒకడు నన్నాక్రమించుకోవడం వరకే తెలిసేది. ఎప్పుడో తెలివి వచ్చి చూసుకుంటే-చీరొక చోటా, జాకెట్టు ఒక చోటా ఉండేది. ఒళ్లంతా పచ్చిపుండులా నొప్పిగా ఉండేది... ఈ నరకాన్ని — నెలపైగానే అనుభవించేను. చాలీచాలని తిండి. దున్నపోతుల్లాంటి ఆ ముగ్గురూ నన్ను పీల్చిపిప్పి చెయ్యడం... దీంతో చిక్కిశల్యమై పోయాను... చివరికి అందులో ఒకడికి జాలి కలిగింది కాబోలు... నన్ను మా ఊరికి పంపేస్తానన్నాడు. జాలి కాదు. వాళ్లకి మరింక నా మీద మోజు తీరిపోయింది. నన్ను మద్రాస్ స్టేషన్‌కి తీసుకెళ్ళి బండి ఎక్కించాడు. టికెట్టు చేతిలో పెట్టి 'రేపు మధ్యాహ్నం రాజమండ్రి వస్తుంది' అని చెప్పి వెళ్ళిపోయాడు. . కంటిమీద కునుకు లేకుండా కూర్చున్నాను. మా తాతకి అంతా చెప్పి, కాళ్ల మీద పడదామనుకుని, బుద్ధిగా ఉండాలని నిర్ణయించుకున్నాను. తెల్లవారింది. మధ్యాహ్నం అయింది.

"తెలుగు మాట వినపడలేదు నాకు. ఒకచోట బండి ఇంక ముందుకు వెళ్లదన్నారు. బండి దిగి గేట్లో టిక్కెట్టు ఇచ్చేను. అతను నన్ను అనుమానంగా చూసేడు. ఏదో అడిగాడు. నాకు ఆ భాషరాదు. నన్ను పోలీసులకి అప్పచెప్పేడతను. వాళ్లలో ఒక తెలుగాయన ఉన్నాడు. అతనికి నా కథంతా చెప్పుకొని ఏడ్చాను. నేనెక్కిన బండి రాజమండ్రి వెళ్లదుట. అది బెంగుళూరన్నాడు. నా టిక్కెట్టు ప్లాట్‌ఫారం టిక్కెట్టుట... నన్ను మళ్లీ రైలెక్కించి మద్రాసు పోలీసులకు అప్పచెప్పేడు. వాళ్లు నా వాలకాన్నీ, నా కథనీ ఓపిగ్గా విని, చూసీ- మరో పోలీసులకి అప్పచెప్పేరు... కొన్నాళ్లకి కోర్టులో బోనెక్కేను. విశ్వనాథం, అప్పారావు, ఆ ముగ్గురు వెధవలూ కూడా కోర్టుకి వచ్చేరు. వాళ్లని పోల్చుకున్నాను. కోర్టువాళ్ల ప్రశ్నలకి జవాబులు చెప్పాను. వాళ్లకి శిక్షలు పడ్డాయి. అంతకన్నా పెద్ద శిక్ష నాది... నేనిప్పుడెక్కడికి వెళ్లాలి...?

"కాకినాడ వెళ్తే నా మొగుడు నన్ను నిలువునా చీరేస్తాడు. తాత మొహం చూడాలంటే సిగ్గు... ఎక్కడికి

పోతాను.!

"బాబుగారి దయవల్ల ఇక్కడ ఇంత చోటు దొరికింది కాబట్టి బతికి ఉన్నాను. లేకపోతే–"

ఆఖరి దమ్ము లాగి సిగరెట్ కింద పడేసి బూటూకాల్తో నలిపేశాను.

పైట చెంగు నోట్లో కుక్కుకొని వెక్కి వెక్కి ఏడుస్తోంది మహజబీన్! కాదు కాదు మీనా.



## 12

యాంత్రికంగాజీవితంగడుపుతున్నాను. ఎవరి గురించీ ఆలోచించాలని గాని, తలుచుకోవాలనిగాని లేదు. కాని ఏదైతే వద్దనుకుంటానో అదే నన్ను వేధిస్తున్నాది. అనుక్షణం అవే ఆలోచనలు. నాగరత్నం, రజని,రాజు,వాసు, పార్వతి మహజబీన్ ... వాళ్ళ మాటలు.

ఏదైనా వ్యాపకం దొరికితే తాత్కాలికంగా మరిచి పోగలనేమో. ఏదైనా రాయడం ప్రారంభించాలని అనుకున్నాను. కాని ఏం రాయడం ? ఏం చెప్పాలని రాయాలి? చెప్పేందుకు ఏమి లేనప్పుడు రాత ఎందుకు ? దండుగ. చదువు ప్రారంభించాను. పని, చదువు, నిద్ర.

అలా రెండునెలలు గడిచాయి,

ఒకరోజు... పేరిస్ కార్నర్లో పుస్తకాల షాపు ముందు నిల్చొని పత్రికల వేపు చూస్తున్నాను. "నమస్కారం సార్!" అంటూ పలకరించాడు రాజు.

పీక్కుపోయిన మొహం, నల్లపాంట్ పువ్వుల చొక్కా. మరేం మార్పు లేదు. మునుపటికన్నా బాగా చిక్కిపోయాడు. గెడ్డం బాగా పెరిగింది.

"పదండి సార్, కాఫీ తాగుదాం" అంటూ నన్ను లాక్కెళ్ళాడు.

ఇద్దరం హోటల్లో ఎదురుబొదురుగా కూర్చున్నాం. సప్లయర్ రాగానే రెండు కాఫీలకు ఆర్డరిచ్చాడు. నా వేపు చూసి "నేను గుర్తున్నానా సార్ !" అన్నాడు.

"మర్చిపోలేదు" అన్నాను.

కాఫీలు వచ్చాయి. మౌనంగా కాఫీ తాగేం "రజని ఎక్కడుంది!" అన్నాను హఠాత్తుగా.

కాసేపు రాజు ఆశ్చర్యపోయినట్టు నన్ను చూశాడు. "ఆవిడ పేరు ఎత్తకండి సార్! మూడ్ అంతా పాడైపోతుంది!" అన్నాడు.

"రజని ఎక్కడుంది?" అన్నాను మళ్ళీ సీరియస్‌గా.

"ఎక్కడికో వెళ్ళిపోయింది."

"అంటే?"

"అంటే ఏముంది? వెళ్ళిపోయింది. అదృశ్యమైపోయింది" అన్నాడు బీడీని నోట్లో పెట్టుకుంటూ.

"కాస్త నాకు బోధపడేట్టు మాట్లాడు"

ఇంతలో రోడ్డున పోతున్న పెద్దమనిషొకడు రాజుని చూసి హోటల్లోకి వచ్చాడు. తెలుగువాడే. ఇంటి ఓనరు లాగుంది. కిరాయి డబ్బు సంగతి అడి

గాడు. రాజు ఏదో సర్ది చెప్తున్నాడు. అది వినకుండా నాలుగు తిట్టి వెళ్ళి పోయాడతను.

"వెధవ!" అంటూ రాజు బీడీని తీసి నేలకేసి కొట్టాడు.

"ఎవరతను"

"ఇంటి యజమానిగాడు. అద్దె బాకీ అడుగుతున్నాడు. ఛీ. ఛీ. రజని వల్లే నాకీ తిప్పలన్నీ."

"రజని ఏం చేసింది?"

"రజని మూలంగానే ఆ ఇల్లు అద్దెకు తీసుకున్నాను. నేనిలా ఇల్లు దాటి బైటికి రావడంతడవు ఈ ముసలివెధవ రజనితో హస్కు వేసుకునేవాడు. అసలు రజనిదే బుద్ధి తక్కువ. మగాడు ఇంట్లో లేనప్పుడు, ఇంకో పరాయిమగాడిని ఇంట్లోకి ఎందుకు రానివ్వాలి? పైగా వాడితో నవ్వులు...శని వదిలిపోయింది లెండి."

"ఎలా ?"

"రజని లేదుగా. వెళ్ళిపోయిందిగా. రజని ఉన్నన్నాళ్లూ బెల్లం కొట్టిన రాయిలా ఉన్నాడు. వెళ్ళి పోగానే ముసిలి పీనుగ తెగనీలుగుతున్నాడు."

"సరే—రజని సంగతేమిటి? ఎక్కడికి వెళ్ళింది?" అన్నాను.

"ఎక్కడికా ఏట్లోకి. నరకానికి అవును. అంతే. అందం ఉంది. ఆరోగ్యం ఉంది. డబ్బు లేక పోతే ఏం? ఎలాగైనా బ్రతగ్గలదు. ఆమెకు నేను ఎంత చేశానో ...ఎంత సహాయం చేశానో చెప్తే గొప్ప చెప్పుకుంటున్నాననుకుంటారు మీరు. కాని నిజం. నేను గాని ఆమెను ఆదుకోక పోతే రౌడీలు,గుండాలు ఆమెను జలగల్లా పీక్చేవారు. ఇల్లు తీసుకొని ఆశ్రయం ఇచ్చేను... ఛ. ఛ. ఎవరికీ సాయపడకూడదు సార్! పాలుపోసిన చేతినే నరుకుతారు ఈ లోకంలో. సర్వనాశనం చేస్తారు."

"ఎంత సేపూ నీ గొడవే— నా ప్రశ్నకి మాత్రం సమాధానం లేదు." అన్నాను, లేచి నిలబడ్తూ.

కౌంటర్లో బిల్లు ఇచ్చాను.

రోడ్డు మీదికొచ్చి మరొక బీడీ ముట్టించాడు రాజు.

"హైదరాబాద్ వెళ్ళిపోయింది. అక్కడెవడో సేఠ్ ఉన్నాడు. వాడికి ఉంపుడుకత్తెగా ఉంటుంది కాబోలు !" అన్నాడు రాజు వికారంగా మొహం పెడ్తూ.

అప్పుడు నాకు నాగరత్నం గుర్తుకు వచ్చింది. ఎంతైనా నాగరత్నం అన్న కదా, అందుకే ఆ పోలికలు.

నేనేదో దురదృష్ట జాతకుడిలా ఉన్నాను. లేకపోతే ఏమిటీ బాధలు? నాగరత్నం సంగతి అలా అయింది. పార్వతి ఏదో బాగానే ఉంది. మహజబీన్...? హృదయం చచ్చిన నాకు వీళ్లే తారసపడాలా?

"సార్, ఓ ఫైవ్ రుపీసుంటే ఇవ్వండి!" అన్నాడు రాజు.

పది రూపాయలిచ్చాను.

"చిల్లర లేదు సార్"

"పర్వాలేదు. ఉంచుకో !"

నమస్కారం చేసి వెళ్ళిపోయాడు.

నాగరత్నానికి నేను చేసిన ద్రోహం విని రాజు ఏమంటాడు ?

నన్ను క్షమిస్తాడా అసలు ?



# 13

బరువుగా నిట్టూర్పు విడిచి వెనక్కి తిరిగేలోగా ఓ ముసలాయన నవ్వుతూ నా ఎదురుగా నిలబడ్డాడు. రాజు ఇంటి ఓనరు. నాకు కొంచెం ఆశ పుట్టుకు వచ్చింది. రజని గురించి ఇతనేమైనా చెప్పగలడేమో !

"మీతో మాట్లాడాలి..... నా పేరు సుబ్బరామయ్య. నా ఇంట్లోనే రాజు అద్దెకి ఉండేవాడు" అన్నాడతను.

"రండి. ఇక్కడికి మా ఇల్లు దగ్గరే" అంటూ దారితీశాను.

ఇంట్లో ఎదురు బొదురుగా కూర్చున్నాం.

"నేనెవరినో మీకు తెలియకపోయినా, మీరు నాకు బాగా తెలుసు. మీపేరు విన్నాను. అందుకే మిమ్మల్ని హెచ్చరిద్దామని ఇలా వచ్చాను...మీకు రాజు బాగా తెలుసా ? మీకు ఫ్రెండా ?"

"కాదు. ఏదో కొద్దిపాటి పరిచయం" అన్నాను.

"అమ్మయ్య అంతేకద. రక్షించారు. అతన్తో స్నేహం పెట్టుకోకండి. వట్టి రోగ్. అతన్తో మీలాంటి వాళ్ళకు పొత్తేమిటి ? నేనప్పుడే అనుకున్నానులెండి. ఆర్నెల్లనుండి చూస్తున్నాను ఒక్క పైసా అద్దెకింద జమకట్టలేదు. భార్యని అడ్డు పెట్టుకుని అతను ఎంత తాగేవాడో నాకు తెలుసు. ఆమె సంపాదించడం ఆయన గారు తినడం.... నేను ముసలాడిని... ఈ విషయాలు చెప్పాలంటే అదోలా ఉంది నాకు... తన భార్య ద్వారా నన్ను వలలో వేసుకోవడానికి ప్రయత్నించాడు. నా దగ్గరికి పంపేవాడు ఆమెని..."

"అయితే, రాజుని రజని వదిలేసి పోయినట్టేనా ?"

"లేకపోతే, ఏం చేస్తుంది ? పీకల మొయ్యా తాగడానికి డబ్బిచ్చి, మింగడానికి మెతుకులు పెట్టినా ఇంకా చాలదనే వాడిదగ్గర కుక్కలా ఎవర్తి పడి ఉంటుంది చెప్పండి ?"

జేబులోంచి సిగరెట్ పేకెట్ తీశాను. "ఇంతకీ రజని ఎక్కడికి వెళ్ళిందో తెలుసా మీకు ?" అన్నాను.

"హైదరాబాద్ వెళ్ళింది. నాకు అన్నీ తెలుసు. రామ్‌లాల్ అతని పేరు. బంగారు, వెండి నగల వ్యాపారం. చాలా ఆస్తిపరుడు. భార్య పోయింది. అతనికి నలుగురు పిల్లలు. చింత చచ్చినా పులుపు చావలేదన్నట్టు ఆడదానిమీద కోరిక వాడికి చావలేదు.రజనికి దరిద్రం. పైసా దొరికినా తాగి పడుండే మగాడితో ఏం సుఖిస్తుంది ? గమ్మత్తేమిటంటే ఇద్దరికీ జత ఎలా కలిసిందో... మద్రాస్ ఎక్కడ? హైదరాబాద్ ఎక్కడ ?"

"....రజనిని మీ దగ్గరికి పంపేవాడన్నారు...ఎందుకోసం ?"

"ఇంకెందుకూ, డబ్బుకోసం !"

"మీరిచ్చేవారా ?"

"ఏం చెయ్యను ? అడ కూతురు. కష్టాల్లో ఉండి అడిగితే కాదంటానా ?"

"మీరామెను..."

"అబ్బే.ముసలివాణ్ణి...నాకా ఉద్దేశమే లేదు. ఏదో చూసి...అంతే !"

"రజని పతిత అనేనా మీ నమ్మకం

"భలేవారే మీరు ? అలా అడుగ తున్నారేమిటి? ఢంకా భజాయించి మరీ చెప్తాను. అయినా, అలాంటి మొగుణ్ణి కట్టుకొని ఎవత్తి పతివ్రతగా ఉండగలదు చెప్పండి ?"

నేనేం మాట్లాడలేదు. అతనే కాసేపు అవీ ఇవీ మాట్లాడి వెళ్ళిపోయాడు.

ఆ రోజే నాకు టి నగర్‌లో ఏదో పనుండి వెళ్ళేను. పని చూసుకొని బస్ స్టాప్‌లో నిలుచుంటే రాజు కన్పించాడు.

"నమస్కారం సార్" అన్నాడు.

నాకు అతని మొహమేనా చూడాలని పించలేదు.

"సార్, వెనక ఓసారి మీరు నాకొక ప్రామిస్ చేశారు..."

"ఏమని ?"

"ఎప్పుడు కావల్సివచ్చినా నాకేదైనా సాయం చేస్తానన్నారు"

"అవును..అయితే...?"

"ఇన్నాళ్లూ దాని అవసరం రాలేదు ఇప్పుడు వచ్చింది. అందుకే అడుగు తున్నాను."

ఏమిటి కావాలి ?"

"ఓ వంద రూపాయలు కావాలి.... మళ్ళీ ఇచ్చేస్తాను. ఆలస్యం అవుతుంది.

అంతేగాని మీ డబ్బు పువ్వుల్లో పెట్టి మరీ ఇచ్చేస్తాను."

"సారీ...ఇవ్వలేను"

"అంతమాట అనకండి. మీరివ్వక పోతే నా బతుకే వృధా అయిపోతుంది.."

"అయితే—నాకేం ?"

"అంతేనంటారా ? మీరు డబ్బిస్తే హైదరాబాద్ వెళ్లాలని ఎంతో ఆశ పడ్డాను. రజనితో ఎలాగైనా మాట్లాడాలి. చాలా అవసరం. ఏమంటారు సార్ ?"

"ఏమంటాను... 'సారీ' అన్నాను. మళ్ళీ అదే మాట అంటాను" అన్నాను చికాగ్గా.

దీనంగా చూశాడు నావంక.

"మీకు తెలీదు సార్... రజనిని నేను ఎంతగా ప్రేమించానో...ఆమెను చాలా అర్జెంటుగా చూడాలి.."

మళ్ళీ రొంపిలోకి-మరో రొంపిలోకి దింపడానికి కాబోలు !

"రజని అంటే అంత అభిమానమా నీకు?" అన్నాను వెటకారంగా.

"అవును సార్"

"ఆమెకోసం ఏమన్నా త్యాగాలు చేశావా ?"

"అవును సార్, కావాలంటే ఆమెనే అడగండి. నేను గనక లేకపోతే ఆమె కాబూలీ వాళ్ళ పరమయ్యేది. వాళ్ళు ఆమెని చిత్ర వధ చేసేవారు. నేనే కాళ్ళా వేళ్ళాపడి రక్షించాను."

"కాబూలీ వాళ్ళకు రజని ఎందుకు?"

"అందమైన ఆడది ఎవరికైనా కావాల్సిందే...అందులో ఒంటరి ఆడది.. రుణపడి రక్షణలేని ఆడది, మగాడు లేని

ఆడది ఏం చెయ్యగలదు ?" అన్నాడు డగ్గుత్తికతో.

ఏం నటన-అనుకొన్నాను.

"రక్షించానంటావ్ ? సరే బాగుంది ! మరి, ఆ తాగుడు మానెయ్యలేక పోయావా ? అది కూడా త్యాగం చేసి ఉంటే, ఆమె నీ దగ్గరే ఉండేదేమో !" అన్నాను.

"నా తాగుడికి కారణం, మీకు ఇప్పుడు కాదు, మరోసారి చెప్తాను. అది బలహీనతే, కాని క్షమించరాని బలహీనత మ్మాత్రం కాదు. నేనెవరికీ ద్రోహం చెయ్యలేదు !"

కట్టుకున్న భార్యను పరాయి పురుషుడిదగ్గరికి పంపడం...దాన్నేమంటారో? ఆనందాలకోసం వెదికే ఆనందరావుల్ని వ్యభిచారిణుల దగ్గరికి దారి చూపించి తీసుకెళ్ళి కమీషన్లు కొట్టే వృత్తిని ఏమంటారో !-అవన్నీ అడగాలన్పించింది.

"అదంతానాకు అనవసరం. నా దగ్గర డబ్బులేదు. ఉన్నా ఇవ్వను. నా యిష్టం. నన్ను వేధించకు. మళ్ళీఎప్పుడూ నాతో మాట్లాడటానికి ప్రయత్నించకు. ప్లీజ్ లీవ్ మీ !" అన్నాను.

నిర్ఘాంత పోతూ నన్ను చూశాడు రాజు.

"మీరు కూడా అందరిలాంటి వారేనా, సార్ !" అన్నాడు.

"కాక పోతే మరేమిటను కున్నావ్ ? నేనూ మనిషినే, నాకేం రెండుకొమ్ములూ పది కోరలూ లేవు. ప్లీజ్ గో ఎవే !"

"ఈ ప్రపంచం ఒక అడవి అని నేనెప్పుడో గ్రహించాను సార్. ఎవరి సోదే వాళ్ళది కాని ఎదటి వాడి సొద వినడానికి ఎవరికీ తీరు బాటు లేదని నాకూ తెలుసు. ఈ మహారణ్యంలో ఒక్కడైనా నిజమైన మానవుడు ఉండడా అని వెదికాను. అది మీరే అని భ్రమపడ్డాను...కారన్న మాట !" అనేసి చరాచరా వెళ్ళిపోయాడు రాజు.

అంతలో బస్ వచ్చింది.



## 14

కాలం తన మానాన తాను గడుస్తూనే ఉంది. ఎలాగో నాకే తెలియకుండా మూడు నెలలు గడిచి పోయాయి. నా పని మామూలే. ఆ వేళ మాత్రం పార్వతిని చూద్దామని 'మహిళానికేతన్'కి వెళ్ళేను. సాయంకాలం నాలుగన్నా కాలేదు...నేను వెళ్ళేసరికి ఆమె లేదు. ఎక్కడికో వెళ్ళిందన్నారు. ఏం చేయను...దగ్గర్లోనే సెక్రటరీ ఉషారాణి ఇల్లు. వెళ్ళి అక్కడ కాసేపుండి మళ్ళీ వద్దామనుకున్నాను.

గేటు తెరుచుకుని లోపలికి వెళ్ళేను. పోర్టికోలో ఉండాల్సిన నీలంరంగుఫియట్ కారు లేదు. అంటే ఉషారాణి బయటికి వెళ్ళిందేమో...అనుకున్నాను. అంతలో నా దృష్టి దూరంగా ఉన్న ఎరుపురంగు అంబాసిడర్ కారు మీద పడింది. కొత్త

కారు కొన్నదేమో...పోర్టికో ఎక్కి ఇంట్లోకి నడిచాను. ముందుగదిలో ఎవరూ లేరు. ఇంకా ముందుకు నడిచి పక్కనున్న గది తలుపులు తోసేను. కొద్దిగా తెరుచుకున్నాయి. తెరుచుకోగా నేను చూసినా దృశ్యం...

ఒక్కసారి నాకళ్ల చీకట్లు కమ్మాయి లోపల మంచం మీద పార్వతి అర్థ నగ్నంగా పడుకొని ఉంది. ఆమె పక్కనే... అతనెవరో...

ఆవేశంతో ఊగిపోయాను. వెయ్యి ఏనుగుల బలంతో తలుపుని తన్నేను. గదిలోకి అడుగుపెట్టేను. నన్నూ, నా ఉగ్ర నరసింహావతారాన్ని చూసి వాడు... —ఆ నీచుడు... పరుగు పెట్టేడు.

నేను పార్వతిని సమీపించాను. చీరని ఒంటినిండా కప్పుకుంటూ లేచి నిలబడింది పార్వతి. "పూర్వం తలిదండ్రుల్ని పోషించడం కోసం చేశానీపని... నూస్తారూ! ఇప్పుడు నా ఒక్కదాని కోసం ... రోజుకి...!" అంటూ చీరె చెంగు నోట్లో దోపుకొని వెక్కి వెక్కి ఏడవసాగింది

ఆ ఏడుపు వినలేక ఎవరో తరుము కొని వస్తున్నట్లు బైటికి పరుగెత్తాను నేను...!

* * *

అలా ఎంతసేపో పరుగెత్తి, పరుగెత్తి చివరికి ఆగాను. ఆయాసంతో ఉక్కిరి భిక్కిరి అవుతూ చుట్టూచూశాను. నాలుగురోడ్ల కూడలి అది.

చుట్టూ ఎటు చూసినా చెలరేగిన జన సమ్మర్దం. ఉరుకులు. పరుగులు. కాస్త ఆలస్యం అయితే ప్రాణాలే పోతాయేమో నన్నంత ఆత్రంగా జనం పరుగులు పెడ్తున్నారు.

నేను మాత్రం జీవచ్ఛవంలా రోడ్డు మీద నిల్చున్నాను. నేనిప్పుడేం చేయాలి కాలు ఎత్తలేక పోతున్నాను. బుర్ర గిర్రున తిరుగుతోంది. కళ్లముందు చీకట్లు. తూలి పడబోయాను. రోడ్డు వార చెత్త డబ్బా పట్టుకుని నిలద్రొక్కుకున్నాను. నా వాలకం చూసి తాగుబోతుననుకున్నారో ఏమో ఇద్దరు అరవభామలు అదిరిపడి, గబ గబా నడిచారు. కాస్సంత దూరం వెళ్ళి తలలు తిప్పి చూశారు. వాళ్ల మొహాలు చూడలేక కళ్లుమూసుకున్నాను. అలాగే ఓ అయిదు నిమిషాలు ఉండిపోయాను. ఖాళీగా ఓ టాక్సీవస్తే అది ఎక్కి కూర్చున్నాను. ఎలాగయితే నేం చివరికి ఇల్లు చేరుకున్నాను. మంచం మీద మేను వాల్చాను.

షాక్‌నుంచి క్రమక్రమంగా తేరుకున్నాను. రెండు గ్లాసుల మంచినీళ్ళు తాగాక, కొంత స్థిమిత పడ్డాను. కాని, మనసుమీద పడ్డ ఆ బొమ్మను మాత్రం చెరిపి వెయ్యలేక పోతున్నాను.

పెనం మీద కాలుతున్న పార్వతి బతుకును పొయ్యిలోకి నెట్టివేశానా? ఆ మంటలకు ఆహుతి కానిచ్చానా?

'మహిళా నికేతన్' గురించి ఉషారాణి ఎంత గొప్పగా చెప్పింది... ఆ ఆదర్శాలూ,అక్కడి నియమనిబంధనలూ కట్టడీ, మానవతా విలువలూ — ఇవన్నీ వట్టిదేనా?

* * *

మద్రాస్ వాతావరణంలో మరి ఉండ లేననిపించి, అక్కడ ఉద్యోగం మానేసి హైదరాబాద్ వచ్చాను. దగ్గరున్న డబ్బు చాలా మట్టుకు ఖర్చు అయిపోయింది. వెయ్యో, పదిహేను వందలో మిగిలి ఉన్నాయి. ఇక్కడ ప్రెస్సుల్లో గాని, పత్రికల్లో గాని ఉద్యోగం దొరుకుతుందే మోనని ప్రయత్నించేను. ఉద్యోగం దొరకలేదు గాని, ఖాళీ ఏర్పడగానే తప్పక నీకే ఇస్తాం అన్న 'మాటలు' లభించాయి;

ఒకరోజు ఒక సినిమా కంపెనీ నుంచి నాకో ఉత్తరం వచ్చింది... నా కథనొ కదాన్ని సినిమా తియ్యాలను కొంటున్నా రట... నాతో మాట్లాడాలట ... ఫలానా హోటల్ రూమ్‌నెంబర్ ఫలా నా. . .కి రమ్మని దాని సారాంశం.

ఆ కథ . . . వాళ్ళకెలా సినిమా తియ్యాలని బుద్ధి పుట్టిందో . . . అది అమ్మాయి అబ్బాయి ప్రేమ కథ కాదు. అవి రాయడం నాకు చేతకాదు. ఆ కథ నిండా కష్టాలూ, కన్నీళ్ళే. దాన్నెవరు చూస్తారు?

అయినా రమ్మన్నారు గనక వెళ్ళేను.

పోష్ హోటల్లో... ఎయిర్ కండిషన్డ్ రూం... నాకు చాలా మర్యాద చేశారు. కథలోని వీక్ పాయింట్స్ చెప్పేను. దాన్లోని ఏంటి– సెంటిమెంటాలిటీని వివ రించేను. అయినా వాళ్ళు వెనుకంజ వెయ్యలేదు. వాళ్ళ కంపెనీ బేనర్ పేరే 'న్యూవేవ్'... అ కథ పిక్చరైజ్ చేసి సినిమా లోకంలో సంచలనం సృష్టిస్తా మన్నారు.

"అన్నట్లు మీరు హీరోయిన్‌ని చూడలేదు గదూ, ఒరే ఎవడ్రా,శివరంజ నిని ఇలా రమ్మను...సార్ మీరు గనక ఆమెని చూస్తే ఆశ్చర్యపోతారు... మన కథానాయిక వేషానికే ఆమె పుట్టిందేమో అన్పిస్తుంది!" అన్నాడు నిర్మాత.

హీరోయిన్ గదిలోకి వచ్చింది.

నిర్మాత అన్నట్టు ఆమెను చూడగానే నేను ఆశ్చర్యపోయాను. 'ఆశ్చర్య పోయాను' అన్నమాట సరి కాదేమో, నిర్ఘాంతపోయాను. చేష్టలుడిగిన కట్టెను అయ్యాను.

ఆమె మరెవరో కాదు.

రజని !

నవ్వుతూ నన్ను చూస్తూ, చేతులు జోడించి నమస్కరించింది. తర్వాత వెళ్ళిపోయింది.

అవీఇవీ మాట్లాడి కాసేపయ్యాక నేను నిర్మాత దగ్గర సెలవు తీసుకొని గదిబైట పడ్డాను. నాలుగడుగులు వేసే సరికి "ఏమండీ ఇలా చూడండి" అన్న గొంతు విని ఆగేను. గుమ్మం దగ్గర రజని!

వెళ్ళేను.

"మీరు రచయితలని నాకు తెలుసు. కాని 'నా కథ'లో రాసినంతగా నేను దిగ జారిపోయానని మీరనుకుంటున్నారా?"

"కథేమిటి?"

"వీళ్లు తీయబోయే సినిమా కథ... అది మీరేగా రాసింది? నేనేగా మీ దృష్టి లో ఉన్నాను. పేర్లు మారినా, అది నా కథే. నాకు తెలుసు."

"పొరబాటు పడ్తున్నావు. నీకథ నేను

రాయలేదు. రాసినప్పుడు నిన్ను దృష్టిలో పెట్టుకోనూ లేదు. అయినా, నీ గురించి నాకేం తెలుసని, నీ కథ రాయగలను ?"

"మీరనేది నిజం కాదు" అంది రజని.

"అని నువ్వంటే సరిపోదు !" అన్నాను.

"రాజు తాగుబోతు, హీనుడు కనక అతన్ని నేను వదిలేశానని మీకెవరు చెప్పారు?"

"నాకెవరూ చెప్పలేదు. అది నీ కథ కాదు!"

"మీరు నన్ను గాని, రాజుని గాని సరిగా అర్థం చేసుకోలేదు. మా జీవితం గురించి వివరంగా మీకేం తెలీదు. అయినా, మా పాత్రల్ని చాలా అన్యాయంగా చిత్రీకరించారు. ఆ కథ—ఇప్పుడు సినిమాగా కూడా తీస్తున్నారు... కాని, రాజు మీకేం అన్యాయం చేశాడని అతన్నిలా అవమానించారు?..."

నేను మాట్లాడలేదు.

"రాజు అలాంటివాడు కాదు. అంతటి దౌర్భాగ్యుడూ కాదు. మీరూహించినట్టు భార్య పరపురుషుల కౌగిళ్ళలో నలిగితే—చూస్తూ ఊరుకొనే చేతకానివాడు కాదు. మనిషి బాహ్య స్వరూపాన్ని బట్టి అంచనా వెయ్యడం చాలా పొరపాటు! భర్త వ్యసనాలకీ, తాగుడికీ, వ్యభిచరించే స్త్రీగా నన్ను చిత్రీకరించారు ..., నేను అంత చౌకబారు స్త్రీగా కనిపించానా? మీ దృష్టిలో... సరేలెండి ! ఆ విషయం చెప్పడానికే మిమ్మల్ని పిలిచాను. వెళ్ళి రండి ! !" అంటూ చేతులుజోడించింది.

విసురుగా గది బైటికి నడిచాను.

ఇంటికి చేరుకున్నానే గానీ ఎలా చేరుకున్నానో... నాకే తెలీదు—

ఎంత ఆలోచించినా వాళ్ళిద్దరి జీవితాలు, వాళ్ల అనుబంధాలు నాకు అర్థం కాలేదు. అంతుపట్ట లేదు.

మరో నెల రోజులకి ... నిర్మాతలు నా సినిమా కథను మూల పడేశారని తెలిసింది. వాళ్ళిచ్చిన వెయ్యిరూపాయల అడ్వాన్స్ నా దగ్గరుంది.

కొచ్చిన్‌లో ఉన్న ఓ ఫ్రెండ్‌కి నేనొస్తున్నట్టు రాశాను. కేరళ బయల్దేరాను. ఊళ్లు తిరిగి మనసుకి తగిలిన దెబ్బలను నయం చేయాలని ప్రయత్నం...

వీలైతే అక్కడే ఉండిపోవాలని నా ఉద్దేశం !



## 15

నా ఉద్దేశం ఒకటైతే జరిగింది మరొకటి.

ఏడాదిపాటు ఎన్నెన్నో ఊళ్లు తిరిగి, మళ్ళీ హైదరాబాద్ చేరుకున్నాను.

చేరుకోగానే పిడుగులాంటి వార్త.

రజనికి ఆ జన్మాంత ఖైదు విధించారు!

అసలు రాకుండా ఉంటేనే బాగుండేదనిపించింది.

వెళ్ళి జైలు అధికారుల్ని కలుసు

కొన్నాను. మాట్లాడేను.

సేఠ్ రామ్‌లాల్‌ని చంపిన నేరానికి రజనికి ఆ శిక్ష. కత్తితో 22 సార్లు అతన్ని పొడిచి చంపిందట.

రజనిని కలుసుకొన్నాను.

రజని మొహంలో ఎప్పటిలాగే నవ్వు.

నమస్కరించింది.

తన కథ చెప్పింది.

రజని భర్త రాజు కాదు. రామారావు! రాజు రామారావు తమ్ముడు. అంటే రజని మరది. నాగరత్నం రామారావు, రాజుల చెల్లెలు. నాగరత్నం రజని ఆడబిడ్డ. నాగరత్నాన్ని హింసిస్తున్నావని అన్న రామారావు ఆమె భర్తతో పోట్లాడేడు. పోట్లాట తీవ్రం కాగా, కోపంతో రామారావు అతన్ని కొట్టాడు. అనుకోకుండా నాగరత్నం భర్త ప్రాణాలు విడిచాడు. రామారావు హంతకుడు, ఆజన్మాంత కారాగారవాసం అనుభవిస్తున్నాడు—భర్త జైలుపాలయ్యేడు, ఆడబిడ్డ దేశాలపాలైంది. ఇల్లు లోకుల పాలైంది. అప్పులవాళ్ళు గెద్దల్లా చుట్టుముట్టేరు. డబ్బు కాకపోతే, స్త్రీ శీలాన్నయినా దోచుకుందామని వచ్చారు—ఏం చేస్తారు. మరిదితో కలిసి, ఊరు వదిలి పోయారు—ఎక్కడికి వెళ్ళినా ప్రశ్నలు ఎదురౌతాయి. ఒదినా, మరిదీ కలిసి ఉంటే లోకం నమ్మదు. అన్నీ వివరంగా చెప్పాలి. అందుకే భార్యాభర్తల్లా నటించారు. ఉద్యోగాలకోసం కాళ్ళరిగేట్టు తిరిగారు. నల్లమందు రేకెట్‌లో పనిచేశారు. పోలీసుల భయంతో మానేశారు—ఇంటి ఓనరు ముసిలి కళ్ళు తన మీద పడటం గమనించి, హైదరాబాద్ వచ్చింది. రామ్‌లాల్ పిల్లలకు ఆయాగా కుదిరింది. సినిమాల్లో చిన్న వేషాలకోసం ప్రయత్నించింది. అన్నిచోట్లా సాయాలకు తగ్గ మూల్యం శీలం రూపంలో కావాలన్నారు. ఒకనాడు రామ్‌లాల్ తనను చెరచబోగా అప్పుడే వచ్చాడు రాజు. ఇద్దరూ ఘర్షణ పడ్డారు. తను కోపోద్రేకంలో రామ్‌లాల్‌ని పొడిచి చంపింది—

మర్నాడు—

నా కళ్ళముందే రజని జైలు పాలయ్యింది. ఇది జరిగిన కొన్నాళ్ళకే రాజు ఆత్మహత్య చేసుకొన్నాడు. అతడు రాసిన ఉత్తరం ప్రకారం—తనే రామ్‌లాల్‌ని చంపాడు—తనని కాపాడాలని రజని ఆ నేరం తన నెత్తిన వేసుకొని శిక్ష అనుభవిస్తోంది.

ఇవన్నీ జరిగిన కొన్నాళ్ళకి, ఒంటరిగా కూర్చొని జరిగిన సంఘటనలన్నిట్నీ గుర్తుకి తెచ్చుకొని ఈ ఘోరానికి మూలం ఎక్కడుందో అని ఆలోచించాను.

సమాధానం దొరికింది.

ఈ ఘోరాలకు మూలం నాగరత్నం భర్త మధుసూదన్. అతనే వీటన్నింటికీ మూలం. అతని అశక్తత—అతని అసమర్థత—అన్నింటికీ కారణం.

ఆరేడేళ్ళ కిందటి, నాగరత్నం మాటల్ని జ్ఞప్తికి తెచ్చుకొన్నాను.

'గోపీ, పోదాం రావూ?'

'ఎక్కడికి?'

'ఎక్కడికైనా సరే. నా దగ్గర అయిదువేల రూపాయలున్నాయి పది తులాల బంగారం ఉంది. ఎలాగో ఒకలా జీవించగలం!'

'నన్ను కాస్త ఆలోచించుకోనియ్యి'

'ఇంకా ఏమిటి ఆలోచిస్తావు? సమయం మించిపోయింది. ఆయనకి మన సంగతి తెలిసిపోయింది. నన్ను హింసిస్తున్నాడు—ఆ బాధ పడలేను'.

'—'

'ఏమిటా మౌనం. ఇన్నాళ్లూ నా శరీరంతో ఆటాడుకొని, ఇప్పుడిలా ఆలోచన ఏమిటి? నాకు పెళ్ళయినా, రెండేళ్ళ తర్వాత నీతో స్నేహం అయినంతవరకూ కన్యనే! ఏం నమ్మకం లేదా?'

'నన్ను ముందు ఆలోచించుకోనీ!'

'సరే, నువ్వు ఆలోచిస్తూనే ఉండు. నే వెళ్తా. మరి కన్పించను.'

'గోపీ, వెళ్తున్నా. గుడ్‌బై!'

—అంతే వెళ్ళిపోయింది.

ఆనాడే నా హృదయం చచ్చిపోయింది.

ఈ ఘోరాలకి నేనూ, ఎంతవరకూ బాధ్యుణ్ణి?

నా బాధ్యత ప్రసక్తి వచ్చింది కనక, నా గురించీ నాగరత్నం గురించీ చెప్పక తప్పదు. మా ఇద్దరి గురించీ చెప్పాలంటే అయిదారేళ్లు వెనక్కి వెళ్లాలి.

స్థలం విశాఖపట్నం. చెంగలావు పేటలో నివాసం. బ్రహ్మచారి జీవితం. అప్పుడు నా వయస్సు పాతిక ఏళ్లు.

నాగరత్నంతో నాకు ఎప్పుడు ఎలా పరిచయం అయిందో సరిగ్గా చెప్పలేను. టౌన్‌హాల్ దగ్గర బీచ్ ఒడ్డునా? కురుపాం మార్కెట్ దగ్గరా? కనకమహాలక్ష్మి కోవెల సమీపంలోనా? ఏదైనా సినిమా హాల్లోనా? ఏమో! ఆమెతో పరిచయం కాకముందు – ఇద్దరం చాలా సార్లు కాకతాళీయంగా ఎన్నో చోట్ల కలుసుకున్నాము. ఆమె కళ్ళు నన్ను అతుక్కుని పోవడం నేను చాలాసార్లు గమనించాను.

నాగరత్నం అతిలోక సౌందర్యవతి కాదు. దివినుంచి భువికి దిగివచ్చిన దేవతాస్వరూపం అంతకన్నా కాదు. తెల్లగా బొద్దుగా అట్టే పొడవూ కాక, మరీ పొట్టీ కాక సామాన్యంగా ఉంటుంది. కాని ఆమెలో నన్ను ఆకర్షించినవి—ఆమె కళ్ళు, లిప్‌స్టిక్ వేసుకోకున్నా ఎర్రగా మెరుస్తూ కనిపించే ఆమె పెదిమలు. ఆమె వివాహితో, కాదో కూడా నాకు తెలీదు. ఆఫీసుకు వెళ్ళినప్పుడూ, ఇంటికి తిరిగి వస్తున్నప్పుడూ ఆమె కోసం అన్వేషించేవాడిని. అదృష్టవశాత్తూ ఆమె ఎక్కడన్నా తారసపడితే కరువు తీరా చూసేవాడిని...

ఆమె ఇల్లు ఎక్కడో తెలియదు ... పేరెమిటో తెలియదు. కాని ఆమె రూపం నా స్మృతిపథంలో అహరహం మెదుల్తూ ఉండేది. "పెళ్ళి పెళ్ళి పెళ్ళి అని శత పోరు పెడ్తున్నావు. నాకు నచ్చిన—నువ్వు మెచ్చగల కోడలు పిల్ల దొరికిందమ్మా"— అని మా అమ్మకి ఉత్తరం కూడా రాద్దామనుకున్నాను.

ఒకరోజు... ఆనాడు ఆదివారం ... మధ్యాహ్నం భోజనం చేసి, సాయంత్రం నాలుగు గంటలవరకూ నిద్ర పోయాను. నవ్వులు వినిపిస్తే – నిద్రా భంగమై లేచాను. మొహం కడుక్కుంటూ డాబా మీదికి చూశాను.

ఆమె (నాగరత్నం ఆమె పేరని నాకప్పటికింకా తెలియదు.) ఇంటిగల వారమ్మాయితో నవ్వుతూ మాట్లాడుతోంది. నన్నే చూస్తోంది, నాకు చేరువ కావడం కోసం–హైమతో స్నేహం సాధించిందన్నమాట. గర్వంతో నా ఛాతీ బిగిసింది. అదొక కొత్త అనుభవం.

ఆ పాటి దారి ఇస్తే అల్లుకుపోలేని వాడిని కాదు నేను. ఇంటి యజమాని కుమార్తె హైమ బి. ఏ. చదువుతూ ఉండేది. ఇంగ్లీష్ గ్రామర్‌లో ఆమె చాలా పూర్. అప్పుడప్పుడు నేనే చెప్పేవాడిని. అంటే హైమ నా శిష్యురాలన్న మాట!

హైమా వాళ్ళు ఇంట్లో లేనప్పుడు కూడా నాగరత్నం నా కోసం వస్తూ ఉండేది. ఇద్దరం కలిసి ఎన్నోసార్లు మేటినీ సినిమాలకు వెళ్ళాం. ఆమె కుడి కాలు నా ఎడమ కాలిమీద... ఆమె కుడి చెయ్యి నా తొడమీద ... నా ఎడమ చెయ్యి ఆమెభుజం మీద...అలా ఎన్నో పరమ చెత్త తెలుగు సినిమాలు చూశాం. కనీసం నెలకొకసారైనా వేలీ గార్డెన్స్‌కి పిక్నిక్‌గా వెళ్ళేవాళ్ళం... నర సంచారం లేని చోట ... కొండ కొమ్మున ... దిగువ ఉన్న సముద్రాన్ని, దూరంగా, ఉన్న పట్నాన్ని, నింగిలోని నీలి నీలి మేఘాల్ని చూస్తూ – ఎన్నెన్నో కబుర్లతో కాలక్షేపం చేశాం.

అంతవరకూ ఆమె అవివాహిత అనుకునే వాడిని. నా కొక జోడీ దొరికిందని గుండె నిండా ఆనందం నింపుకొనే వాడిని...ఆ ఆనందం ఒక రోజు–కాదు ఒకనాటి తెల్లవారు ఝాము–ఉదయం నాలుగు గంటల ప్రాంతంలో మాయమై పోయింది.

* * *

ఆ రాత్రి ఏదో సినిమాకి వెళ్ళాను. సెకండ్ షో. గదికి వచ్చి మంచం మీద వాలేటప్పటికి రెండు దాటింది. కంటిమీద నిద్ర వచ్చి రెప్పలు మూత పడేసరికి ఏ మూడో దాటి ... ఉంటుంది ... ఒంటి మీద ఏదో బరువుగా పడి నట్టయి లేచి కూర్చున్నాను. భయంతో ఒళ్ళు జలదరించింది కూడాననుకుంటాను. అంతలో టార్చ్‌లైట్ వెలుగు నా కళ్ళ మీద పడింది.

"ఎవరు" అన్నాను.

"నేను నాగరత్నాన్ని..." అంటూ స్పష్టాస్పష్టంగా వినవచ్చింది సమాధానం.

నిద్ర మత్తంతా ఒక్కసారి ఎగిరి పోయింది. చటుక్కునలేచి లైటువేశాను. గది తలుపు తీశాను. చప్పుడు చేయకుండా నాగరత్నం లోపలికి వచ్చింది. గది తలుపు వేసి నాగరత్నాన్ని పరీక్షగా చూశాను. తెలుపు జాకెట్టు, అదే రంగు చీర. చీర నలిగి ఉంది. జుత్తు అంతా చెదిరి ఉంది. కళ్ళలో ఎర్రజీరలు. ఇంత రాత్రప్పుడు– ఇంత చీకట్లో ఎందుకు వచ్చింది? కొంపలు మునిగే ప్రమాదం ఏదీ జరగలేదు కదా! ఇంతకూ— ఇంత

వేకువ ఝామున, చీకటి ముసుగులో, దొంగలా రహస్యంగా రావలసినంత అవసరం ఏమొచ్చింది? ఆమెను చూసిన ఆ కొద్ది క్షణాల్లోనూ నన్ను రకరకాల ప్రశ్నలు చుట్టుముట్టేయి.

"గోపీ, ఏమిటా చూపు? ముందు లైటార్పెయ్!" అంది నాగరత్నం.

లైటార్పేసేను. జీరోవాట్ బల్బ్ వెలుగులో గదిలో పల్చని కాంతి. అట్టే చప్పుడు కాకుండా కిటికీ తలుపులు వేసేశాను. చేతిలోని టార్చ్‌లైటును టేబిల్ మీద పెట్టింది నాగరత్నం. ఇంకా నిలబడే ఉంది. ఆమెను సమీపించి చుట్టూ చేతులు వేశాను. గట్టిగా హత్తుకున్నాను. కౌగిలిలో గువ్వపిట్టలా ఒదిగిపోయింది. కొద్ది క్షణాలపాటు గది మధ్య అలాగే నిలబడిపోయాం.

నా మస్తిష్కంలో ఎన్నెన్నో సందేహాలు.

డాల్ఫిన్స్ నోస్ కొండమీదా, సినిమా హాళ్లలోనూ, ఇల్లు గలవారి కుటుంబం ఏ సినిమాకో షికారుకో వెళ్ళినప్పుడు... మా డాబా మీదా మేం గడిపిన మధుర క్షణాలు గుర్తుకు వచ్చాయి. బోలెడంత ఏకాంతం అన్నమాటే గానీ అకస్మాత్తుగా ఎవరైనా వచ్చి చూస్తారేమోననే బెదురు ఉండేది. ముద్దులు, కౌగిలింతలూ... అంతే! అంతకు మించి మా వ్యవహారం ముందుకు సాగలేదు కొండ కొమ్ముల— అనాచ్ఛాదితమైన ఆమె రొమ్ముల మెత్తదనాన్ని, స్పర్శాసుఖాన్ని అనుభవిస్తూ, ఆ మృదుత్వం మీద తల బాదుకుని ఉన్మాదినవాలని అనిపించేదే కానీ. ఆమెను అక్కడికక్కడే అనుభవించాలన్న ఆలోచన, ఆ కాంక్ష మనసులోకి వచ్చేదికాదు. దానికి కారణం ఉంది. శాస్త్రోక్తంగా నాగరత్నాన్ని నా దాన్ని చేసుకోవాలనీ, ఆమెతో పొందును శోభనంనాటి రాత్రేపొందాలనీనేనుఏనాడో నిర్ణయించుకున్నాను. అప్పటికింకా స్త్రీ సౌఖ్యం అంటే ఏమిటో తెలీని కూచిని కాన్నేను. అందుకే నేనందుకు తొందరపడలేదు...

కానీ, ఇంత తెల్లవారుఝామున నాగరత్నం రాక— నాకేం అంతు పట్టలేదు. అందుకే రకరకాల సందేహాలు నన్ను చుట్టుముట్టాయి.

"ఏమిటంత హఠాత్తుగా ఊడిపడ్డావ్?" అన్నాను ఆమె చెంపలను అరిచేత్తో రాస్తూ.

నా ప్రశ్నకు సమాధానమా అన్నట్టు— నా మొహం మీద ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాల వేడి. కౌగిలింతలో మరింత బిగి.

"ఏమిటి సంగతి, మాట్లాడవేం?" అన్నాను ఆమెను వదిలేసి మంచం మీద కూర్చుంటూ.

"అల్లరి పిల్లాడా, నీ ఆకతాయి ప్రశ్నలన్నింటికీ తరవాత సమాధానం చెప్తాను..." అంటూ నా పక్కనే మంచం మీద కూర్చుంది నాగరత్నం.

నా ఆలోచనలు పరిపరివిధాల పోతున్నాయి. నాగరత్నం వ్యక్తిత్వాన్ని నేను ఏనాడు శంకించలేదు. ఆమె నా పట్ల కనపర్చిన ఆసక్తికి నేనే నాడూ పెడర్థాలు వెదకలేదు. కానీ, ఈనాటి ఆమె ప్రవర్తన...

"ఇంకా ఆలోచనలేనా ?" గోముగ అంది. తను వెల్లకిలా... పడుక్కుని నన్ను మీదికి లాక్కుంది. కాళ్ళతో, చేతుల్తో, నన్ను కాంక్షగా చుట్టేస్తోంది.

నన్ను వేధించే ఆలోచనల్లకీ, సందేహాలకీ ఫుల్‌స్టాప్ పెట్టేశాను. ఆమె మెడ చుట్టూ చేతులు వేసి భుజాల మీద పెదవులుఆన్చేను. కోరికల వేడితో నాశరీరం కాలుతోంది...

కొంత సేపటికి ఇద్దరి శరీరాలూ చల్లబడ్డాయి. ఇద్దరం ఒకరి సరసన ఒకరం పడుకుని ఉన్నాము. నా మనసు నిండా సంతృప్తి. కోరివచ్చిన స్త్రీ సౌఖ్యం ఇదే ప్రప్రథమం...కాని హృదయంలో ఎక్కడో ఏ మూలో చిన్న పిసరంత అశాంతి... నా నిర్ణయానికి వ్యతిరేకంగా ఇలా జరిగిందేమో అన్న శంక...!

రేడియం డయల్ ఉన్న అలారం టైంపీసువేపు చూశాను. అయిదుగంటలు దాటి అయిదు నిమిషాలు. ఇంకో గంటలో వెలుగురేఖలు విచ్చుకుంటాయి.

పక్కకు తిరిగి ఆమె వక్షోజాలమీద చెయ్యివేసి "ఊఁ.ఇప్పుడు చెప్పు...ఏమిటీ హడావుడి ?" అన్నాను.

"నీకేం మగమహారాజువి ! నీకంతా హడావుడీ, ఆర్భాటంగానే ఉంటాయి" అంటూ నా చేతిని విసురుగా తీసి పారేసింది. ఆమె కంఠంలో నేను ఇదివరకు ఎన్నడూ విని ఎరుగని విషాదం.

నాగరత్నానికి కోపం వచ్చిందని మాత్రం గ్రహించగలిగాను. కానీ, ఆ కోపం ఎందుకో ఊహించలేక పోయాను.

"నిన్ను కష్టపెట్టాలని కాదు నా ఉద్దేశం. ఊరికే తెలుసుకుందామని— ఇష్టమైతేనే చెప్పు" అంటూ ఆమె తీసి పారేసిన చేతిని, నడుంమీద వేశాను.

ఒక్క నిమిషం. అవును ఒకేఒక్క నిమిషమే మౌనంగా ఉండిపోయిందామె. ఆ తరవాత నాకు దగ్గరగా జరిగింది. నన్ను అంటుకుపోయింది.

"చాలా థాంక్స్ గోపీ, ఈ క్షణం కోసమే నేనిన్నాళ్ళూ ఎదురు చూశాను. ఇందుకోసమే నేను అనుక్షణం తపించాను. ఎన్నో అవకాశాలిచ్చేను. కానీ నువ్వు ఉపయోగించుకోలేదు... అంచేత నేనే చొరవ తీసుకోవాల్సి వచ్చింది !" అంది నా చెవుల్లో గుసగుసలాడుతున్నట్టు.

ఆమె మాటలు వింటూ అవాక్కయిపోయాను. నా హృదయరాణి, నా భావి జీవన సహచరి, నా కాబోయే అర్ధాంగి— నా నాగరత్నం ఏమిటిలా మాట్లాడుతోంది ?

నాగరత్నం నడుంమీద నేను వేసిన చేతిని, ఆమె పిరుదుల మీదికి జరిపానే కాని నేనేం మాట్లాడలేదు.

"మా అత్తగారూ, మా మ గా రూ మొద్దునిద్ర పోతారు కానీ మా ఆయనలా కాదు.... అర్థరాత్రి దాటితేనే కాని ఆయనకు నిద్రరాదు. ఆయన నిద్ర పోయేవరకూ చూసి—ఇలా వచ్చేటప్పటికి ఇంతాలస్యమయింది. మళ్ళీ ఆరు కొట్టక ముందే ఇంట్లో ఉండాలి. మా అత్తగారిది అసలే కోడి కునుకు..." అంటూ ఇంకా

ఏమేమో చెప్పుకుపోతోంది నాగరత్నం. కానీ అవేవీ నా బుర్రలోకి ఎక్కడం లేదు.

'ఆయన నిద్రపోయేవరకూ చూసి—ఇలా వచ్చేటప్పటికి—'అన్న నాగిరత్నం మాటలే నా వీనుల్లో పదేపదే ప్రతిధ్వని స్తున్నాయి.

'నాగరత్నం వివాహిత. వాళ్లాయన గాఢ నిద్రలో మునిగిన తరవాత—నామీద మక్కువకొద్దీ ఇంత చీకట్లో వచ్చింది' అన్న చేదునిజం జీర్ణం కావ డానికి చాలా సేపు పట్టింది. అన్యాయంగా నన్నెవరో అధఃపాతాళంలోకి తోసేస్తు న్నట్టనిపించింది. ఆమె పిరుదుల మీది చేతుల్ని చప్పున తీసేశాను.

ఎంత దగా? ఈ నాగరత్నం చుట్టూ నేనెన్ని ఊహలు అల్లుకొన్నాను? ఎన్నెన్ని సుందర దృశ్యాలు పేర్చు కున్నాను? అదంతా వృధా. ఆ శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరు. నా కలల గాలిమేడ ఒక్కసారి కూలిపోయినట్టని పించింది. నా ఆశాసౌధం ఒక్క పెట్టున మట్టిపాలయినట్లయింది.... అంతలో—కోడలుపిల్ల కోసం కలవరించే మా అమ్మ గుర్తుకి వచ్చింది. నాగరత్నాన్ని సిఫార్సు చేద్దామన్న ఒకప్పటి నా ఆలోచన జ్ఞప్తికి వచ్చింది. నాగరత్నం అవివాహిత అనుకున్నాను కానీ—పరాయివాడి పెళ్లాం అన్న సంగతి నాకు ఇప్పుడేగా తెలి సిందీ? 'ఇంకా నయం అమ్మకి ఉత్తరం రాశాను కాను!' అనుకున్నాను.

నేను తీసేసిన చేతుల్ని నాగరత్నం మళ్ళీ తనమీద వేసుకొంది. నా కాలిమీద తన కాలు వేసి, బొటనవేలితో రాయ సాగింది.

ఒక్కుమ్మడిగా నా ఊహలు తల్ల క్రిందులు కావడంతో కొన్ని క్షణాల పాటు నాకేమీ పాలుపోక నిశ్చలంగా ఉండిపోయాను. కానీ...

అప్పుడెప్పుడో చిన్నప్పుడు— కొబ్బరి తోటలో— పొదలమాటున—అనుభవించిన పద్దెనిమిదేళ్ల పడుచుపొందూ, ఇతరేతర బజారు భామల్తో జరిపిన రాసలీలలూ గుర్తుకు వచ్చాయి.

'వాళ్ళందరిలాంటిదేనా—నాగరత్నం?' అన్న ప్రశ్న ఉదయించింది. వాళ్ళ లాంటిది కాకపోవచ్చు. తన తరహా వేరు కావచ్చు. వాళ్ళంతా ప్రతిఫలం కోసం అపమార్గం పడితే, నాగరత్నం.... 'నా'మీద ప్రేమతో, మోహంతో—

ఆ ఆలోచన రాగానే నాలోని కోరి కలు మళ్ళీ బుసలు కొట్టాయి. నా ఆశ నిరాశ అయినందుకు, నా కలలు కల్ల లైనందుకు, ఎవరిమీదో చేతకాని కోపం. ఆ కోపం నాగరత్నంమీద చూపించాను. ఆవేశంగా—జాకెట్టు హుక్స్ కోసం నా చేతులూ...అవి అందిరాకపోగా బలంగా లాగి తెంపేశాను. బ్రా ఊడదీశాను. ఒంటిమీద నూలుపోగులేకుండా వివస్త్రను చేశాను. చలికి వణుకుతూ నన్ను బల్లిలా కావిలించుకుంది. గోళ్ళతో రక్కేను. నోటితో శరీరం నిండా గాట్లు చేసేను. వొదులువొదులుగా ఉన్న జుత్తుని చేతుల్లోకి తీసుకుని బలంగా గుంజాను. మృగంలా, ఆమెను క్రూరంగా హింసించాను.

నాగరత్నం అంత హింసనీ భరించింది. అసమ్మతిగా కానీ, తిరస్కార సూచకంగా కానీ, ఆమె నోటి నుంచి ఒకమాట...పలుకు...ఏదీ వినరాలేదు... పల్చని వెలుగులో ఆమె మొహం చూశాను. కళ్ళు నిమీలితాలయి ఉన్నాయి. మొహం నిండా ఏదో సంతృప్తి. ఉండి ఉండి బరువుగా కనురెప్పలు ఎత్తి చూస్తోంది. అలా కనులు తెరిచినప్పుడల్లా నాలో కళ్లకి ఆరాధనగా చూస్తోంది.

'నాగా, నా నాగరత్నం, నన్నెందుకు మోసం చేశావు? నీచుట్టూ ఆశలు పేర్చుకొనే' అవకాశం నాకెందుకు ఇచ్చావు? రేపోమాపో నిన్ను శాస్త్రోక్తంగా పెళ్లాడి, దాంపత్య జీవితం గడుపుదామనుకుంటూ ఎన్నో కలల్ని కన్నానే, వాటినెందుకిలా చిన్నాభిన్నం చేశావు? నాకు ముందే చెప్పకపోయావా, నీకు పెళ్లయిందనీ—మొగుడంటూ ఓ మొద్దు ఉన్నాడనీనూ!?'— అని అప్పుడే ఆమెను అడుగుదామనిపించింది. కాని చిరుచెమటతో మెరుస్తున్న ఆమె మొహం చూస్తూ పెదిమ కదపలేకపోయాను. నా అశక్తతకు విచారిస్తూ ఆమె కింది పెదిమను కొరికాను. 'అమ్మా' అనలేదు కాని, నాగరత్నం మొహం బాధతో వంపులు తిరిగింది.

లేచి కిటికీ తలుపులు తీశాను.

తెలవార వస్తోంది.

అది చూచిన నాగరత్నం చప్పున మంచం మీంచి లేచింది. చెల్లాచెదరుగా పడివున్న తన చీరనీ, జాకెట్టునీ వెదుక్కుంది. హడావుడిగా తొడుక్కుంది. దువ్వెనతో పైపైనే దువ్వుకుంది. టేబిలు మీది టార్చ్‌లైట్ అందుకుని నా దగ్గరికి వచ్చింది.

తల ఎత్తి నన్ను చూసింది నాగరత్నం.

ఆమె ముఖం నిండా వెలుగు.

అంత మసక వెల్తురులోనూ

వెన్నెలంత వెలుగు చూశాన్నేను.

"వెళ్లనా, గోపీ?" అనడిగింది.

నా కలలు కల్లలుచేసిన ఈ మనిషిని కత్తితో నరికి పోగులు పెట్టాలన్నంత కోపం నాలో... బుసబుసా పొంగుతూంది. కాని, ఆమె దేహం, కాంక్షగా నన్నల్లుకొనే చేతులు, అవి అందిచ్చే శరీరసౌఖ్యం... ఎలా వదులుకోగలను? ఒక్క పైసా ఖర్చులేకుండా, బరువూ బాధ్యతలు అసలే లేకుండా, అంది వచ్చే అమర సౌఖ్యాన్ని వదులుకోవాలనిపించ లేదు..

"మళ్ళీ ఎప్పుడు రాక?" అన్నాను చేతుల్లో ఆమెను చుట్టేస్తూ.

"మళ్ళీ ఎప్పుడో ఇలాగే—" అంది నవ్వుతూ, నా భుజంమీద తన తల ఆనిస్తూ.

అంతలో ఎక్కడో కోడి 'కొక్కురొకో' అంది. నానుంచి దూరంగా జరిగింది నాగరత్నం. నా కళ్ళలోకి సూటిగా ఒకసారి చూసి, తలుపు తీసుకొని చరచరా—వీధిలోని వెలుగు చీకట్లలో కలిసిపోయింది.

* * *

నాగరత్నం నాలో నిరాశ మిగిల్చిపోయిన చాలా రోజులకు—నాకు సుజాత

జ్ఞాపకంవచ్చింది. సుజాత మా మేనమామ కూతురు. మేమిద్దరం ఓ ఇంటివాళ్ళం కావాలని మా పెద్దల ఆశ. దాన్ని చిన్నప్పుడెప్పుడో చూశాను. నల్లగా, జిడ్డోడుతూ ఉండేది. ఇప్పుడెలా ఉందోనని, ఆ మధ్య ఒకసారి చూడ్డానికి వెళ్లాను. ఈ అయిదేళ్లలోనూ మావయ్య ఆస్తి బాగా బలిసింది. అత్తయ్య కూడా బాగా లావయ్యింది. అమ్మవారి విగ్రహంలా మెడనిండా నగల్తో భయంకరంగా ఉంది. బుల్లిబుల్లి కాంట్రాక్టులు చేసే మావయ్య ఈనాడు పెద్ద రైల్వే కాంట్రాక్టర్. వాడి నోరూ, వీడి నోరూ కొట్టి లకారానికి పైగానే సంపాదించాడు. ఇహ సుజాత సంగతే చూడాలి. కంటికి ఏ మాత్రం ఫర్వాలేదనిపించినా, సుజాతని అర్ధాంగిగా తెచ్చుకోవాలని నిర్ణయించుకున్నాన్నేను. కనీసం ఈ ఒక్క విషయంలోనైనా అమ్మా నాన్నల మాట విన్నానని పెద్దలు మెచ్చుకుంటే చాలు..

అయితే సుజాతను చూసింతర్వాత నేను ఆశ్చర్యపోవలసి వచ్చింది. 'బావా బావా' అంటూ జిడ్డులా నా వెంట పడ్తుందేమో, బెట్టు చూపిద్దాం అనుకున్నాను. కాని సుజాత నావేపోసారి చూసి 'హలో బావా' అని మాత్రంఅంది. అనేసి వయ్యారంగా మేడ మెట్లెక్కి వెళ్లిపోయింది. ఆమె కనుమరుగు అయ్యేవరకూ నా చూపులు అటే అతుక్కుపోయాయి.

సుజాత నలుపే. కొంచెం లావుగా కూడా ఉంటుంది. అది లావు కాదు, ఎక్కడ ఉండాల్సిన పుష్టి అక్కడ ఉండడం అని కూడా వాదించవచ్చు. మొహం ఆకర్షణీయంగానే ఉంది. అది డబ్బు మహిమ, లేదా సౌందర్య సాధనాల మహిమ కావొచ్చు. రంగు నలుపైనా మనిషి సెక్సీగా ఉంది. ఆ ఎత్తైత్తు గుండెలు చూస్తే నాకు మతిపోతుంది. ఇన్నాళ్లూ సుజాతకు దూరదూరంగా ఉంటూ వచ్చాను. ఆ కర్రిపిల్లను ఎక్కడ నా మెడకు అంట కట్టేస్తారోనని భయం! ఆ భయం ఇప్పుడు తీరిపోయింది. ఆ మాత్రం సెక్సీగా ఉన్న తరవాత రంగు నలుపైనా, నేను భరించగలను. పెద్దలేమన్నారు? కులమింటి కోతిని చేసుకోమన్నారు. చేతిలో డబ్బు! అధికారం ఉండడం ముఖ్యం. ఎర్రని–తెల్లని అమ్మాయిల చిలిపి సరదాలు ఎప్పుడు కావాలంటే అప్పుడు తీర్చుకోవచ్చు.

సుజాతకు, నాకూ మధ్య ఉన్న దూరాన్ని ఎలాగేనా తగ్గించాలన్న నిర్ణయానికి వచ్చాను. మావయ్య ఇంటికి తరచూ రాకపోకలు సాగించాలని నిర్ణయించుకున్నాను.

ఒకనాటి ఉదయం ఎవరో, పసిపిల్ల వచ్చి నా చేతికి ఒక కవరందించి వెళ్లింది. చింపి చూశాను. నాగరత్నం ఉత్తరం.. కుతూహలంగా చూశాను. ముత్యాల్లాంటి అక్షరాలు. తీరుబాటుగా రాసి ఉంటుంది. చదవడం ప్రారంభించాను.

డియర్ జీ. ఎన్,

నా మనసులోని ఆవేదనసంతా నీకు కథలు కథలుగా నివేదించాలని నేనెన్నో సార్లు అనుకున్నాను. కాని నీ సమక్షంలో

నిలబడగానే, నన్ను నేను మరిచిపోతాను. నీ కళ్లల్లోకి చూస్తూ నీ మాటలు వింటూ నేనేమవుతానో నాకే తెలీదు.

అందుకే ఇలా ఉత్తరం రాస్తున్నాను. నోటితో చెప్పలేని నా భావాలను అక్షర రూపంలో నీకు అందించగలననే ఆశిస్తున్నాను.

అందరూ ఆడపిల్లల్లా చిన్నతనంలో నేనూ కన్నానెన్నో కలలు. స్త్రీ పురుషులు కలిసి అనుభవించే రుచులూ, దృశ్యాలూ సుఖాలూ— నేనూ కావాలనుకొన్నాను. నేను నిదపోతూ ఉంటే గాలికి కదిలే నా జుత్తుని సవరిస్తూ, నా వక్షోజాల మీద చేతులు ఆన్చి తన్మయత్వంతో నన్ను వీక్షించే భర్త, కావాలని ఆశ పడ్డాను. కాని నేను అనుకున్నదొకటి. అయింది మరొకటి. బోలెడంత కట్నం పోసి నాకు పెళ్లి చేశాడు మా నాన్న. పెళ్ళికి ముందు ఆయనను నేను చూశాను. నాకే లోపం కనిపించలేదు. జీవితంలో నేను పోగొట్టుకొన్న దేమిటో ఆ తరవాత కాని నాకు అర్థం కాలేదు. కొన్నాళ్లు...కొన్నేళ్లు భరించాను. ఇలా ఇంకెన్నాళ్లు భరించగలను?

ఓ సారి ఆయనా, నేనూ కలిసి ఏదో సినిమాకు వెళ్లాం. ఇంకా బుకింగ్ తెరవలేదు. ఇద్దరం నిలబడి ఉన్నాం. "ఎందుకలా అతని వేపు చూస్తున్నావ్" అన్నారాయన కంఠం తగ్గించి. ఆయన మాటల్లోని మందలింపు గ్రహించాను. చూపులు మరల్చుకున్నాను. ఆయన అలా ఆ రోజున రిఫర్ చేసింది నిన్నే. నువ్వే ఉన్నావక్కడ.

ఆ రోజు నుంచీ నా ఆలోచనలన్నీ నీ చుట్టూరా పరిభ్రమించేవి. ఏ పని చేస్తున్నా, ఎక్కడ ఉన్నా నా మనసులో నీ రూపాన్నే ధ్యానిస్తూ ఉండేదాన్ని. మళ్ళీ మరొక్కసారి కన్పిస్తే బావుండు నని ఎంతో ఆశ పడేదాన్ని. నా ఆశలు నిరాశలు కాలేదు. నువ్వెన్నో సార్లు కన్పించావు. నువ్వు ఉండే చెక్కడో గ్రహించాను. నీ సామీప్యం కోసం పైమను పరిచయం చేసుకున్నాను. ఇక ఆ తరవాత జరిగిందేమిటో నీకు తెలుసు.

ప్రేమించడం, ప్రేమను పొందడంఒక అచ్యుతానందమని నీ వల్లే గ్రహించాను. నా రెండేళ్ల వైవాహిక జీవితంలోనూ, నేను నిజంగా జీవించింది నీ సామీప్యంలోనే. మిగతాకాలంలో నేనో జీవచ్ఛవాన్ని ఆరోజు రాత్రి నీతో గడిపిన మధుర క్షణాలను జన్మ పర్యంతం మననం చేసుకుంటాను. నన్ను నువ్వు మరచిపోవనీ, నా ఆరాధన నీ హృదయంలో పలుకుతుందనీ కోరుకుంటూ ఈ ఉత్తరం ముగిస్తున్నాను.

ఇంకా రాయాలనే ఉంది. నీతో ఎన్నెన్నో విషయాలు చెప్పుకోవాలి. ఎవరూ చూడకుండా దొంగతనంగా, రహస్యంగా రాయాలి కదా... ఎప్పుడో రాస్తాన్లే.

ఆరోజు వచ్చినట్టు— ప్రభంజనంలా మళ్ళీ ఏదో ఓనాడు వచ్చేస్తాను. తస్మాత్ జాగ్రత్త

నీ

'ఎన్నార్'

—ఆ ఉత్తరం చదివాక దాన్ని చింపి పోగులు పెట్టాను. కిటికీలోంచి బయటికి, కుళ్లు కాలవలోకి విసిరేశాను.

'నాన్సెన్స్! కట్టుకున్న మొగుడు చాలక, నావెంట పడినందుకు—సమర్థింపు ఒకటా? దానికి 'ప్రేమ'అని ముద్దుపేరు పెట్టడం కూడానా?' అనుకుని నవ్వుకున్నాను.ఆఒక్క నిమిషమూ నాగరత్నం అంటే ఎంతో అసహ్యం వేసింది. అంతలోనే మళ్ళీ ఆమెమీద జాలి. అనంత ప్రేమవాహినిని కట్టిపడేసిన ఆ కళ్ళు, ఆ కళ్ళలోని మిలమిలలు. గాలికి జుత్తు రేగుతోంటే ఆమె మొహంలో వెలిగే వింత అందాలు. అరమరికలు లేకుండా తన సర్వస్వం నాకు అంకితం చేయగల తెగింపు వెండి వెన్నెలలో తన మెత్తని రొమ్ముల ఎత్తులకు నా తలని ఆనించి 'విను—నా హృదయం నిండా నీ నామజపమే, అని అన్నప్పుడు ఆమె గొంతులోని మధుర సంగీతం మోహపు బరువుతో ఒక వింత వణుకు. ఇది నటన కాదు, అభినయం కాదు. ఒంటరితనంలో మగ్గుతూ ప్రేమ ప్రవాహంలో కొట్టుకుపోతూన్న అసహాయ వ్యక్తి ఆక్రోశం. వెల్లువలో ఏ పూచికపుల్ల కనబడినా, దాన్ని ఆసరాగా తీసుకొని తీరం చేరుకొందామన్న బలవత్తరమయిన కోరిక.

నాగరత్నం కుటుంబ పరిస్థితి తెలుస్తే—ఆమెను మరికొంత అర్థం చేసుకోగలనేమో...

ఓనాటి సాయంకాలం — ఇంటాయన భార్యాసమేతంగా ఎక్కడికో బైటికి వెళ్ళాడు. ఇంట్లో హైమ ఒక్కర్తే ఉంది. హైమకు తెలుసేమో—అడిగితే? ఏమనుకుంటుందో...చాలా సేపు తటపటాయించి, ముందు వెనకలాడి, చివరికి వాళ్ళింటి గుమ్మం ముందు నిలబడ్డాను. 'హైమా!' అని పిలిచాను. ఇదేమిటిలా పిలిచాను, ఏదో రహస్యం చెప్పబోయే వాడిలా... ఇదివరకూ ఎన్నిసార్లు ఆమెను పిలవలేదు? ఈసారి నా గొంతు ఇలా ఉందేమిటి? పైట నిండుగా కప్పుకొంటూ 'ఏం మాస్టారూ?' అంది. 'ఒకసారి ఇలా వస్తావా?' అన్నాను. నా గొంతు మామూలుగా లేదు. ఏదో అసహజత్వం ఉంది. అలా అడిగాక చరచరా నా వాటాలోకి వచ్చేసేను. కుర్చీలో కూర్చుని సిగరెట్ వెలిగించాను చాలా సేపు అలాగే కూర్చున్నాను.

పది నిమిషాలయింది. పావుగంటయింది. హైమ ఇంకా రావేం? ఎవరూ లేని సమయంలో ఏదైనా అఘాయిత్యం చేస్తానని భయమా? అందుకోసమే పిలిచానని అనుకొందా, కొంపదీసి. మైగాడ్! లేచి నిల్చున్నాను. వాళ్ళింటి వేపు వెళ్ళి కిటికీలోంచి చూశాను, హైమ తీరుబాటుగా ముస్తాబవుతోంది. ఉన్నట్టుండి కట్టుకున్న ఎర్రచీర, జాకెట్టూ తీసేసింది. కొంచెం పక్కకు తప్పుకున్నాను. ఇక అక్కడ ఉండడం సభ్యత కాదనిపించింది. కాని నాలోని, లోలోని 'పీపింగ్ టామ్' గాడు ధ్వజం ఎత్తాడు. వాడి మాటే గెలిచింది... కిటికీలోంచి చూశాను. బీరువాలోంచి ఒక్కొక్క చీరా తీసి, గుండెల మీద పెట్టుకుంటూ

నిలువుటద్దంలోకి చూస్తోంది. ఒంటి మీద కేవలం బ్రా, లంగాతో, మెరుస్తున్న పచ్చని శరీరంతో హైమను చూస్తోంటే నాకు మతిపోయింది. హైమ నాన్నగారికి పెద్దపోస్టాఫీసులో ఏదోఉద్యోగం. వాళ్ళమ్మకి మునిసిపల్ స్కూల్లో టీచరుఉద్యోగం. ఆయన బ్రాహ్మడు.ఆమె...వాళ్ళని బొందిలీలు అని కాబోలు అంటారు. ఇద్దరిదీ కులాంతర వివాహం. వారి ఏకైక సంతానం హైమ. ఎనిమిదేళ్లుగా నేనీ ఇంట్లో అద్దెకి ఉంటున్నాను. హైమను చిన్నప్పటినుంచీ ఎరుగుదున్నేను. గౌన్లు వేసుకొని చెంగుచెంగున డాబా మీద గెంతులు వేసే హైమ స్వరూపం నా మనసులో ఇంకా చెరిగిపోలేదు. ఆ హైమకీ, ఈ హైమకీ ఎంత తేడా? ఎంతలో ఎంత ఎదిగిపోయింది!

చప్పుడు కాకుండా వెనక్కి తిరిగి వచ్చేశాను. కాసిని, మంచి నీళ్లు తాగి కుర్చీలో కూర్చున్నాను. సిగరెట్ వెలిగించి గట్టిగా దమ్ము లాగాను. హైమ చర్యలోని అంతరార్థం ఏమిటో నాకు అర్థం కాలేదు. అంతలో నాకు మరో ఆలోచన వచ్చింది. నా పిలుపుని హైమ అపార్థం చేసుకుని ఉంటుంది. ఏదో అఘాయిత్యం తలపెట్టానని అనుకుని ఉంటుంది. ఒక్కర్తీ ఇంట్లో ఉండటం క్షేమం కాదని, ఏ పక్క వాళ్లింటికో వెళ్లడానికి ఆయత్తమవుతూ ఉందేమో! ఈ ఆలోచన రాగానే 'ఛ ఛ' అనిపించింది. ఎంత పని చేశాను. ఇప్పుడేం చెయ్యడం- ఆమె కన్నా ముందు నేనే బైటికి వెళ్ళిపోతే—!?

అంతలోనే ఏదో సెంటు వాసన. గాలితెరల్లో కదులుతూ - నా గదిలోకి వచ్చింది. హైమ నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ నా గదివేపు వస్తోంది. నా కంగారు కప్పి పుచ్చుకోవడానికి గబగబ సిగరెట్టు దమ్ములు లాగాను. హైమ గదిలోకి వచ్చి తన వెనకనే తలుపు వేసి గొళ్లెం పెట్టింది. నా వేపైనా చూడకుండా, గది మూల ఉన్న పుస్తకాల రేక్ వేపు వెళ్ళింది. పరీక్షగా, పుస్తకాల స్పయిన్ మీద ఉన్న టైటిల్స్‌ని చూస్తోంది. ఆమె అటు తిరిగి ఉంది. మొహం కనిపించడం లేదు. ఇవాళ హైమ ప్రవర్తన వింతగా అన్పించింది నాకు. తెల్లని సిల్కు చీర కట్టింది. అదే రంగు జాకెట్టు. జాకెట్లోంచి లీలగా కన్పిస్తోన్న బ్రా స్ట్రాప్ జాకెట్టుకీ, చీరకూ మధ్య పచ్చగా మెరిసిపోతూ వీపు. నడుం దగ్గర సన్నమై, కిందికి జరిగే కొద్దీ విశాలమై, గుండ్రంగా పిరుదులు. వాటి మీద బారెడు జడ. తల్లో మల్లెపువ్వుల దండ. హైమను 'ఆ దృష్టితో' నేనెప్పుడూ చూడలేదు. చిన్నప్పటినుంచీ నా కళ్ల ముందే పెరిగిన పిల్ల. పైగా నా శిష్యురాలు కూడానూ...... నేను లేచి ఆమె వేపు వెళ్లాను. వెనకనే అడుగుదూరంలో నిలబడ్డాను.

రేక్‌లోంచి 'రాధికా సాంత్వనం' తీసి అట్టమీది బొమ్మని పరీక్షగా చూసింది. కాగితాలు తిప్పి ముద్దు పళని మనోహర వర్ణనల్ని నల్లని బంద అక్షరాల్లో - పలికిస్తోంది.

"ఏమిటి చూస్తున్నావు ?" అన్నాను.

పుస్తకం రేక్‌లో పెట్టేసి నా వేపు తిరిగింది. హఠాత్తుగా నా మెడ చుట్టూ తన చేతులు వేసి బిగించింది. దగ్గరగా జరిగి తల ఎత్తి నా కళ్లలోకి చూసింది. కళ్ల నిండా కోరిక. పెదిమలు చిన్నగా వణుకుతున్నాయి. ఆమె జడలోని మల్లెల వాసన. చీర చెరుగులోంచి సెంటు వాసన. బిగించి కట్టిన జాకెట్లోంచి దూసుకు వస్తున్న నవయవ్వన వతి ఒంటి పరిమళం. నన్నొక్కసారి ఉక్కిరి బిక్కిరి చేశాయి. ఎదురు చూడని ఈ పరిణామానికి విస్తుపోయాను. నా మెడని చుట్టిన హైమ మెత్తని చేతుల్ని తీసేస్తూ "ఏమిటీ పని?" అన్నాను. నా మాటల్లో కోపం లేదు. మందలింపూ లేదు. బుజ్జగిస్తోన్నట్టు అన్నాను

తటాలున దూరంగా జరిగి మొహం చాటు చేసింది. తల వంచుకుని కాలి బొటనవేలుతో నేల మీద రాస్తూ "అందుకే పిలిచారనుకున్నాను" అంది మెల్లిగా. ఆ మాటల్లో జాణతనం లేదు. అమాయకత్వం ఉంది. చిరుకోపమూ ఉంది. కాలి బొటనవేలుతో నేలను రాస్తూ ఇంకా అలాగే నిలబడివున్న హైమను చూసి నాకు జాలి వేసింది.

నాకు తెలిసినంతమట్టుకు హైమను నేనెన్నడూ ఎంకరేజ్ చెయ్యలేదు. ఆమెను నేనా దృష్టితో చూడనూ లేదు. మరి......

ఆమె వెనగ్గా వెళ్లి రెండు భుజాల మీదా చేతులు వేశాను. తల వంచి "కోపం వచ్చిందా?" అన్నాను ఆమె చెవిలో. హైమ బుంగమూతి నా మాటతో హాస చంద్రిక అయింది. కీ యిస్తే తిరిగే బొమ్మలా గిర్రున నా వేపు తిరిగింది. చుట్టూ చేతులు వేసి నన్ను బంధించింది. ఆమె తల నిమురుతూ బుగ్గ మీద తేలిగ్గా నా పెదిమలు ఆనించాను.

"ఇప్పటికి ఇది చాలు ఏం?" అంటూ ఆమెను నడిపించి మంచం మీద కూర్చోపెట్టేను. నేనూ పక్కనే కూర్చొని ఆమె భుజం మీద చెయ్యి వేశాను.

"అమ్మా నాన్నా ఏరీ?" అన్నాను.

"సినిమాకి వెళ్లారు. అట్నించటే మహారాణిపేట పెళ్లికి వెళ్తారు. ఇవాళ రాత్రి అక్కడే వుండిపోయి రేపు పొద్దున్నే వస్తారు" అంది ఆశగా నా కళ్లలోకి చూస్తూ.

'చచ్చాన్రా భగవాన్' అనుకున్నాను. ఈ వెర్రిపిల్ల నా మీద ఎన్ని ఆశలు పెట్టుకుందో? పెళ్ళి చూపులకు ఎవరెవరో రావడం, పోవడం నేను గమనిస్తూనే ఉన్నాను. ఒక్క సంబంధం కూడా కుదర లేదు. హైమ అనాకారి ఏమీ కాదు. పేరుకు తగ్గట్టు కుందనపు బొమ్మ, అమ్మాయిలో లోపం ఏమీ లేదు. వాళ్లకు నచ్చనిదల్లా ఆమె తలిదండ్రుల కులాంతర వివాహం. ఆ సంగతి హైమకీ తెలుసు. ఆమె తలిదండ్రులకూ తెలుసు. అవి సరేకాని ఇప్పుడు నేనేం చెయ్యాలి? హైమకు అందం ఉంది. ఆస్తి ఉంది. అదంతా నాదే అవుతుంది. పోనీ హైమను నేను పెళ్ళి చేసుకుంటే...? ఉన్నత ఆశయాలకి, ఆదర్శాల ఔన్నత్యానికీ,

మానవత్వానికీ జోహార్లు చేసే నేను- వాటిని ఆచరణలో పెడితే...? ఆదర్శాలు గుప్పిస్తూ బోడి కథలూ కాకరకాయిలా దేశం మీద వదలడానికి బదులు నేను ఆ ఆదర్శప్పని చేస్తే......?- బాగానే ఉంటుంది.

కాని అమ్మతోనే చిక్కు- అప్పటికీ అమ్మ ఆమధ్య వచ్చినప్పుడు నాతో చెప్పనే చెప్పింది. 'వాళ్లకి నీ మీద కన్నుంది జాగ్రత్త, వాళ్ల వలలో పడకు. పడ్డావంటే మేమంతా కట్ట కట్టుకుని ఏ నుయ్యో గొయ్యో చూసుకోవాల్సిందే, ఎందుకేనా మంచిది. పిల్లైనంత త్వరగా ఈ ఇల్లు ఖాళీ చేసెయ్' అంది అమ్మ. 'పోదూ నీదంతా చాదస్తం. నువ్వు అన వసరంగా అన్నీ ఊహిస్తావు. ఆ పిల్ల నా దగ్గర చదువుకుంటుంది. అంతే' అనంటూ అమ్మ మాటల్ని కొట్టి పారే శాను. అమ్మ భయానికి కారణం లేక పోలేదు. నాకు అయిదుగురు చెల్లెళ్లు. అందరికన్నా నేనే పెద్దవాణ్ణి, నేను ఒక్కణ్ణే మొగ సంతానం. ఇద్దరు చెల్లె ళ్లకి పెళ్ళిళ్ళు అయిపోయాయి. ఒకడు బీహారులో, మరొకరు అస్సాంలో-పిల్లా పీచుతో హాయిగా ఉంటున్నారు. పెళ్ళిళ్ళు కావలసినవాళ్ళు ఇంకా ముగ్గురున్నారు. ముగ్గురిలో ఇద్దరు చదువులు అటక ఎక్కించేసి పెళ్ళిళ్ళకి సిద్ధంగా ఉన్నారు. ఆఖరిది- పధ్నాలుగేళ్లది- ఇంకా చదువు కుంటోంది. ఆదర్శ వివాహం అని నేను జపంచేస్తూ, పవిత్ర పుష్పంలాంటికులాన్ని గంగపాలు చేస్తే, మరిహ వాళ్ళకి పెళ్ళిళ్ల కావడం ఎలా! అదే అమ్మ భయం.

నా భుజం మీద తల వాల్చి "ఏమిటి మాస్టారూ, ఆలోచిస్తున్నారు" అంది.

నవ్వి "నీ గురించే" అని అన్నాను.

హైమ అంటే నాకు ఇష్టం ఉన్నా, ఆమెను నాదాన్ని చేసుకొనే అవకాశం ఎలాగూ లేదు. ఆ విషయం చెప్తే బాధ పడ్తుందేమో... ఇప్పటికే ఎంతో బాధని గుండెలో దాచుకుని ఉంటుంది. నేనీ విష యం నిర్మొహమాటంగా చెప్తే, ఆమెకు పుండు మీద కారం చల్లినట్టవుతుంది. మంచి సమస్యే వచ్చింది నాకు. 'మంచీ- చెడూ' అన్న ఆలోచనల్లో నేను బందీనై పోతున్నాను. నరాల బాధతీర్చుకోడానికి, జేబులో డబ్బు తీసుకుని, లాడ్జింగ్‌లో నా కంటికి నచ్చిన ఒంటిని ఎన్నుకొని, వందలాది కౌగిళ్ళలో మెలిదిరుగుతూ నలిగిన ఆ దేహాన్ని మలినం చెయ్యడా నికి నాకెట్టి అభ్యంతరమూ ఉండదు. కానీ, హైమ..! నేనెంతో ఉన్నతుణ్ణి అనుకొని, నా చుట్టూ ఆశలు అల్లుకొని, నన్ను ఆరాధిస్తున్నట్టుంది. ఈ అమా యకురాలిని, ఈ సుందర పుష్పాన్ని, మోసగించాలని కానీ, వాసన చూసి విసి రెయ్యాలని కానీ నాకు అన్పించడం లేదు. ఆమె పవిత్రతను హరించే ఆత్మస్థయిర్యం నాలో లేదు. అయాచితంగా నా ఒళ్ళో జారి పడ్డ దోరజామపండులాంటి ఈ కుసుమ కోమలిని, తాత్కాలికావేశంలో ఈరోజు అనుభవించ గలిగినా నా శేష జీవితం మాత్రం నరక ప్రాయమై పోతుంది. రేకులు విప్పి, ఆశగా నీలాం బరం అంచుల్ని వీక్షిస్తూ, పరవశించి

పోయే ఈ అమాయక కుసుమ కోమల కంఠం ఉత్తరించిన పాపం, నా జన్మంతా నన్ను నీడలా వెంటాడుతుంది. లోకం కళ్ళు కప్పి మాయ చెయ్యగలనేమో కానీ, నా అంతరాత్మకి సమాధానం చెప్పుకోలేను.

"ఏమిటి మాస్టారూ, మళ్ళీ ఆలోచనల్లో మునిగిపోయారు?" అంది హైమ చిరుకోపం ప్రదర్శిస్తూ.

తెప్పరిల్లాను. మొహం మీదికి నవ్వు తెచ్చుకున్నాను. "ఏంలేదు" అన్నాను.

"అబద్ధాలాడుతున్నారు మాస్టారూ, మీకు ఆడపిల్లలు పుడతారు .... నా గురించే ఆలోచిస్తున్నానని ఇంతకు ముందేగా మీరన్నదీ... అప్పుడే మరిచి పోయారా ?

"అవునవును. నీ గురించే ఆలోచిస్తున్నాను."

"ఏమని ఆలోచిస్తున్నారు. ?"

"నీలాంటి పుత్తడిబొమ్మని భార్యగా పొందగలవాడు చాలాఅదృష్టవంతుడు."

"మరి నా సంగతి చెప్పరేం ? నాకు అదృష్టం అక్కరలేదా ?"

నేనేం మాట్లాడలేదు. ఆశగా నన్నే సూటిగా చూస్తున్న ఆమె కళ్ళలోకి చూశాను.

"పోనీలెండి. మీరేం చెప్పొద్దు." అంటూ లేచి నిలబడింది. నా ఎదురుగా నిలబడి మెడ చుట్టూ చేతులు వేసి నా తలను తన వక్షానికి అదుముకుంది. చేతి వేళ్లతో నా జుత్తుని చిందర వందర చేసింది. ఆమె కాళ్లు నా కాళ్లకి తగులుతున్నాయి. నా తలకి ఆమె మెత్తని వక్ష స్పర్శ. నా ఎదురుగా ఆవేశంతో నిలువెల్లా కంపిస్తూన్న ఆమె దేహం. కాని నాలో చలనం కలగలేదు. నాకన్న ముందు ఈ సంగతిని హైమే గ్రహించింది.

"నేనంటే మీకు ఇష్టం లేదా?" అంది హఠాత్తుగా

"ఎందుకు లేదూ! కాని నా పెళ్ళి ఎప్పుడో నిశ్చయమైపోయింది. ఆసంగతి చెప్పకుండా మోసగించడమే నాకు ఇష్టం లేదు" అని ఎట్టకేలకు అసలు సంగతి బయట పెట్టాను. చాలా సేపటికి తల ఎత్తి ఆమె మొహంలోకి చూశాను.

నేనూహించిన విషాదఛాయలూ, నీలి నీడలూ ఏవీ లేవామె మొహంలో. ఎప్పట్లాగే నవ్వుతూ చూస్తోంది " నాకు తెలుసు మీ అమ్మగారు చెప్పారు. ఆ అమ్మాయి పేరు సుజాత కదండీ ? ఈ ఊళ్ళోనే ఉంటున్నారట కదా, ఇక్కడికెప్పుడూ రాలేదేమండీ!" అనడిగింది.

"శ్రీమంతులమని గర్వం" అంతకు మించిన జవాబు నాకు తట్టలేదు.

"మీ అమ్మగారు ఆ అమ్మాయి ఫొటోని నాకు చూపించార్లెండి. నల్లగా లావుగా ఉంటారట ఆవిడ. మీరింత అందంగా ఠీవిగా ఉంటారు కదా, ఆమెనెలా పెళ్ళి చేసుకుంటారండీ? మరదలు పిల్ల అని అభిమానమా! "అంది.

జవాబుగా నవ్వేను.

"సరే మీ పెళ్ళి నిశ్చయమయిపోయింది. రేపో మాపో ఆవిణ్ణి పెళ్ళాడేస్తారు. అదలా ఉంచేయండి. నేనేం ఆవిడకు పోటీ రాను ఈ ఒక్కరోజు

మాత్రం మీ ఎదురుగా ఉండే భాగ్యం ప్రసాదించండి. నా గొడవ, నా మనసు లోని బాధ అంతా మీముందు వెళ్లగక్క నివ్వండి. ఈ ఒక్క రాత్రే. మీరంటే నాకు ఎంతో గౌరవం. మీతో చెప్తే నా నా గుండె తేలిక పడుతుంది. ఆ తరవాత ఏమైనా ఫర్వాలేదు. మీకేమేనా అభ్యంత రమా? నేనేం అంటరానిదాన్ని కాను. నన్ను ముట్టుకుంటే మీరేం మైల పడి పోరు లెండి" అంది.

చప్పున మంచం మీంచి లేచాను. ఆమెను బలంగా పొదివిపట్టుకున్నాను. నా ఛాతీమీద మొహంపెట్టి వెక్కి వెక్కి ఏడ్వ సాగింది హైమ. ఓదార్పుగా ఆమె తల నిమిరాను. కాసేపటికి ఆమె దుఃఖో ద్వేగం తగ్గింది. రుమాలుతో మొహం తుడిచాను. రెండు చేతుల్తో, ఆమెను ఎత్తి మంచం మీద పడుకోబెట్టాను. ఆమె పక్కనే నేనూ మంచం మీద నడుం చేర వేశాను.

నా కళ్లలోకి చూస్తూ అమె...

ఆమె కళ్లలోకి చూస్తూ నేను ...

అలా ఎంత సేపో ఉండిపోయాము.

నా బుగ్గల మీద తన వేళ్లతో రాస్తూ "నన్నిలాగే చూడనియ్యండి. ఇంతకు మించిన సౌఖ్యం అనుభవించే అర్హత నాకు లేదు" అంది దీనంగా. నా కాళ్లతో ఆమెను చుట్టి, అమె మీదికి ఒరగ బోయాన్నేను. కాని నా ప్రయత్నం సాగనివ్వలేదు హైమ. ఆమె అంతర్యం నాకు బోధ పడలేదు. నేను తనను పెళ్ళి చేసుకోనని తెలిసి కూడా నా దగ్గ రికి వచ్చింది. నిజం చెప్పకుండా తనను మలినం చేసే ఉద్దేశం నాకు లేదని కూడా తెలుసు నామెకు.

అదే నా ప్రధాన అభ్యంతరమని తెలియ జేశాను కూడా.

ఇప్పుడు...

నా పక్కని శయనించి, తన శరీర స్పర్శతో నా కాంక్షను రగిలించి, తన కరస్పర్శతో నా నరాల్ని పొంగించి, పక్షద్వయంతో నా ఛాతీని అదుముతూ గుండెల్లో మోహజ్వాలలు మండించి, తీరా నేను కామాతురుణ్ణయి ఆమెను ఆక్రమించుకోబోతే వారిస్తుందేం? పక్కకు తిరిగి ఆమె చెంపలను నా పెదిమలు ఆనించాను. వారించలేదు. మెడమీద చెయ్యివేశాను. ఒద్దనలేదు. కిందికి జరిపాను. ఆమె ముఖంలోకి చూశాను ప్రశాంతంగా నవ్వుతోంది... నాలోని కాంక్ష కట్టలు తెంచుకుంది. బలంగా ఆమెను ఆక్రమించుకొన్నాను. గిలగిల కొట్టుకుంది. నా గుండెలమీద చెయ్యివేసి నెట్టబోయింది. ఆమె ప్రతిఘ టిస్తున్న కొద్దీ నా కళ్ళు మూసుకు పోతున్నాయి. మోహజ్వాలల్తో ఒళ్ళంతా దహించుకుపోతూంది. నన్ను నెట్టడానికి ప్రయత్నిస్తున్న ఆమె రెండు చేతులనూ వెనక్కి విరిచిపట్టుకున్నాను. ప్రతిఘటన మాని బేలగా నన్ను చూసింది.

"ఉండండి చీర తీసేస్తాను" అంది.

చీర ముడిని వెదికాను. ఒక్క లాగు లాగేసరికి ముడివీడింది. బరబరా వొలిచి, చీరని ఓ మూలకి విసిరాను. జాకెట్టు గుండీలు విప్పుతూ అమెను లేవనెత్తాను. లేచి కూర్చుని, బిగుతైన ఒంటికి

అతుక్కున్నట్టున్న రవికను శ్రమపడి విప్పింది.

"మీకు చేతులు జోడించి ప్రార్థిస్తాను. ఒక్కమాట వింటారా?" అంది హైమ నా గెడ్డం పుచ్చుకుంటూ.

ఆమె చేతిని తీసేశాను. వెనక్కివంచి ఆమె రెండు భుజాలమీదా చేతులువేసి అదిమి పట్టేను. నగ్నంగా ఉన్న ఆమె భుజాల్నీ, కెరటాల్లా ఎగిసిపడుతున్న రొమ్ముల్నీ చూస్తూ— "ఏమిటో చెప్పు" అన్నాను. అని ఆమె మీదకి వాలి పోయాను.

"మీరు మగవారు. బలవంతులు. నాకు ఇష్టం లేకున్నా, బలప్రయోగంతో నైనా నన్ను అనుభవించగలరు...." అంటూ ఆగిపోయింది హైమ.

"ఊఁ. చెప్పు హైమా, నన్ను చంపకు" అన్నాను అసహనంగా.

"మీ దృష్టి ఎవరిమీదో ఉంది. మీరెవర్నో అమితంగా ప్రేమిస్తున్నారు. నామీద మీకు ప్రేమలేదు. జాలి, సాను భూతి తప్ప. అవికూడా ఇంతవరకుండు లేవేమో... నామీద ప్రేమ, మోహం లేకుండా, కేవలం జాలితో, నన్ను సుఖ పెట్టాలని మీరు అనుకుంటున్నట్టున్నారు. అది పొరపాటు. నన్ను మీరు అపార్థం చేసుకున్నారు..."

నేను లేచి కూర్చున్నాను. ఆమె భుజాలు పట్టుకుని గట్టిగా కుదుపుతూ "ఏమిటి హైమా, నువ్వనేదేమిటి?" అన్నాను.

"నా శరీరంతో మీరు సుఖపడా లనుకుంటే నాకేమి అభ్యంతరం లేదు. కాని నన్ను సుఖపెట్టడం కోసం మాత్రం ఆపని చేయకండి. మీ వాంఛలు తీర్చుకో డానికి వేరే దార్లు మీకు దొరక్కపోవు. కానీ నాకు మాత్రం మీ ప్రేమా అను రాగం కావాలి. ప్లీజ్, నన్నర్థం చేసు కోండి. ఏమంటారు?" అంటూ నా ఒళ్ళో తల పెట్టుకుని నన్ను చూసింది.

నేను నిశ్చేష్టుడినై పోయాను. కంటి ముందు కమ్మిన పొగమంచు విడినట్టు అయింది. ఇంత చదువుకున్నాను. ఇన్నిన్ని పుస్తకాలు తిరగేశాను. రకరకాల జీవితాలు పరిశీలించాను. ఇన్ని ఏళ్ళొచ్చేయి. కానీ ఆపాటి చిన్న విషయం గ్రహించలేని అజ్ఞానంలో పడిపోయాను. నా తొందరపాటు చూసి నాకే సిగ్గు వేసింది. హైమను తప్పుగా అంచనా వేశాను. అంత చిన్న గుండెలో ఇంత పెద్ద ఆలోచనలున్నాయని నాకు తట్టనే లేదు. నేనెరగని జీవిత సత్యం నా గుండెలో నాటి నాకు మహోపకారం చేసింది. "థాంక్స్ హైమా! సారీ హైమా! నన్ను క్షమించు" అంటూ నిట్టూర్చాను.

"నేను గౌన్లు వేసుకునే రోజులనుంచీ కూడా మీరు నాకు తెలుసు. నేనూ మీకు తెలుసు. నేను బాగా అల్లరిచేస్తే ఓసారి మీరు నాకు తొడపాశం పెట్టారు. చుర్రు మంది నాకు. అంత గట్టిగా మీరు తొడపాశం పెట్టాలనుకుని ఉండరు. అంతలోనే మీరు మళ్ళీ నా బుగ్గ గిల్లేరు మెల్లిగా. 'ఇంకోసారి ఇలాంటి పని చేశావో జాగ్రత్త!' అంటూ ఉత్తుత్తి కోపంతో చెయ్యెత్తారు. అదంతా నాకు

బాగా జ్ఞాపకం ఉంది. నిన్ననో, మొన్ననో జరిగినట్టుంటుంది. బాత్‌రూమ్ లోకి వెళ్ళి గౌనెత్తి చూస్తే, పాశం పెట్టినంత మేరా ఎర్రగా కందిపోయి ఉంది. చెప్పలేనంత ఉక్రోషం వచ్చింది. కానీ చిన్నదాన్ని ఏం చెయ్యగలను ? మిమ్మల్ని చూసినప్పుడల్లా నాకా సంఘటన గుర్తువస్తుంది అప్రయత్నంగా బుద్ధిమంతురాలినైపోతాను. మీ మీద ఆ రోజుల్లో నాకుండే ద్వేషం అంతా కాల్రకమేణా ఆకర్షణగా మారింది. అది ఎలాంటిదో చెప్పలేను.... మీతో కబుర్లు వేసుకోవాలనీ, అల్లరి చేయాలనీ కోరిక.. నేను వోణీలు వేసుకోవడం ప్రారంభించాక మీలో గమ్మత్తయిన మార్పు రావడం నేను కనిపెట్టాను" అంటూ ఏదో తలుచుకొని ఫక్కున నవ్వింది.

"అదేమిటోచెప్పి మరీ నవ్వరాదూ?" అన్నాను.

"మీరు ఎదురుపడితే నేను సిగ్గుపడాల్సిందిపోయి, నన్ను చూసి మీరే పక్క పక్కకి తప్పుకు పోయేవారు. పలుకే ముత్యం అయిపోయింది. ఏదేనా కావాల్సివచ్చి ఎదురుపడి అడిగితే, కింది చూపులు చూసి ముక్తసరిగా 'లేదు. ఉంది, అవును, కాదు' అని సమాధానం చెప్పేవారు. తొడపాశం పెట్టి నన్ను ఏడ్పించిన మాస్టారు ఈయనేనా అని ఒకోసారి ఆశ్చర్యపోయేదాన్ని. మీరంటే నాకెంతో గౌరవం. విపరీతమైన అభిమానం. అత్తెసరు మార్కుల్తో ఇలా పరీక్షలు నెగ్గుకొచ్చానంటే మీరే దానికి కారణం. మాస్టారూ, మీకు చాలా రుణపడి ఉన్నాను..."

"ప్లీజ్ హైమా, నన్నలా ఊరికే ఎందుకు పొగుడుతావ్ ?"

"నిజం చెప్తున్నాను. ఇంకొక ముఖ్యమైన విషయం చెప్పాలి.... చెప్పమన్నారా...సరే చెప్పేస్తా. విని మీరేం అనుకోవద్దు. అది చాలా సిల్లీ కోరిక. ఓ రకంగా తప్పు కూడానూ. ఆ కోరికను జయించేశాన్లెండి."

"ఏమిటది ?"

"మగమహారాజులు రావడం,పోవడం మీరు చూస్తూనే ఉన్నారు. ఆ స్త్రీ, అందం నచ్చినా వంశం అందుకు అడ్డుగా నిలిచేది, చూసి పోవడమేకాని వాళ్ళ దగ్గర్నుంచి కబురూ, కాకరకాయా ఉండేది కాదు. ఎంత కట్నం పోయాల్సి వచ్చినా బ్రాహ్మణ వరుడికే నన్నిచ్చి పెళ్ళి చేయాలని నాన్న పట్టుదల. ఎవరైతే ఏం—అని అమ్మ గోల. అమ్మ తరపు బంధువుల్లో చాలా మంది నన్ను ఎగరేసుకు పోవాలని ఎదురు చూస్తున్నారుట. ఇదంతా చూసి నాకు విసుగ్గా వుండేది. అటువంటి పరిస్థితిలోనే నాకో ఆశ ... పురుగులా బుర్రలో ప్రవేశించింది. 'నన్ను పెళ్ళి చేసుకోమని మాస్టార్ని అడిగితే —? ' అని ఓసారి అనుకున్నాను. అప్పట్లోనే మీ అమ్మగారు ఇక్కడికి రావడం, మీ మరదలు సంగతి చెప్పడం జరిగింది. నిరాశపడ్డాను. 'పోనీ ఉంపుడుగత్తెగానైనా ఉంటాను. మంగళ సూత్రం కట్టొద్దులెండి.' అని మీ కాళ్ళా వేళ్ళా పడితే... అని కూడా ఓసారి అనిపించింది. మళ్ళీ

అంతలోనే నా అహం మేలుకొనేది. 'ఛీ నాకేంకర్మ? పెళ్ళి కాకపోతే పీడాపాయె— జీవితాంతం బ్రహ్మచారిణిగా గడిపేస్తాను' అని సర్దిచెప్పుకొనేదాన్ని ... ఏం మాస్టారూ, తమాషాగా లేదూ నాకోరిక?" అంటూ నా చేతిని తన చేతుల్లోకి తీసుకుంది.

"నేనంటే నీకింత అభిమానం ఉందని ఇన్నాళ్ళూ నేను గ్రహించలేకపోయాను. ఇప్పుడు వింటూంటే నిజమేనా అని ఆశ్చర్యంగా వుంది. చాలా ఆనందంగా కూడా వుంది" అన్నాను మాటల్లోనే నా కృతజ్ఞతని పలికిస్తూ.

"మాస్టారూ, ఇంకో నెల రోజుల్లో నా భవిష్యత్తు నిర్ణయమైపోతుంది. మా అమ్మకో తమ్ముడు ఉన్నాడు. అతన్ని మా అమ్మ 'గౌరీ, అని పిలుస్తుంది. అసలు పేరేమిటో నే నడగలేదు. అతని ఫొటో చూశాను. అందవికారంగా ఉండడమే కాదు, చాలా భయంకరంగా వుంటాడు. ఎన్నో ఎకరాల పొలం, ఆస్తిపాస్తులూ వున్న శ్రీమంతుడట ఆయనగారు. నా పెళ్ళి అతన్తో జరిపించాలని అమ్మ సన్నాహాలు చేస్తూంది. నాన్న కిష్టం లేకపోయినా, తన మాట నెగ్గించుకోవాలన్న పట్టుదల అమ్మది. ఇక నా ఇష్టం సంగతి ఎవరడగొచ్చారు? అడిగితే మాత్రం నా ఇష్టాయిష్టాలను ఎవరు పట్టించుకుంటారు...మాటవరసకి మీరంటే నాకు ఇష్టం. చెప్పలేనంత ఇష్టం. మా అమ్మా, నాన్నా కూడా ఎగిరి గంతేసి ఒప్పుకుంటారు ... కాని అది జరిగే పనేనా? అందుకే అమ్మ చెప్పినట్టు వినడానికే నిర్ణయించుకున్నాను..."

"వాళ్ళది ఏ వూరు?" అనడిగాను మధ్యలో. నా గొంతు ఎండి నాలుక తడి ఆరిపోయింది. పొడిగా వచ్చాయి మాటలు.

"కృష్ణాజిల్లాలో అదేదో వూరు. దేవిపేటో, దెయ్యం పేటో అంటారు ... అక్కడి నుంచి వచ్చిపోయే మా బంధువుల మాటలనుబట్టి మా గౌరీ మావయ్య గుణగణాలు ఎలాంటివో చూచాయగా తెలుసుకున్నాను. తాగుబోతు, వచ్చి తిరుగుబోతు; ఊళ్ళో అందరికీ హడల్! ఏ ఆడదాని మీదయినా అతని కన్ను పడితే ఇంక అంతే సంగతులట! పెద కాపుందు పెళ్ళాం అయినా, గుడి పూజారి తల్లయినా, మర్నాటికల్లా ఆయనగారి ఒళ్ళో వాలాల్సిందే. ఖూనీలు చేయడానికయినా వెనుదియ్యని మహానుభావుడని మరికొందరు. ఏమైతేనేం, ఆయనగారి అర్ధాంగిని కాబోతున్నాను నేను. అవన్నీ కిట్టనివాళ్ళ అనే మాటలు...మా తమ్ముడు శుద్ధ బుద్ధిమంతుడు అంటుంది మా అమ్మ.. అయినా ఈరోజుల్లో ఎంతమంది తాగడం లేదు...? పరాయి ఆడదాని వెంట పడడం ఎవడు మాత్రం మానుకున్నాడు? అదంతా సర్వసాధారణమైపోయింది. అయినా నాకెలా రాసిపెట్టివుంటే అలాగే జరుగుతుంది. అలా అనుకుంటే మనశ్శాంతి" అంటూ హైమ దీర్ఘంగా నిట్టూర్చింది. హుక్స్ తెగినట్టున్నాయి, బ్రా వదులైంది. స్థానభ్రంశం పొందింది. ఎగిరి పడుతున్న ఆమె వక్షాన్ని మంత్రముగ్ధుడిలా చూస్తూ కూర్చున్నాను. నాలో లోలోన ఏవేవో ఆలోచనలు. ఆలోచనలకేం? 'లెక్క-

లుంటాయి. వినువీధుల్లోకి ఎగిరిపోతాయి. కాని నా కాళ్ళను, చేతుల్ని కట్టి పడేసే సంకెళ్ళ మాటేమిటి? 'అమ్మా, ఒకవేళ నేను కనక ద్రోహం చేస్తే నన్ను క్షమిస్తావా?' అనుకున్నాను.

"అయితే, అతన్ని పెళ్ళి చేసుకుంటావా హైమా?"

"......"

"అక్కడి కెక్కడికో మీ ఆయన్తో వెళ్ళిపోతావు ... మరి కన్పించవన్న మాట?" నాతో నేనే గొణుగుతున్నట్టు అన్నాను.

"అవును. తప్పదు మరి? అక్కడికి వెళ్ళి ఆ బండ మొగుడి కోర్కెలు తీర్చి, వాడికి పిల్లల్ని కని, అడ్డమైన చాకిరీ చేస్తూ మరో అవతారం ఎత్తాల్సిందే. వేరు దారి లేదు. అక్కడికి వెళ్ళి, నా బ్రతుకు ఎండిన మోడు కాకముందే, మీ స్నేహామృతాన్ని కరువు తీరా, కలకాలం జ్ఞాపకం ఉండేలా తాగాలన్పించింది. ఇన్నాళ్ళకి అవకాశం వచ్చింది. చొరవగా వచ్చాను. నా కోరిక తీరింది" అంది నా చేతుల్ని తన వక్షంమీద వేసుకుంటో.

వక్షోజస్పర్శ ననుభవిస్తూ నా చేతులు అలాగే నిశ్చలంగా ఉన్నాయి. దృష్టి హైమవైపు తిప్పాను. నన్నే తీక్షణంగా విస్ఫారిత నేత్రాల్తో అదే పనిగా చూస్తోంది. తన గుండెల మీదున్న నా చేతుల్ని చప్పున తీసేసి పెదిమల కానించుకుంది. నన్ను చూస్తూనే మృదువుగా వేళ్ళను చుంబించింది.

"మీకు అవకాశం అయినా ఇవ్వకుండా బడబడా వాగాను. ఏమీ అనుకోరుగదూ?"

ఆమె ప్రశ్నకు సమాధానం మునుపకి వంగి ఆమె కళ్ళమీద పెదిమలు ఆన్చాను. నాకెంతో గర్వంగా ఉంది. ఇంతటి మహత్తరమైన అనుభూతి నే నిదివరకు ఎరగను. నిష్కామ ప్రేమభావం మనిషిని ఇన్ని ఉన్నతశిఖరాలు అధిరోహింపచేయగలదని నే నెన్నడయినా ఊహించానా?

"మాష్టారూ, నా కున్న స్నేహితురాళ్ళందరూ నా వయసువాళ్ళే. చీరల గొడవా, సినిమాల గొడవా, మహాఅయితే వాళ్ల వెంటపడే 'బాడీగార్డుల' కబుర్లు తప్పితే వాళ్ల కింకేమీ అర్థంకాదు. జీవిత సమస్యల్ని లోతుగా చర్చించగల స్థాయి కింకా ఎవరూ ఎదగలేదు ... మీరు నా మొట్టమొదటి 'ఫ్రెండ్' కనక ఇదంతా, మనసు విప్పి చెప్పాను."

"నేను చాలా అదృష్టవంతుడిని హైమా. నీ స్నేహ పరిమళాలు నేను బతికిఉన్నన్నాళ్ళూ నాతోపాటేఉంటాయి. నా ఆత్మని వెలిగిస్తాయి. నువ్వెక్కడున్నా నన్ను మరిచిపోవు.నాకు తెలుసా సంగతి. కానీ, నీకు ఎప్పుడు ఎటువంటి సహాయం కావలసివచ్చినా నన్నడగడానికి మాత్రం సందేహించకు. ఏం"? అన్నాను.

'అలాగే' అన్నట్టు తల ఊపింది. దాంతో సంతృప్తి పడలేదు. చేయి చాచి 'ప్రామిస్' అన్నాను. చేతిలో చెయ్యి వేసింది.

"ఇప్పుడేనా చెప్పండి సార్...ఎంత సేపిలా" అంది గోముగా.

ఏమిటన్నట్టు చూశాను.

"నన్నిలాగేఉండమన్నారా, లేక..." అని తలెత్తి నా మొహంలోకి పరీక్షగా చూసింది. "ఇక నైనా చీర కట్టుకో డానికి అనుమతిస్తారా ?" అంటూ వాక్యం పూర్తి చేసింది. మోకాళ్ళ పైకి జరిగిన పరికిణీని సర్దే ప్రయత్నంలో హైమ ఉంది ... హుక్స్ తెగిన బ్రా ఆమె ఒళ్లో పడింది. తటాలున నా దృష్టి మరో వేపు మరల్చాను.

గదిలో ఓ మూల పడి ఉన్న చీరనూ జాకెట్‌నీ తెచ్చి ఇచ్చాను. బ్రా హుక్స్ పెట్టుకొంటోంది. ఆ పని పూర్తవగానే తల తిప్పి నన్ను ఆశ్చర్యంగా చూసింది. "ఇదేమిటి ఇచ్చేస్తున్నారేం? మీ ఆనందం కొల్లగొట్టిన పాపం నేను మోయక తప్పదా ?" అంది.

"అయాం రియల్లీ వెరీ సారీ హైమా! చిన్నదానివైనా క్షమించమని అడుగు తున్నాను. ఆవేశంలో తొందరపడ్డాను. శరీర వాంఛ తుచ్ఛమైనది కాదనుకో... కాని ఆ వాంఛతో నీ ఆత్మ ఔన్నత్యాన్ని కించపర్చబోయేను ... నువ్వు చెప్పింది నిజమే. ఏ దేహాన్ని ఆశ్రయించినా నరాల బాధ తగ్గి ఉపశమనం కలుగు తుంది. కాని బతుకంతట్నీ పండించి తేజస్సుతో నింపగల ఆత్మ సౌందర్యం ఎక్కడ దొరుకుతుంది ? అయాం ప్రౌడ్ ఆఫ్ యూ!" అన్నాను.

చీర కట్టుకోవడం పూర్తి చేసిన హైమ నా వంక తిరిగి నన్ను ఆరాధనగా చూసింది. కంటి పాపలు తళ తళ లాడాయి.

"మీ వాలకం చూసి, నన్ను రేప్ చేస్తారేమోనని తెగ భయపడ్డాను మాస్టారూ, అబ్బ, గుండె ఒకటే దడ!" అంది గుండెల మీద చెయ్యి వేసు కుంటూ.

"అవును మరి ఆ స్థితి అలాంటిది... అవునూ ఒకవేళ నువ్వన్నట్టే జరిగింద నుకో... నన్నేం చేసే దానివి."

"ఏం చేసేదాన్ని...? ఓ నమస్కా రం పెట్టి వెళ్ళి పోయేదాన్ని. నేనందుకు సిద్ధపడే వచ్చాను. కాకపోతే, నా మాట వింటారనీ, నన్ను అర్థం చేసుకుంటా రనీ నాకు ధీమా! పైట కొంగు రెప రెప లకే నడిరోడ్డు మీద కుక్కల్లా అమ్మాయి వెంట పడే పద్దన్నులను నేను చూడక పోలేదు. ఒంటరిగా వస్తే ఇంకేమన్నా ఉందీ ?"

"ఇంత చిన్నదానివి. అందునా ఆడ పిల్లవు. ఇంత ఆలోచనా శక్తి ఎలా సాధించేవు హైమా ?"

"సావాస దోషం. అందునా గురువు లాయె?"

నాకు నవ్వొచ్చింది. నవ్వేశాను. ఆ రాత్రల్లా అలా ఏవేవో కబుర్లు. మాటల మధ్యలో నాగరత్నం ప్రసక్తి కూడా వచ్చింది. ఆమె భర్త యువకుడేనట. సినిమా హీరోలా ఉంటాడట. అతని దగ్గరే ముసలి తలిదండ్రులు రోజులు వెళ్లమారుస్తారుట. పెళ్లయి రెండేళ్ల యింది. ఇంకా పిల్లా పీచూలేదు. ఇంతకు మించి హైమకి కూడా మరే వివరాలూ తెలీవు. నాగరత్నం వ్యక్తిత్వం ఎలాం టిదో ఆమెను అడగాలనుకుని, ఎందుకో

సందేహించాను. అయినా ఆ సంగతి నాకు తెలియకనా? తెలుసు. కాని లక్షణ మైన భర్త ఉండగా కూడా, దారి తప్ప డానికి కారణం ఏమిటి? ఏదో బలవత్తర మయిన కారణం ఉండే ఉంటుంది. అదే నేను తెలుసుకోవాలనుకున్నది – ఆమె భర్త పోర్టులో ఏదో పెద్ద ఉద్యోగమే చేస్తున్నాట్ట. కబుర్లు మళ్ళీ మరో దారి పట్టేయి.

ఛక్కున తెల్లవారి, బారెడు పొద్దు ఎక్కేవరకూ, ఇద్దరం మంచం మీద ఒకరి పక్క ఒకరం వెల్లకిలా పడుండి అలా ఏవేవో కబుర్లు. హైమ తల్లి దండ్రులు వస్తారన్న భయమే లేకపోతే ఆ కబుర్లు అనంతంగా సాగిపోయేవేమో!

చివరి సారిగా, ఆమె చుట్టూ చేతులు వేసి నా గుండెలకు బలంగా అదుము కున్నాను. ఎవరో బలవంతాన వేరు చేసినట్టు ఇద్దరం విడిపోయాం. హైమ చర చరా గుమ్మం దాటింది. నాలుగడు గులు వేసి, హఠాత్తుగా వెనుదిరిగి నన్ను చూసింది సజల నయనాలతో ఒక్క క్షణం. అంతే. మళ్ళీ చర చరా నడిచి, వాళ్ళింట్లోకి అదృశ్యమై పోయింది.

నేనెంతో అభిమానించే ఆ అందాల రామచిలుక అసువు ఇంకొక ఏడాదే నన్న 'చేదు నిజం' నాకు గనక ముందే తెలుస్తే, నేనేం చేస్తాను? ఆ గడువును పదే పదే తలుచుకుంటూ, దానికి పట్టి బోయే గతికి కుములుకుంటూ, ఏడాది పొడుగునా రోజూ దుఃఖించగలనా? అంత శక్తి నాకు లేదు. ఆ అనుభూతుల్ని గుండెలో పదిలం చేసుకుని, ఎవ్వరికీ దూరంగా, చాలా దూరంగా వెళ్ళి పోతాను ...నా తాహతుకు తగినది అదే!

అదే చేశాన్నేను.

ఒకానొక రోజు —— హైమ ఎవరో ఫ్రెండ్స్‌తో ఏదో సినిమా చూడ్డానికి వెళ్ళినప్పుడు – హడావుడిగా గంటలో ఇల్లు ఖాళీచేశాను. మహారాణి పేటకు మకాం మార్చాను. నాగరత్నానికి కూడా ఈ విషయం చెప్పలేదు. నా కోసం అక్కడికి వెళ్తుందేమో...ఇల్లు మార్చిన సంగతి విని ఏమనుకుంటుంది? తనను వదుల్చుకోవడానికి నేను వేసిన ఎత్తుగడ మని అనుకుంటే మాత్రం నేను చేసే దేముంది?

అలా పదిహేను రోజులు గడిచాయి.

నేను యథాప్రకారం రోజూ ఆఫీసుకు వెళ్ళి వస్తున్నాను. పుస్తకాలతో, వరుస చెత్త సినిమాల్తో కాలం సునాయాసంగా దొర్లిపోతూంది. ఎప్పుడేనా, నిద్రపట్టక విసుగ్గా మంచంమీద అటూ ఇటూ దొర్లినప్పుడు మాత్రం నాగరత్నం జ్ఞప్తికి వచ్చేది. ఆమె అవివాహిత అన్న భ్రమతో, నే పేర్చిన గాలిమేడలూ, నా వైఫల్యం ... ఇవన్నీ తలుచుకుంటూ అశాంతిగా వేగిపోవటం ... ఏ అర్ధ రాత్రికో కాని కళ్ళమీద నిద్ర కూరుకు వచ్చేది కాదు.

* * *

మూడు రోజుల పబ్లిక్ హాలీ డేస్ తర్వాత, ఆ రోజే ఆఫీసు తెరిచారు. వచ్చే పోయే కష్టమర్లతో ఆఫీసంతా చిన్న సైజు జాతరలా ఉంది. నోట్ల కట్టలు– వసూలు–పందలు–వేలు–లక్షలు–

చేతులు మారుతున్నాయి. చెక్కులు తెచ్చేవాళ్లు కొందరు. నోట్లు పట్టుకెళ్ళే వాళ్లు కొందరు. ఆరోజు నన్ను 'రిసీట్స్' కౌంటర్లో వేశారు. అదే పనిగా కరెన్సీ కాగితాల్ని లెక్క పెడ్తున్నాను. అద య్యాక స్టాంప్‌వేసి సంతకం చేస్తు న్నాను. అదయ్యాక మరో కట్ట. ఇదంతా తల వంచుకొని యాంత్రికంగా చేసుకుపోతున్నాను. మధ్యాహ్నం పన్నెండు ప్రాంతంలో ఆఫీసు ప్యూన్ అద్దాల తలుపు తట్టి నా కోసం ఎవరో వచ్చారన్నాడు. 'ఎవరు, పేరు లేదా? అది కనుక్కురా' అన్నాను చిరాగ్గా, నా పని ఆపకుండానే. పని గొడవలో పడి, హనుమంతుడి తోకలాంటి క్యూని గబ గబా కత్తిరిద్దామన్న ఉద్దేశంలో—తల ఎత్తనే లేదు. కుర్చీలోంచి లేవ లేదు. లంచ్ అవర్ అయ్యేక రెండు ప్రాంతంలో తలెత్తి చూస్తే, ఎదురుగా హాల్లో సోఫా మీద నాగరత్నం? నవ్వుతూ చూస్తోంది నన్ను. రమ్మని పిలిచాను.

"ఏమిటి విశేషం ?"

"మీతో అర్జెంటుగా మాట్లాడాలి."

"ఇప్పుడా?"

"అవును."

"అంత అర్జెంటా!

"కనకే వచ్చాను" మూతి ముప్పయ్ వంకరలు తిప్పింది.

"సాయంకాలం మాట్లాడదాం."

బుంగమూతి పెట్టి, తల తిప్పింది.

"పోనీ గంట పోయేక రా కేష్ హేండోవర్ చేసేసి వస్తాను."

"ఆఁ, గంటా! ఎక్కడికి వెళ్ళి రాను! ఇక్కడే కూర్చుంటాను" అంది.

"ఇక్కడా!" అన్నాను ఇబ్బందిగా.

నా తోటి కేషియర్లు, గుమాస్తాలు, ప్యూన్లు, ఎకౌంటెంట్, ఏజెంట్, వీళ్లం దరి దృష్టిలోనూ పడ్డాను. ఎవరా అమ్మా యని అడిగితే నేనేం చెప్పాలి? పైగా పల్చని చీరలోంచి గుడ్లగూబ కళ్లలా ఆ మంగళ సూత్రాలు ఒకటి?

"నే నెదురుగా ఉంటే పని కాదా ? దృష్టి అటు పోదా?"

గుండె దడతో ఓ పక్క ఛస్తూ ఉంటే వేళాకోళాలు. ఒళ్లు మండింది.

"సరే కూర్చో !"

అయినా ఆమెకి లేని భయమూ, సిగ్గూ నా కెందుకు? ఛ. ఛ. నాగరత్నాని కున్న ధైర్యంలో నాకు నూరో వంతు లేదు. ఉత్త ఫూల్‌ని. అర్జెంటు పనట! ఏమిటా పని? కొంపతీసి, వ్యవహారం ఆయన చెవుల్లో పడిందా ? గొడవ చేశాడా? అదేం కాదేమో! మొహం చూడ రాదూ, ముసి ముసి నవ్వుల్లో మతాబాలా వెలిగిపోతోంది. రాకెట్ వేగంతో పని పూర్తి చేసేసరికి గంట దాటింది. ఎకౌం టెంట్‌నీ, కాషియర్‌నీ బతిమాలి పెర్మి షన్ తెచ్చుకున్నాను. రుమాలుతో చెమట్లు తుడుచుకుంటూ నాగరత్నాన్ని చూశాను. ఇద్దరం ఆఫీసు బైట పడ్డాం.

"ఇప్పుడెక్కడికి వెళ్దామంటావు ?" అన్నాను నాగరత్నాన్ని చూస్తూ.

"నీ ఇష్టం..." అంది.

"దగ్గర్లోనే బీచ్ ఉంది..."

"అక్కడొద్దు అందరూ ఉంటారు. మీ ఇంటికి పద."

'తప్పేలా లేదు! అనుకుంటూ బస్ స్టాప్ వేపు దారి తీశాను. దారి పొడుగునా ఇద్దరం మౌనంగా ఉన్నాం. కాసేపటికి ఇల్లు చేరాం.

జనసమ్మర్దం నుంచి ఏకాంతంలోకి రాగానే నాగరత్నం ఆడపులి అయింది. పసిమిరంగు మొహంలో ఎర్రబారిన కోపం.

"ఎవరికీ చెప్పాపెట్టకుండా ఇల్లు మార్చేసి ఇలా పారిపోయి రావడంలో నీ ఉద్దేశం?" అంది నన్ను చుర చురా చూస్తూ.

"ఇదేనా నువ్వన్న అర్జెంటు విషయం?" అన్నాను.

"అవును."

నేను జవాబివ్వకుండా కుర్చీలో కూర్చుని సిగరెట్ పెట్టె తీశాను.

"నేనెప్పుడు పోవాలనుకున్నావ్?"

అగ్గి పుల్ల గీసి సిగరెట్ వెలిగించుకున్నాను. చప్పున నా కాళ్ళ దగ్గర కూర్చుని నా ఒళ్ళో తల పెట్టింది.

చాలాసేపు అలాగే ఉండి తల ఎత్తి నన్ను చూసింది. "నా నుంచి పారిపోదామనుకుంటున్నావా?" అంది సజల నయనాలతో.

ఏం చెప్పాలో అర్థం కాలేదు. సిగరెట్ విసిరి పారేసి ఆమెను లేవనెత్తాను.

* * *

అలా మూడు నెలలు గడిచాయి. నాగరత్నం అడపా దడపా వస్తూ పోతూనే ఉంది. నా ఒంటరితనాన్ని పూల పరిమళాల్తో నింపి, నా ఏకాంతాన్ని ప్రభంజనంలా హరించి, ఎంతకీ వెళ్ళలేక వెళ్తూ ఉండేది.

ఆ రోజు సుజాత బర్త్‌డే. ఇన్విటేషన్‌తో పాటు 'వచ్చి పొమ్మని' మావయ్య ఉత్తరం కూడా రాశాడు. సాయంత్రం ఆరు గంటల వేళ—అక్కడికి వెళ్లే సన్నాహంలో ఉన్నాను.

సుడిగాలిలా వచ్చింది నాగరత్నం.

"ఏదో ప్రయాణంలో ఉన్నట్టున్నావు..."

"అవును" అంటూ సంగతి చెప్పాను.

"గంటలో తిరిగి వచ్చేస్తావా?"

"చెప్పలేను, రెండు మూడు గంటలు కావచ్చు."

"అంతవరకూ ఇక్కడే ఉండనా, నీకోసం ఎదురు చూస్తూ" అంది. ఆ కంఠంలో ఆశ.

"వీలైతే త్వరగానే వచ్చేస్తాను. కాని... ఈ పెద్దవాళ్ళింట్లో పార్టీలు తమాషాగా ఉంటాయి...ఒకోసారి..."

"పూర్తయ్యే సరికి తెల్లారిపోతుంది..." అంటూ ఏమంటావు, అంతేనా? అన్నట్టు చూసింది.

ఆమె మాటల్లోని వ్యంగ్యం నా చెవిలో పడి, తలకి ఎక్కక పోలేదు. కాని అది పట్టించుకునే వ్యవధీ, ఉద్దేశం నాకు లేవిప్పుడు...అద్దంలోకి చూసుకుంటూ తల దువ్వుకుంటున్నాను. నా వెనక నిలబడి, నాగరత్నం అద్దంలోని నా ప్రతిబింబాన్ని చూస్తోంది. కన్నీటి కడలితో ఉప్పెన లేకెత్తించయినా, నా ప్రయాణానికి భంగం కలిగించాలను కుంటోంది. యదాలాపంగా

ఆమె మొహంలోకి చూశాను. మొహంలో నీలినీడలు, నీరసం పరిచిన నీలినీడలు నాకెందుకో, ఆమె ఆ క్షణంలో చాలా అందవికారంగా ఉన్నట్టు కన్పించింది. నాగరత్నం కళ్ళు ఎంతో లోతుకు కూరుకుపోయి, చూడాలంటే కంపరం పుట్టిస్తున్నాయి. తళ తళ లాడే మెరుపుతో, నాలోని మృగాన్ని ఛెళ్ళున తట్టి లేపే ఆమె ఎర్రని నున్నని చెంపలు పాలిపోయి ఉన్నాయి. అప్పుడే, ఆ క్షణంలోనే—నిన్న కాక మొన్న ఆమె నా చెవిలో వేసిన సమాచారం గుర్తుకు వచ్చింది. తను నెల తప్పానన్నది. నా ప్రతిబింబం తనలో క్షణ క్షణం ఎదుగుతోందన్నది. ఈ లోగా మనం ఏదో ఒకటి చేయాలి...ఏదో ఒక నిర్ణయానికి రావాలి—అని నొక్కి చెప్పింది. ఏం నిర్ణయం ? ఏమని నిర్ణయం ? ఇంత వరకూ వస్తుందని ముందు తెలీదా ? అప్పుడే జాగ్రత్త పడవచ్చు కదా ? ఇప్పుడు మాత్రం ఏం మించి పోయింది? ఎబార్షన్ చేయడానికి వీధికో డాక్టరున్నాడు ! తన తెలివి తక్కువ పనికి నిందాపూర్వకంగా నన్ను చూడ్డం దేనికి ? తల దువ్వుకోడం పూర్తయింది.

"ఏమంటావు గోపీ, త్వరగా రావా ?"

"చెప్పానుగా. రావడానికే ప్రయత్నిస్తాను. కానీ, ఏ కారణంగానైనా వీలు కాక పోతే నేను చేసేదేమీ లేదు" అన్నాను నిస్సహాయంగా. ఆమెతో వాదించే ధైర్యం, ఆమె తెలివి తక్కువతనాన్ని ఆమెకు గుర్తు చేసే స్థయిర్యం నాలో లేవు.

"పోనీ ఒక్కసారి కూర్చోవూ?" అంది దీనంగా.

"టైమైంది. వెళ్ళాలి" అన్నాను అసహనంగా.

"అయిదు నిమిషాలు....ప్లీజ్!"

"సరే" అంటూ మంచం మీద కూర్చున్నాను. నా పక్కనే కూర్చుంది. నా చేతిని తన చేతుల్లోకి తీసుకుంది.

"నెల తప్పిన విషయం చెప్పాను. నీకు గుర్తుందా." అనడిగింది.

'ఎందుకుండదూ? నిన్న కాక మొన్ననే కదా చెప్పావు. ఉండకేం చేస్తుంది? ఉంది కనకనే నాలో ఇంత అలజడి, ఆందోళన. నా ప్రతిరూపం పేరుతో నన్ను బందీ చేయాలనుకుంటున్నావు. నువ్వు చెప్పేది నిజమే కావచ్చు. నీలో పెరుగుతున్నది...అది...నా ప్రతిబింబమే కావచ్చు. క్షణాలు, గంటలు, రోజులు, వారాలు, నెలలు, గడిచి ఏదో ఒకనాడు దానికి ప్రాణమూ రావచ్చు. ఆకలేసి కేకలు వేయవచ్చు. పెరిగి, పెద్దయి, బాధల్లో, ఆనందాల్లో ప్రేమల్లో అసహ్యాల్లో, ఆలోచనల్లో, స్మృతుల్లో, ఉద్రేకావేశాల్లో కొట్టు మిట్టాడనూ వచ్చు. కాని నేనేం చెయ్యాను? ఏం చెయ్యగలను? నువ్వు అవివాహిత ననుకున్నాను. గాఢంగా ప్రేమించాను. నీ వెంట పడ్డాను. నువ్వు వెంట పడితే, చేరదీసి లాలించాను. పెళ్లయ్యే వరకూ పవిత్రంగానే నిన్ను ఉంచుదామనుకున్నాను. నిన్ను తాకకూడదనే అనుకున్నాను. పెద్దల సమక్షంలో పెళ్ళి చేసుకుని,

నిన్ను ఆనందాల డోలల్లో ఉ[రూత బాగిద్దామనుకున్నాను. కాని ఆనాటి తెల్ల వారు ఝామున పెనుతుఫానులా వచ్చి, నా గుండెలో చిచ్చు రగిలించావు. భర్త చాటు వ్యభిచారిణివి తప్ప నువ్వు మరింకేమీ కావు, కానే కావనుకున్నాను. గొంగళి పురుగులా నిన్ను తీసవతల పారేద్దామనుకున్నాను. కాని నా ఆలోచనల మెత్తదనం అందుకు అడ్డు వచ్చింది. అంత నిర్దాక్షిణ్యంగా ఉండలేకపోయాను. నా దరి చేరడానికి నువ్వు ప్రదర్శించిన ధైర్య సాహసాలు అపూర్వం. అందుకు నీకు నా జోహార్లు, అంత తెగువకు నిన్ను పురిగొల్పిన, లేదా నెట్టిన పరిస్థితులు ఉంటే ఉండవచ్చు. నీలో ఏ అపరాధమూ లేకపోవచ్చు. ఓకే, ఒప్పుకున్నాను. అందుకే నిన్ను నేనసహ్యించుకోలేదు. నీ పరిస్థితి అర్థం చేసుకోవాలనే ప్రయత్నించాను. ఆ ప్రయత్నంలోనే నీకు దగ్గరగా జరిగాను. 'షాక్' తింటూ నా ఆత్మ క్షోభిస్తున్నా, నీకు మరింత చేరువ అయింది నా దేహం. దాహంతో గొంతు ఎండిన వాడికి పుడిసెడు నీళ్ళు పోసి పుణ్యం సంపాదిస్తారు. నీకు...కావాల్సింది అదే అనుకున్నాను. నేను మరింకేమీ అనుకోలేదే...! నువ్వే, ఏదేదో అనుకుంటూ, ఏవేవో ఊహిస్తూ, నా చుట్టూ ఉక్కు గోడలు కట్టాలని ప్రయత్నిస్తున్నావు... నీకు తెలీదు. నా బాధ నీకు తెలీదు. నీలోని నా ప్రతిరూపం సంగతి ముమ్మాటికీ నిజమే కావొచ్చు. కానీ నీతో పాటు నేనూ అధః పాతాళంలోకి దిగలేను. మా అమ్మ...అవును నాకీ రూపం ఇచ్చిన మా అమ్మ...నన్ను పెంచి పెద్ద చేసిన మా అమ్మ తల్లడిల్లిపోతుంది. పెద్దగా రోదిస్తుంది. పరాయి వాడి పెళ్లాన్ని తెచ్చుకున్న పెద్ద మనిషివని తెలిస్తే, లోకం నన్ను వెలివేస్తుంది. నా చెల్లెళ్లకి పెళ్ళిళ్ళు కాకపోవచ్చు. వృద్ధిలోకి వస్తున్న నా ఉద్యోగ జీవితం నరక ప్రాయం కావచ్చు. అందుకే హైమను, బంగారు బొమ్మ హైమను-దూరం చేసుకున్నాను. ఇకనైనా స్థిరపడాలని, మరదలు సుజాతని, అకస్మాత్తుగా సిరి వరించిన సుజాతని ఆకర్షించాలని ప్రయత్నిస్తున్నాను. నల్లగా ఉన్నా, సెక్సీగా ఉండే సుజాతని, నువ్వూ నీ బోడి ఉద్యోగమూ నీ బతుకెంతలే అన్నట్టు చూసే సుజాతని,నా కిష్టం లేని సుజాతను వల్లోవేసుకుందామను కుంటున్నాను. మా అమ్మకీ, నాన్నకీ, మావయ్యకీ, అత్తకీ-ఈ సంబంధం ఇష్టమే అయినా-సుజాత ఇష్టం సంపాదించడానికి ఉరకలు వేస్తున్నాను. పరుగులు తీస్తున్నాను. రాజీ పడుతున్నాను... ఆ రోజు రాత్రి తెల్లవారు ఝామున, నా నెత్తి మీద నువ్వు పడవేసిన అశనిపాతం చాలు. అంతకు మించిన బరువులు నేను భరించలేను. అసలందుకే నేనిప్పుడు కొంత శిధిలమై పోయాను. అవున్నిజమే, నిజమే. నీలో పెరిగే ఆ ప్రతిరూపం నాదే కావచ్చు... అహఁ... నాదే-సరే, నాదే? అయితే ఇప్పుడేమంటావ్???'

ఆ ఒక్క నిమిషంలో నాలో చెలరేగిన సంఘర్షణని ఆమె పాదాల ముందు

పడవేద్దామనుకున్నాను. ఆ మాటల లావాతో ఆమెను ముంచెత్తుదామను కున్నాను. కాని ఏదో అశక్తత, మరేదో భయం, నా నోరు కట్టేశాయి.

"గుర్తుంది. ఏం చేద్దామంటావు?" అని మాత్రం అన్నాను. ఏదో ఒకటి వినేసి, ఏదో ఒక జవాబు చెప్పి ఆ పరిస్థితి నుంచి తప్పించుకోవాలని నా ఆదుర్దా.

"ఆయనకి అనుమానం వచ్చింది. మాటల్లో కాక ఇప్పుడు చెంపదెబ్బల్లో హింసిస్తున్నాడు. సమయం మించి పోక ముందే మనం మేలుకోవాలి..."

"ఏం చేద్దామని?" అన్నాను.

"నేనొకటి ఆలోచించాను. ఇంత జరిగాక మనం ఎలాగోలా ఇక్కడ బతకలేం...ఎక్కడికైనా పారి పోదాం!"

"పారిపోయి...?" అన్నాను.

"నా ఒంటి మీద పది తులాల బంగారం ఉంది. మా నాన్న నాపేర బ్యాంకులో వేసిన కట్నం బాపతు డబ్బు అయిదువేలు మిగిలివుంటే డ్రా చేసి తెచ్చాను. కొన్నాళ్ళపాటు ఈ డబ్బు సరిపోతుంది. ఈలోగా నీకు కానీ, నాకు కానీ ఏదో ఒక ఉద్యోగం దొరక్క పోదు. అన్నీ ఆలోచించే, అంతా సర్దుకుని వచ్చాను" అంటూ నాగరత్నం ఆశగా నా మొహంలోకి చూసింది.

నేను ఆమె తెచ్చిన సూట్‌కేసువేపు చూశాను. ఈ భయంకర పరిస్థితినుంచి ఎలా బయటపడడం ?

"ఇవాళే వెళ్ళిపోదాం !" అంది తనే మళ్ళీ.

నా చేతగాని తనంమీద, నాగరత్నం అందాలు చూసి పరవశించిపోయి మోర ఎత్తిన నాలోని మృగంమీద, మా అమ్మ మీద, మా చెల్లెళ్ళమీద, నా బతుకుమీద— ఒక్కుమ్మడిగా కోపం ముంచుకు వచ్చింది. ఇంతటి పెను సమస్యను క్షణాలమీద ఎలా పరిష్కరించడం ?

"ఎందుకంత తొందర ? కాస్తఆలో చించుకొనే వ్యవధన్నా ఇవ్వకపోతే ఎలా ?" అన్నాను చిరాగ్గా.

"ఇంకేం ఆలోచిస్తావు, నా నుంచి దూరంగా మళ్ళీ ఎలా పారిపోవాలనా ?" అంది నిష్ఠూరంగా.

"నాగరత్నం !"

"ఎందుకలా కేకలు వేస్తావు? అపాటి ఆలోచించగల తెలివితేటలు నాకు లేవను కున్నావా ? పెళ్ళయి రెండేళ్ళయినా నీతో పరిచయం అయ్యేవరకూ కన్యనేనని చెప్పాను. నువ్వు నమ్ము నమ్మకపో. అదీ నిజం. నీ తోడిదే నా జీవితం. నువ్వే నాకు కొత్త ఊపిరిపోసి బతికించావు. నీకు ఇష్టంలేందే నువ్వు మాత్రం ఎలా వస్తావు? నా ప్రేమతో నిన్ను కౌగిళ్ళల్లో ముంచగలను. కానీ, నీ మనసు తిప్పుకో గలనా ?" అంది.

"నన్ను మాటల్తో బాధపెట్టకు.నన్ను కాస్త ఆలోచించుకోనీ..."

"ఏడ్చి మొరపెట్టి, నిన్ను ప్రాధేయ పడాలనీ, నీ కాళ్లూ చేతులూ కట్టేసి తీసుకుపోవాలనీ నేనిప్పుడు రాలేదు. నా నిశ్చయం చెప్పాను. పరిస్థితి చెప్పాను. నామీద ఏమాత్రం ప్రేమ ఉన్నా, నా నిజాయితీ మీద ఏమాత్రం

గౌరవం ఉన్నా, నేనిన్ని మాటలు చెప్పాల్సిన పనేముంది?" అంది. తన చేతుల్లోని నా చేతిని వదిలేసింది.

"నేను చెప్పింది వినిపించుకో. ఆలోచించడానికి కొంత వ్యవధి కావాలి..." అన్నాను ఆమె వదిలేసిన చేత్తో కణతలు రుద్దుకుంటూ.

"పోనీ, ఈ ఒక్క విషయం మనస్ఫూర్తిగా చెప్పు. నువ్వు నిజంగా నన్ను ప్రేమించావా? లేకపోతే, పరాయి ఆడది కోరి వచ్చింది, అందుబాటులో ఉంది, కానీ ఖర్చు లేకుండా ఇష్టం వచ్చినట్టు అనుభవిద్దాం అనుకున్నావా?" అంది నాగరత్నం విసురుగా లేచి నిలబడ్తూ.

నేనుకూడా లేచి నిలబడ్డాను.

"నువ్వు చాలా ఆవేశంలో వున్నావు. ఇప్పుడు నేను నీకేం చెప్పినా అర్థం కాదు. దయచేసి ఇంటికి వెళ్ళిపో, నాగరత్నం" అన్నాను ప్రాధేయపూర్వకంగా.

నాగరత్నం మొహం గంభీరంగా ఉంది. తీక్షణంగా నన్నే చూస్తూ ఏదో ఆలోచిస్తోంది.

"నేనిచ్చిన సుఖానికి ప్రతిఫలంగా నిన్నేదో డిమాండ్ చేస్తున్నాననుకోకు. అంత నీచురాలిని కాను. 'పిలవకుండా నీకై నువ్వు వచ్చావు. నీ దేహంతో విసుగొచ్చినన్నాళ్ళు ఆటలాడుకొని వదిలేద్దామనుకొన్నాను' అని నువ్వన్నా నేనేమీ అనుకోను. మగవాళ్ళ నైజం ఎలాంటిదో–అనుభవపూర్వకంగా నాకు తెలీకపోయినా, నేను చదివిన పుస్తకాలూ నేను చూసిన జీవితాలూ చాలు. గ్రహించగలను. అంతకన్నా వేరే ఉద్దేశం నాకేదీ లేదని ఒక్క మాట చెప్పు. మారు మాట్లాడకుండా తక్షణం ఇక్కణ్ణించి వెళ్ళిపోతాను" అంది.

"నేనేమీ చెప్పే స్థితిలో లేను. నాదొక్కటే మాట. నాకు వ్యవధి కావాలి" అన్నాను, అదే నా స్థిరనిర్ణయం అన్నట్టు.

"నిద్రపోతున్నవాళ్లనిలేపగలం. నిద్ర నటిస్తున్న వాళ్లని ఆ దేవుడు దిగివచ్చినా ఏం చెయ్యలేడు. నువ్వూ అంతే. ఇదే ఆఖరుసారి. ఈ ఒక్కమాటా విను. గంట వ్యవధి తీసుకో. నేనీ సూట్‌కేస్‌తో హైమా వాళ్ళింట్లో ఉంటాను. ఇప్పుడు ఏడు అవుతూంది కాబోలు. ఎనిమిది వరకూ అహఁ కాదు తొమ్మిది వరకూ వాళ్ళింట్లో ఉంటాను. ఈలోగా నువ్వొప్పు దొచ్చినా సరే బయలుదేరుదాం. నీ ఇష్టం వచ్చిన చోటికి పోదాం. తొమ్మిది దాటేక అక్కడ ఒక్క క్షణం కూడా ఉండను. నా శరీరంలో ఊపిరి ఉండేది అంతవరకే. ఆ తర్వాత నేనేమౌతానో నాకే తెలీదు. ఆ విషయం నేనిప్పుడు ఆలోచించే స్థితిలో లేను. ఆశా, జీవం, బతుక్కి ఒక అర్థం పోయేక, ఈ జీవచ్ఛవం ఈ మరబొమ్మ ఏమయితే ఏం? ఎలా పోతే ఏం? ఇంక నేను చెప్పేదేం లేదు. వెళ్తాను" అనేసి గిరుక్కున వెనుదిరిగింది. చరచరా నడిచి వీధిలోకి వెళ్ళింది. అటుగా వచ్చిన రిక్షా ఎక్కి వెనక్కి మళ్ళింది. ఆ రిక్షా కనుమరుగు అయ్యే వరకూ చూస్తూ నిలబడ్డాను. . . . . నేను

అపరాధం చేయలేదుగద ! నాగరత్నం జీవితాన్ని, కుసుమించకముందే నలిపి కాలరాచిన మూర్ఖత్వం కాదుగద నాది!? నా మనసులోని మాట ఆమెకు అనాడే చెప్పివుంటే పరిస్థితి ఇంతవరకూ వచ్చేదా? 'నిన్ను ప్రేమించాను. నిజమే పెళ్ళి కూడా చేసుకుందా మనుకున్నాను. కాని పెళ్ళయిన దానిపని తెలిసేక స్వేచ్ఛాప్రియపనీ, స్వైరిణి పనీ అనుకున్నాను. అది పొరబాటే కావచ్చు. అందుకే అన్నిరాత్రులు నీతో గడిపాను. నువ్వు రాకపోతే విరహంతో కాలిపోయాను' అని ఒక్కమాట చెప్పి ఉంటే...?

పక్కవాళ్ళింటి గోడ గడియారం గంటలు కొట్టసాగింది. లెక్కపెట్టాను. ఏడు గంటలయింది. వీధిలో చీకటి. నా గదిలో చీకటి. నా మనసులో చీకటి నా కళ్ళముందూ, మెదడులోనూ, నరనరాల్లో కూడా చీకటి. పెనుచీకటి. ఊపిరుల్ని, జీవితాల్ని కర్కశంగా కబళించే కారునల్లని చీకటి.

దీర్ఘంగా నిట్టూర్చాను.

గదిలోకి వెళ్ళి దీపం వెలిగించాను. అద్దంలో నా రూపం పరికించాను. ఇదివరకున్న ఉత్సాహం లేదు. చురుకుదనం లేదు. ఏదో కోల్పోయినట్టు, భయంకర విషాదం సంభవించినట్టు, నా మొహంలో దిగులు, కళ్ళలో కాంతి హీనత. పాదాల కింద శూన్యాలు.

ఏడు దాటవస్తోంది. ఈపాటికి పార్టీ మంచి స్వింగ్ లో ఉండిఉంటుంది. నాకోసం అత్తయ్యా, మావయ్యా ఎదురు చూస్తూ ఉంటారేమో! చెల్లెలి జ్యేష్ఠ పుత్రుణ్ణి కదా ...అభిమానం ఎక్కడికి పోతుంది?

అదిసరే సుజాత నేనింకా వచ్చాను కాదేం—అనుకుంటుందా, లేకపోతే అతిథులు తెచ్చిన ఖరీదైన బహుమతులు చూసి మురిసిపోతూ ఉంటుందా ? గదికి తాళంవేసి, డాబా గార్డెన్స్ బయలుదేరాను...

అనుకున్నట్టుగానే అక్కడంతా కోలాహలంగా ఉంది. మేడముందు రోడ్డు పక్కని బార్లు తీరిన కార్లున్నాయి. లోపల లాన్‌లో షామియానా కింద జనం. అందరిలోనూ ఏదో ఉత్సాహం.

"ఇంత లేటుగానా రావడం?" అంటూ నన్ను పలకరించాడు మావయ్య.

ఏదో సమాధానం చెప్పి ముందుకి నడిచాను. అక్కడ అంతా తానై తిరుగుతూంది సుజాత. ఊదారంగు చీర, అదే రంగు జాకెట్టు, మెడలో ఏవేవో నగలు దబ్బుతో కొన్న అలంకారాలతో ఆమె నల్లని దేహం వింతగా వెలుగుతూంది.

ఆమె దృష్టిని ఆకర్షించాలని చాలా ప్రయత్నాలు చేశాను. దగ్గర దగ్గరకి వెళ్ళాను. పొడి దగ్గులు దగ్గాను. ప్రయోజనం లేకపోయింది. చివరికి అరగంట తరవాత కాని ఆమె దృష్టిలో పడలేకపోయాను నేను.

"హలో బావా ?" అంటూ పలకరించింది.

"హేపీ బర్త్‌డే" అనో మరేదో చెబ్దామని దగ్గరగా వెళ్ళబోయాను. అంతలో—"బావా నీతో చిన్న పనుంది.

నాతో వస్తావా?" అంది తనే.

"అలాగే."

"రా."

ఆమెను అనుసరించాను. మేడ వేపు నడిచి మెట్లెక్కాము. అంతసేపూ మా మధ్య నిశ్శబ్దం.

తన గదిలోనికి దోవ తీసింది. కుర్చీ చూపిస్తూ నన్ను కూర్చోమంది. కూర్చున్నాను.

"బావా, నాకొకసహాయం చేస్తావా?"

"చేస్తాను."

"ఎటువంటి దైనానా?"

ఆలోచనలో పడ్డాను.

"అదేమిటో చెప్పు. చేస్తాను."

"నిన్నూ, నన్నూ పెళ్ళిపీటల మీద కూర్చోబెట్టాలని అమ్మా, నాన్నా, తాపత్రయపడుతున్నారు. నీ మీద అభిమానమూ, గౌరవమూ నాకున్నాయి బావా. కాని నిన్ను పెళ్ళి చేసుకోవడం నాకిష్టం లేదు. నేనీ మాట అంటే అమ్మా, నాన్నా ఒప్పుకోరు. ఈ పెళ్ళి నీకే ఇష్టం లేనట్టు నువ్వు చెప్పాలి బావా..."

"అంతేనా?" అంటూ లేచాను.

"అవును బావా, ఏమంటావ్ ?

"అలాగేనంటాను."

"థాంక్స్ బావా. మెనీ మెనీ థాంక్స్"

మారు మాట్లాడకుండా గది బైటికి నడిచాను. చుట్టూ అంత మంది జనం ఉన్నా ఏకాకిలా ఫీలయ్యాను.

'సుజాతకి నాలో ఏం లోపం కనిపించింది? నన్ను చేసుకోవడం ఆమెకు ఎందుకు ఇష్టం లేదు?' ఇటువంటి ప్రశ్నలేమీ అప్పుడు నన్ను వేధించలేదు. నన్ను బాధించలేదు. ఎవరి కారణాలు వారివి.

* * *

కాలం గడుస్తున్న కొద్దీ నా మానసిక క్షోభ మరింత ఎక్కువ కాసాగింది. అదే వూళ్ళో ఉంటూ, ప్రతిరోజూ ఆ పరిసరాలను చూస్తూ బతకడం దుస్సాధ్యమనిపించింది.

అందుకే ఒకానొక శుభముహూర్తంలో ఉద్యోగానికి రాజీనామా చేశాను. ఆ వూరు వదిలి పెట్టాను. నాగరత్నానికి నేనెంత ద్రోహం చేశానో నాకప్పుడే తెలిసి వచ్చింది. ఆమె ఎంత క్షోభ పడి ఉంటుందో నేనప్పుడే గ్రహించగలిగాను. మానసికంగా నేను చచ్చిపోయింది అప్పుడే. ఊరూరూ తిరుగుతూ, కనిపించిన వారిలో నాగరత్నం పోలికలు వెదుక్కునే ఉన్మాదావస్థ నన్ను ఆవరించింది అప్పుడే. ఆ తరువాతే మద్రాస్ వచ్చేశాను.



## 16

ఈ మధ్య నేనెప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉంటున్నానట. పరధ్యానంగా ఉంటున్నానట. చాలామంది ఆ విషయం చెప్తూ ఉంటారు. ఒకోసారి వింత జంతువుని చూసినట్టు చూస్తారు. నాకు వినబడి

వినబడనట్టు ఏవేవో గుసగుస లాడు కుంటారు. వాళ్ళని చూసి నాలో నేనే నవ్వుకొంటాను.

నేనెవర్ని? నేనెవరినో వాళ్ళకేం తెలుసు?

నేనొక జర్నలిస్టుని, నిరంతర పరిశీలన నా ధ్యేయం. నా భుజాన ఎప్పుడూ వేలాడే పెంటాక్స్ కెమెరా లెన్స్ అందాల సినీతారనూ, రోడ్డుపక్క కుళ్ళు కాలవగట్టున ఎంగిలాకుల కోసం వెంపరలాడే బిచ్చగత్తెనూ ఒకేలా చూస్తుంది. దానికి కళా స్వరూపం కావాలి తప్ప వర్గ విభేదం అక్కరలేదు. మానవత అంచుల్ని దర్శించడమే దాని ధ్యేయం.

నారాయణగూడా సెంటర్లో ఆగి చుట్టూ చూశాను. మధ్యాహ్నం రెండు గంటల సమయం కావడం మూలాన రోడ్డు మీద జన సమ్మర్దం అట్టే లేదు. మోటారు వాహనాల సందడికూడా అంతగా లేదు. ఎందుకో దాహం వేసినట్టనిపించింది. దగ్గర్లో వున్న బార్‌లోకి నడిచాను, ఇది నాకు కొత్తగా అబ్బిన అలవాటు. అడుగు పెట్టగానే అదో వాసన నా ముక్కుపుటాల్ని ఉక్కిరిబిక్కిరి చేసింది. నెమ్మదిగా మెట్లెక్కి బాల్కనీలో వున్న కుర్చీలో కూర్చున్నాను. నెల ఆఖరి రోజులూ, వేళకాని వేళా కావడం మూలాని బార్ కూడా నిర్మానుష్యంగా వుంది. కూర్చున్న పావు. గంటకి తక్కుతూ తారుతూ ముసలి బేరర్ వచ్చాడు. చప్పుడు చేస్తూ పెద్ద గాజు గ్లాసు నా ముందుపెట్టి 'ఏం కావాలన్నట్టు' విసుగ్గా చూశాడు. నేను అంతకన్నా విసుగ్గా చూసి "బ్లాక్ లేబిల్ బీర్" అన్నాను.

ఓ పక్క ప్రపంచం మునిగిపోతున్నా ఈ మనుషులింత మందకొడిగా ఎందుకు ప్రవర్తిస్తారో నాకు అర్థంకాదు. అందుకే కాబోలు ఈదేశం ఇలా అఘోరిస్తోంది.

బీర్ రాగానే గ్లాసులోకి వంపుకొని మెల్లిగా సిప్ చేయసాగేను. మళ్ళీ ఆలోచనలు నన్ను చుట్టుముట్ట సాగేయి.

ఓ చింకి సినిమా పత్రికలో చిన్న సబ్ ఎడిటర్‌ని ఇప్పుడు...

ఎంతసేపూ ప్రూఫ్ రీడింగ్, పేజీ మేకప్పుల్తోనే సరిపోతున్నాది. ఆ సంపాదకుడు గారు నా చేత ఒక్క అక్షరం ముక్క కూడా రాయనివ్వటం లేదు, ఏం కొంప ముంచుతాననో ఆ భయం! చివరికి ఎలాగయితేనేం ఇవాళ చిన్న 'ఇంటర్వ్యూ' ఒకటి చేసుకు రమ్మన్నాడు. బొంబాయి నుంచి ఓ ప్రఖ్యాత సినిమాతార షూటింగ్ నిమిత్తం హైదరాబాద్ వచ్చింది. ప్రస్తుతం 'బ్లూమూన్' హోటల్లో బస చేసి వుంది. ఇంటర్వ్యూ చేసే ముందు ఆమె గురించి తెలుసుకోవల్సినవన్నీ తెలుసుకున్నాను. ఉదయం ఏడు గంటలకి రమ్మంది. వెళ్ళాను. బిజీగా వున్నాను—పన్నెండు గంటలకి రమ్మంది. ఓకే అన్నాను. పన్నెండుకి వెళ్ళేను. మేకప్ కాలేదు. సాయంత్రం అయిదుకి రమ్మంది...విసుగొచ్చి వెనక్కి వచ్చేశాను. ఉదయం నుంచీ తిండిలేదు. తిప్పలు లేవు. ఇదిగో ఈ బీరు నీళ్ళే!

బాటిల్ ఖాళీ చేసి బయట పడ్డాను.

సాయంకాలం అయిదవడానికి ఇంకా రెండున్నర గంటల టైముంది. అంత వరకూ ఏం చెయ్యడం?

పత్రికలో చేరి ఏడాది అయింది. ఇంతవరకూ మా ఎడిటర్ గారికి నా శక్తిసామర్థ్యాలు చూపించే అవకాశం రాలేదు. ఇప్పుడొచ్చింది. వచ్చిన అవకాశం కాస్తా-వాయిదాల్లో నానిపోతూంది. నా బ్రతుకెప్పుడూ అంతే! అవకాశం కోసం కళ్ళలో ఒత్తులు పెట్టుకొని కాచుకొని కూర్చోవడం. తీరా వచ్చాక, ఏ గాలో వానో వచ్చి కథే లేదు పొమ్మనడం!

బడబడలాడ్తూ సికింద్రాబాద్ స్టేషన్ వెళ్ళే బస్సొచ్చి నా ఎదర నిలబడింది. మరో ఆలోచన లేకుండా చటుక్కున బస్సు ఎక్కేశాను. అదృష్టవశాత్తూ సీటు దొరికింది. సికింద్రాబాద్ స్టేషన్లో రా మ మో హ న్ కనిపిస్తాడేమో—డ్యూటీలో కాసేపు బాతాఖానీ కొట్టి— అట్నించి సరాసరి 'బ్లూ మూన్' కి వెళ్ళవచ్చు.

నా ఆలోచనల్లో నాకు తెలీకుండానే బస్సు చిక్కడపల్లి, ముషీరాబాద్‌లు దాటిపోయింది. మరికాసేపటికి సికింద్రాబాద్ స్టేషన్ ముందు బస్సు ఆగింది.

దిగాను. చుట్టూ ఎటు చూసినా జనం. తొందర. పరుగులు. ఉరుకులు.

నింపాదిగా స్టేషన్‌లోకి నడిచాను. ఎంక్వయిరీస్ కౌంటర్ దగ్గరకు వెళ్ళి నిలబడ్డాను. రామమోహన్ లేడు. కౌంటర్ అవతల వున్న వ్యక్తి నన్ను గుర్తు పట్టాడు.

"రామమోహన్‌కి ఇవాళ ఆఫ్... మీకు తెలీదా సార్!" అన్నాడు.

తల ఊపి వీలర్ బుక్ స్టాల్ వేపు నడిచాను. అద్దాల షో కేసులో అందంగా పేర్చిన పుస్తకాల్ని చూడసాగేను. పి.జి. ఓడ్ హౌస్, స్టేన్లీ గార్డ్‌నర్, ఛేజ్, జేమ్స్ జాయిస్, డి. హెచ్. లారెన్స్, సోమర్సెట్ మామ్, అల్బర్ట్ మొరేవియా, యూజీసీ ఓ నీల్, ఆల్డస్ హక్స్లీ, డామ్ మొరేస్, షష్టిబ్రత, కె.ఏ..వాట్స్ చూస్తూంటే గాడిదల్నీ గుర్రాల్నీ ఒకే గాట కట్టినట్టన్పించి నాలో నేనే నవ్వుకున్నాను. అంతలో నా కళ్ళకి ఏదో ఆకృతి కనిపించింది. సూటిగా చూడడం సభ్యత కాదనిపించి, ఓ ర గా చూశాను.

వీలర్ షాప్‌కి కాస్తంత దూరంలో ఓ అమ్మాయి నిలబడి ఉంది. ఉండి ఉండి నా వేపే సూటిగా చూ స్తో ం ది. ఆ అమ్మాయి వయస్సు మహ అయితే ఇరవై లోపే ఉంటుంద. ఆకాశం రంగు చీర. చీర మీద బంగారం రంగులో ఏదో ఆకర్షణీయమైన ఎంబ్రాయిడరీ. అదే రంగు జాకెట్. ఖరీదైన చెప్పులు. చేతిలో చిన్న హేండ్ బేగ్, పక్కనే ప్లాట్‌ఫామ్ మీ ద చిన్న సూట్‌కేస్ ఉంది.

మనిషి కొంచెం చామన ఛాయలో ఉంది. నలుపు అనడానికి నాకు మనస్కరించడం లేదు. ముఖంలో ఏదో మెరుపు ఉంది. ఆ కళ్ళలో అద్భుతమైన ఆకర్షణ. ఆమె ఎవరై ఉంటుంది.

నలుపు రంగు నాగరత్నంలా ఉంది!

మామ్ రాసిన 'కేక్స్ ఎండ్ ఏల్' పుస్తకం కొన్నాను. జేమ్స్ జాయిస్ 'బోయ్స్ ఎండ్ గర్ల్స్ టుగెదర్' పుస్తకాన్ని తిరగేస్తూ మళ్ళీ ఆమె వేపు చూశాను. ఆశ్చర్యం— ఆమె నన్నే—సూటిగా...చాలా సూటిగా చూస్తోంది... నా శరీరం అంతా ఒక్కసారి రోమాంచితం అయింది. మస్తిష్కంలోని పొరలు రెపరెప లాడసాగాయి. ఆమెను ఎక్కడో చూశాను. సన్నిహితంగా ఆమెతో కాలక్షేపం చేశాను. ఎక్కడ ? ఎక్కడ ?? ఎప్పుడు??

కొన్న పుస్తకాన్ని చంకలో పెట్టి సిగరెట్ వెలిగించాను. మళ్లీ ఆమెనే చూశాను. అంతవరకూ ఎటో చూస్తున్న ఆ యువతి సరిగ్గా అదే క్షణాన నన్ను చూసింది. అలా మా కళ్లు రెండు నిమిషాలపాటు కలుసుకున్నాయి...అంతలో ఇంటర్వ్యూ సంగతి గుర్తుకొచ్చింది. ఎంక్వయిరీస్ కౌంటర్ దగ్గరికి వెళ్ళి 'బ్లూమూన్'కి టెలిఫోన్ చేశాను.

'అమ్మగారింకా బిజీగా ఉన్నారు రాత్రి పది గంటలకు రండి!' —అదీ సమాధానం సారాంశం.

నాకు ఆ క్షణంలో రిసీవర్ని నేలకేసి కొట్టాలనిపించింది. రామమోహన్ ఫ్రెండ్ కి థాంక్స్ చెప్పి మళ్ళీ ప్లాట్ ఫాం మీదికి నడిచాను.

ఆ నల్లని కలువ ఇంకా అక్కడే ఉంది. పాపం, ఎంత సేపటినుంచీ నిలబడి ఉందో!

ధైర్యం చేసి దగ్గరికి వెళ్లాను. పలకరింపుగా నవ్వింది. నాకు కొండంత ధైర్యం వచ్చింది.

"మీతో మాట్లాడాలి...అలా కేంటీన్ వేపు వెళ్దాం. వస్తారా?" అన్నాను.

ఆమె ఏమీ మాట్లాడలేదు. మౌనంగానే తన అంగీకారం వెలిబుచ్చింది. క్రిందనున్న సూట్ కేసును అందుకొని కేంటీన్ వేపు నడక ప్రారంభించేను. ఆమె నన్ను అనుసరించింది.

ఇద్దరం ఫేన్ క్రింద కూర్చున్నాం. రెండు కాఫీలు చెప్పి వెనక్కి చేరబడ్డాను. ఆమె కళ్ళు ఇంకా నన్నే పరిశోధిస్తున్నాయి. నన్నే చూస్తున్నాయి. నాలో ఏవేవో వెదుకుతున్నాయి.

"మిమ్మల్ని ఎక్కడో చూసినట్టుంది..." అన్నాను.

"నాకూ అలాగే ఉంది."

"మీ పేరు ?"

"రాణి"

"నా పేరు గోపీనాథ్. జర్నలిస్టుని— మీదీ ఊరేనా ?"

"కాదు. మాది కృష్ణాజిల్లా."

"అక్కడేం చేస్తారు మీరు?"

"బీ. యస్సీ అయిపోయింది. ఇంటర్వ్యూ కాల్ వస్తే ఈ వూరొచ్చేను."

"ఉద్యోగం దొరకలేదా ?" అనడిగాను.

నావేపు చూసి పేలవంగా నవ్వింది. పైటని నిండుగా భుజాల చుట్టూ కప్పుకొన్నది. నేనేం చూడలేదే—చూశానా-- ? కంగారుగా మరోవేపు నా దృష్టి మరల్చాను.

నా గుండెలో ఏదో గుబగుబలాడ్తోంది.

ఎంతో ఆరాటం, ఆవేదనా కలుగుతు న్నాయి. నా ఎదురుగా ఉన్న ఈయువతి నాకు బాగా తెలుసు ... ఎంతో కాలంగా తెలుసు... జ్ఞాపకాల అట్టడుగున, పొరల క్రింద ఇన్నాళ్లూ ఉండిపోయింది. ఇప్పుడే— మంచు విడిన కాంచనగంగా శిఖరంలా– అపురూపంగా నా ఎదుట ప్రత్యక్షమయింది ...!

"మీరు ఇప్పుడే మీ ఊరికి వెళ్ళి తీరాలా?" అన్నాను. ఆ ప్రశ్నలో వెళ్ళొద్దనే నా ప్రార్థన ఆమెకు విన్పించేలా అన్నాను.

చిర్నవ్వ నన్ను చూసింది. "ఉండి మాత్రం చేసేదేముంది ?" అంది.

"పోనీ—ఇవాళ ఉండి పోండి. రేపు వెళ్లుదురుగాని ..." అన్నాను.

నన్నింకా చూస్తోనే ఉంది.

"ప్లీజ్" అన్నాను.

"సరే" అంది రాణి.



# 17

సికిందరాబాద్ స్టేషన్‌కి దగ్గర్లోనే చిన్న లాడ్జింగ్‌హౌస్ ఉంది. దాని ప్రొప్రయిటర్ నాకు బాగానే తెలుసు. ఎన్నో సార్లు ఆ హోటల్‌ని నా కోసం–నా కోసం వచ్చేవారి కోసం 'రేండివూ' గా వాడుకున్నాను. మేడ మీది ఆ మూల గది నా ఫేవరిట్. నా అదృష్టమో ఏమో గాని నేనెప్పుడు వెళ్ళినా ఆ రూమ్ ఖాళీ గానే ఉంటుంది.

ఈ సారి కూడా మేం వెళ్ళేటప్పటికి ఆ రూమ్ ఖాళీగానే వుంది. నవ్వుతూ రూమ్ తాళం చెవిని నాకు ఇచ్చాడు హోటల్ మేనేజర్. ఇద్దరం మెట్లెక్కి–చివర్నున్న ఆ గదిని సమీపించాం.

"ఇదేమిటి ? హోటల్‌కి తీసుకొచ్చారు ?" అంది రాణి నేను తాళం తీస్తూ ఉంటే.

"ఏం భయంగా వుందా ?" అన్నాను తలుపులు తీసి లోపల లైటు వేస్తూ.

రాణి సమాధానం ఇవ్వలేదు. నన్ను చూస్తూ గది బైటే వుండిపోయింది.

"మిమ్మల్ని నేనేం రేప్ చెయ్యను. గొంతు నులిమి చంపి, రేప్ చేసేంత మానసిక బలహీనుడినీ కాదు. నన్ను చూస్తే అలా అనిపిస్తోందా ?" అన్నాను నవ్వుతూ. నేనెలా నవ్వుతానో నాకు తెలుసు. ఆ నవ్వు ఎదుటి వారి మీద ఎలా పని చేస్తుందో కూడా నాకు తెలుసు.

రాణి మౌనంగా గదిలోకి వచ్చి కూర్చుంది. అమ్మయ్య–అనుకొని ఫేన్ వేశాను. ఈలోగా బాయ్ వచ్చి మంచం మీద వున్న దుప్పటి మార్చాడు. కూజాతో మంచినీళ్ళు పట్టుకొచ్చాడు. "ఏదయినా కావాలంటే బెల్ నొక్కండి సాబ్" అని వెళ్ళిపోయాడు.

అంతవరకూ మాటా పలుకూ లేకుండానే కూర్చుంది రాణి. ఆమెనే తదేకంగా నేను చూడసాగేను. చూపుడు వేలుకు

వున్న ఉంగరాన్ని చిటికెన వేలుకు తొడిగింది. కాస్సేపాగి ఆ ఉంగరాన్ని తీసి మళ్ళీ ఉంగరం వేలుకు తొడిగింది.

"స్నానం చెయ్యరాదూ.. ఫ్రెష్‌గా వుంటుంది...!" అన్నాను.

'నిజమే సుమా !' అన్నట్టు చూసించి ఆమె.

చటుక్కున లేచి తన సూట్ కేస్ తెరచింది. ఒక చీరా జాకెట్టూ సోప్ బాక్స్ టవల్ తీసుకొని బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది. నన్నొక సారి చూసి తలుపు దగ్గరగా వేసుకుంది. ఎంచేతో గడియ మాత్రం పెట్టుకోలేదు.

చప్పుడు... నీళ్ళ చప్పుడు... నును పైన రాణి ఒంటి మీదనుంచి జారి నేల మీద పడ్తోన్న నీటి బిందువులచప్పుడు..

ఆ చప్పుడు నాకు ఏవేవో జ్ఞాపకం తెస్తున్నది... నన్ను ఎన్నో సంవత్స రాల వెనక్కు తరుముతున్నది...

బాత్ రూమ్‌లో ఇంకా నీళ్ళచప్పుడు విన్పిస్తోనే వుంది. సిగరెట్ వెలిగించి గుండెల నిండా పొగ పీల్చి వదిలాను. ఇప్పుడు మనస్సెంతో తేలిగ్గా వుంది. వలయాలు వలయాలుగా సాగుతున్న సిగరెట్ పొగనిచూస్తూ రాణినిఊహించు కోసాగేను. స్నానం చేసి ఇంకా బైటకి రాదేం రాణి ?

* * *

నాకు ఎంచేతో ఉన్నట్టుండి రక రకాల కలలు వస్తాయి. రాత్రిళ్ళు కాదు పగలు...! నిద్దట్లో కాదు; మేలుకొని వుండే కలలు కంటూ వుంటాను.

కలకత్తాలో బే ఆఫ్ బెంగాల్ మీంచి నడిచి శ్రీలంకకి చేరి హిందూమహ సముద్రంమీద పరుగెత్తి అరేబియన్ సీని చేరి గోవాలో కాలెడ్తానుట. హఠా త్తుగా ఆకాశంలోకి ఎగిరి ఢిల్లీ చేరుతాను. పార్లమెంటు భవనం మీద కూర్చుని చుట్టూ వున్న జన సమ్మర్దాన్నీ, వాహ నాల రాక పోకలనూ గమనిస్తాను.

మరో కలలో-ఎలిజబెత్ టేలర్‌ని రకరకాల కోణాల్లో నా పెంటాక్స్ కెమెరాతో ఫొటోగ్రాఫ్ చేస్తానుట. అం దులో ఒక ఫొటో 'లిజ్'కి ఎంతో నచ్చు తుందిట. తనను అంత అందంగా ఫొటో గ్రాఫ్ చేసినందుకు ఆనందం పట్టలేక 'స్వీట్ బోయ్ నాథూ!' అంటూ నా బుగ్గల మీద...! నా ఒళ్ళు గర్వంతో వేడిక్కిపోతుంది. మనోహరంగా కరిగి పోతాను. అలాగే సోఫియాలోరిన్‌ని, ఆడ్రీ హెప్‌బర్న్‌ని, సాండ్రా డీనీ ఫొటో గ్రాఫ్ చేస్తానుట. 'లైఫ్' వాళ్ళు నాకలర్ ట్రాన్స్పరెన్సీలకోసం ఎగబడుతూ వుంటార్ట. ఫోర్ గ్రౌండ్‌లో వాళ్ళూ-బేక్ గ్రౌండ్‌లో నేనూ-మధ్యను డాలర్లు పౌండ్లు...రూపాయలు ... చెల్లాచెదురుగా పడి వుంటాయిట...అంతలో ఫేడౌట్ కల కరిగి పోతుంది.

ఒకోసారి-తియ్యని కలలు రావు. భయంకరమైన కలలువస్తాయి. ఎంత భయంకరమైన కలలంటే 'అవి నిజ మైన సంఘటనలేమో!' అని నేనే గుండెలు బాదుకొనేంత భయంకరమైన కలలవి !

* * *

"ఏమిటంత దీర్ఘంగా ఆలోచిస్తు న్నారు?"

తలెత్తి చూశాను.

రాణి....

అప్పుడే స్నానం చేసి వచ్చిన రాణి మంచులో తడసిన నల్ల కలువలా, మంచు కప్పని కాంచనగంగా శిఖరంలా — స్వచ్ఛంగా ఉంది. నవ్వుతూ నన్ను చూస్తోంది.

"అబ్బే ఆలోచనా లేదు, పాడూ లేదు."

"అయితే కలలు కంటున్నారా?"

ఉలిక్కి పడ్డాను.

నన్ను చూసి రాణి చిలిపిగా నవ్వుతూంది.

నేనూ నవ్వాను.



## 18

రాణి ఫేన్ గాలికి జుత్తు ఆరపెడుతోంది. నల్లని ఒత్తయిన జుత్తు. పిరుదుల మీద పడుతూన్న జుత్తు చాలా మట్టుకి ఆరిపోయింది. ఆరిపోయిన జుత్తు గాలికి పిచ్చిపిచ్చిగా కదులుతూంది.

నాకు కాంచనగంగ గుర్తుకి వచ్చింది. కాంచనగంగా శిఖరం అల్లంత దూరంలో మన పక్కనే ఉన్నట్లు ఉంటుంది. కాని కంటికి కనిపించదు. దట్టమైన మంచుతో, మేఘాల్తో కప్పబడి ఉంటుంది. ఎప్పుడో గాని ఆ మంచు కరగదు. ఎంత సేపటికో గాని ఆ మేఘాలు కదలవు. అదిగో— సరిగ్గా అదే సమయంలో— ప్రియురాలి చల్లని చిరునవ్వులా, వేసవి సాయంత్రం వీచే గాలిలా— కాసేపు... కాసేపే తన ఉనికిని గుర్తు చేస్తుంది. మళ్ళీ మంచుతెరలు కప్పుకొని ముగ్ధలా మాయమైపోతుంది.

రాణి కూడా అంతే. దగ్గర్లో ఉంది, చేయి చాస్తే సరి ఆమెను అందుకోగలను. నా కౌగిలిలోకి లాక్కోగలను. కానీ— మంచుతెరలూ, మేఘాల నీలిముసుగూ కప్పుకొన్న కాంచనగంగా శిఖరంలా— రాణి ఇప్పటికి నాకు అగమ్యంగా కనిపిస్తోంది.

ఎవరామె ? ఆమెకూ నాకూ ఏం సంబంధం! పిలవగానే నా వెనకే చక్కా ఎందుకు వచ్చింది? ఆమె మామూలు ఆడదేనా? అయిదుకీ, పదికీ కక్కుర్తి పడే బాపతా? అలా అన్పించదే !

రకరకాల ఆలోచనల్తో ఆమెను తదేకంగా చూస్తూ కూర్చున్నాను. కళ్ళకు కాటుక పెట్టుకొని, కాటుక అంటిన వేలిని తువాల్తో తుడుచుకుంది రాణి ... అంతలో తటాలున నా వేపు చూసింది. అంత తక్కువ వ్యవధిలో దృష్టి మరల్చుకోవడం నాకు సాధ్యం కాలేదు

"ఏమిటలా చూస్తున్నారు?" అంది నవ్వుతూ 'అలా' అన్నప్పుడు 'లా' ని దీర్ఘంగా తమాషాగా పలికిస్తూ.

"ఎలా చూస్తున్నాను?"

"ఎలాగా ?" అంటూ మునిపళ్ళతో కింది పెదిమను నొక్కిపట్టి కాసేపు ఆలోచన నటించింది. "కొరుక్కుని

తినేసేలా—"అంది చివరికి.

"కేనిబాలిజం అంటారు దాన్ని. స్వజాతి జీవాలను చంపి తినడం కేనిబాల్స్ లక్షణం. ఇప్పటికీ కొన్ని పక్షులూ, పాములూ, చేపలూ, కొన్ని క్రూర జంతువులూ ఆ పనే చేస్తున్నాయి. మనుషులు చాలా కాలం కిందట ఆ ప్రకారంగా ప్రవర్తించేవారు. ఇప్పుడు కూడా అక్కడక్కడా ఒకటీ అరా కేసులు బయట పడ్తున్నాయి ..."

"మీరు ఇంతకు పూర్వం స్కూల్లో టీచర్‌గా గానీ, లెక్చరర్ గానీ పని చేసే వారేమిటి."

"ఏం ఉపన్యాసాలిస్తున్నాననా ?"

"ఇంతకీ ..."

"వస్తాను. మిమ్మల్ని కొరుక్కు తినడం నాకు ఇష్టం లేదు. దానిని శాస్త్రజ్ఞులు 'నీక్రోఫిలియా' వ్యాధి అనంటారు. ఆ వ్యాధిగ్రస్తుడిని డాక్టర్లు ఇంతవరకూ ఒకే ఒక్కడిని పట్టుకొన్నారు. అదీ ఈ దేశంలో కాదు; అమెరికాలో!"

"అసలింతకీ ..."

"వస్తున్నానొస్తున్నాను. మిమ్మల్ని నేను కొరుక్కు తినేలా చూడ్డం లేదు. మీ గురించి తీవ్రంగా ఆలోచిస్తూ చూస్తున్నాను. అంతే" అన్నాను.

"మొత్తానికి పత్రికా రచయితనని పించుకున్నారు!"

"పొరపాటు: అవకాశం ఇవ్వాలేగాని ఇంకా చాలా చాలా అనిపించుకుంటాను."

"ఐ సీ, ఏ మేం అన్పించుకొంటారు...చెప్పండి?"

"మంచి ఈతగాడిని. ఫొటోగ్రాఫర్ని. కాబోయే గొప్ప రచయితని. గొప్ప మానవతావాదిని. ఇంకా గొప్ప ప్రేమికుడిని...చాలా ఈ లిస్టు ?"

"మైగాడ్,..! చాలు ఇంతకీ ఇప్పటికి ఎంతమందిని ప్రేమించారు ?"అంది రాణి.

"అక్కడే పప్పులో కాలేస్తున్నారు. నేను మొదటే అన్నాను. అవకాశం ఇవ్వాలేగాని...ఇస్తేనే...ఏమైనానూ"

మనోహరంగా నవ్వింది రాణి. తెల్లని పళ్ళు తళతళ మెరిశాయి. అంతలోనే పెదిమల్తో వాటిని మూసేసింది. ఎక్కడ ఆ మల్లెలు పొగచూరి, మలినమై పాడౌతాయోనని భయం కాబోలు. అంతవరకూ, స్నానం చేసి వచ్చిన రాణిని అంత పరీక్షగా చూడలేదు నేను. బంగారం రంగు పూలు అంచున ఉన్న తెల్లని సిల్కు చీర కట్టింది. గులాబీ రంగు జాకెట్టు. మెడలో ఒంటి పేట బంగారం గొలుసు. మంచు రంగులో మెరుస్తోన్న నుదుటి మీద బొట్టు. కుడి చేతికి రెండు బంగారు గాజులు. ఎడమ చేతికి రిస్టువాచ్. ఆమెను చూస్తూ ఉంటే ఏ శృంగార నవలలోంచో నడచి వచ్చిన కథానాయికలా ఉంది కాని, రాత్రి కాబోతూన్న వేళ, గోపీ అనబడే గోపీనాథ్‌కి, సికిందరాబాద్ స్టేషన్‌లో హఠాత్తుగా తారసపడిన అమ్మాయిలా అనిపించడం లేదు.

"అంటే నేను మీకు అవకాశం ఇవ్వాలంటారు ?" గంభీరత నటిస్తూ, లోలోపలి నవ్వుని అణుచు కుంటూ ప్రశ్నించింది.

"ఇవ్వడం ఇవ్వక పోవడం అనేది మీ ఇష్టం. ఈ విషయంలో నేను మిమ్మల్నేం బలవంతం చెయ్యను." అన్నాను అంతే సీరియస్‌గా.

నా మాట విని కంటి చివర్లతోనే చిన్నగా నవ్వింది రాణి.

కుర్చీలో కూర్చొన్న నా దగ్గరికి వచ్చి, నా మెడ చుట్టూ చేతులు వేసింది. మెల్లిగా లేవనెత్త బోయింది. ఆమె ప్రయత్నం అవసరం లేకుండానే నేనే లేచాను. ఆమె నడుం చుట్టూ చేతులు వేసి దగ్గరగా లాక్కున్నాను. రాణి మౌనంగా నా ఛాతీ మీద తల ఆన్చింది. అంతవరకూ ఆమెలో ఉన్న చిలిపితనం పోయింది. ప్రౌఢలా, ఆరితేరిన నెరజాణలా నన్ను బల్లిలా హత్తుకు పోయింది. నా ఛాతీ మీద ఆమె చెంపల మెత్తదనం. ఆమె వక్షఃస్థలపు మెత్తదనం. అనుకోకుండా అయాచితంగా లభించిన ఈ మృదు స్పర్శలలో నా మస్తిష్కం కొన్ని క్షణాల పాటు ఆనందంగా మూర్ఛిల్లింది.

ఈ పరిస్థితి కలా నిజమా అన్న మీమాంసలో నా మనస్సు కొట్టుకో సాగింది. కలే అయితే ఎంత దురదృష్టం ! నిజమే అయితే ఎంత అదృష్టం ! నన్ను నేను గిల్లుకోవాలని చూశాను కాని. ఆమె పిరుదుల్నీ, వీపునీ నిమురుతూన్న నాచేతులు సమ్మెచేశాయి. నా స్వాధీనంలో లేకుండా పోయాయి.

అంతలో తటాలున నన్ను దూరంగా తోసేసి—ఒక్క అంగలో నడిచి మంచం మీద కూర్చుంది. ఆశ్చర్యంగా చూశాను. బరువుగా శ్వాస పీలుస్తూ పైట చెంగుతో మోహం తుడుచుకొంది రాణి

"అరె...ఏమైంది రాణీ ?" అన్నానే గాని నా గొంతులోని కంపనం నాకు స్పష్టంగా తెలుస్తోంది. ఆమెను మొట్ట మొదటి సారిగా'రాణీ'అని ఏకవచనంలో పిలిచాను.

"ఏమీ లేదు." అంటూ బలహీనంగా నవ్వింది.

తన హేండ్ బేగ్ తీసి దేనికోసమో వెదకడం ప్రారంభించింది...ఆశించింది దొరకలేదు కాబోలు, విసుగ్గా బేగ్‌లోని వస్తువులన్నీ తీసి మంచం మీద పడేసింది. ఏవో ఉత్తరాలు, మూడు వంద రూపాయల నోట్లు, జడపిన్నులు, చిన్న చేరుమాలు. వాటిని చూసి ఉస్సురంటూ నిట్టూర్చింది.

"ఏం కావాలి ?" అన్నాను,

"టేబ్లెట్స్ కన్పించడం లేదు." అంది రాణి నీరసంగా.

"ఏం టేబ్లెట్లు ?"

"డోరిడెన్"

అది వినగానే గతుక్కుమన్నాను.

ఇదివరలో నేను చాలాసార్లు వాటిని వేసు కొన్నాను. డాక్టర్ ప్రిస్క్రిప్షన్ లేందే అవి బజార్లో ఇవ్వరు. వాటిని 'ట్రాంక్విలైజర్స్' అంటారు.దాన్ని ఎవరు పడితే వారు . వేసుకోకూడదు. రాణికి వాటితో ఏం అవసరం ? ఆ మాటే అడిగానామెని.

పేలవంగా నవ్వింది.

"...కూడా జంతువులుండే ఈలోకంలో [illegible] వాళ్ళు బ్రతకడమే శాపమైతే ఏం చెయ్యమంటారు చెప్పండి? నేను ఆడదాన్ని...మీలా విస్కీ బ్రాందీలు తాగి బాధలు మర్చిపోలేను. అందుకే ఆ మాత్రలు. అవి వేసుకొన్నంతసేపూ నాకు మనస్సు తేలికపడిపోయిగా ఉంటుంది!'' అంది.

''కేవలం బాధలు మరిచి పోవడానికే విస్కీ బ్రాందీలు తాగుతారంటావా?'' అవి తాగితే ఎవరైనా బాధలు మరిచి పోగలరనా నీ ఉద్దేశ్యం?''

''నా అభిప్రాయం తప్పు కావొచ్చు, నేననుకొనేది అదే!''

''నీలాగే చాలామందికి ఆ భ్రమ ఉంటుంది. తాగిన కొద్దీ ఆ బాధల్ని మరిచిపోలేరు సరికదా, అవి మరింత ఎక్కువగా దుఃఖం కల్గిస్తాయి. మరీమితి మీరి తాగినవాడు—తనెంత అసమర్థుడో ఎంత బలహీనుడో తలుచుకొని వెక్కి వెక్కి ఏడుస్తాడు. ఇది నిజం...కావాలంటే ఎవర్నైనా అడుగు!''

''అయితే, మీరనేది ఏమిటి?''

ఈసారి రాణి కంఠం కొంచెం కటువుగా ఉంది. అంతకు ముందుండే మృదుత్వం లేదు. అసహజంగా ఉంది.

"డబ్బు మస్తుగా ఉన్నవాడికి తాగుడు ఒక పోజు... డబ్బు లేనివాడికి అదొక బలహీనత."

"ఏమో. మీరే రైటు కావొచ్చు ఇంతకీ. మీరు టేబ్లెట్స్ సంపాదించగలరా?" అంది అసహనంగా.

ఆమె నిస్సహాయతను చూసి నాకు జాలేసింది.

"తప్పదా?" అన్నాను.

"తప్పదు. అవి లేనిదే నేను ఒక్క క్షణం ఉండలేను."

"సరే—" అంటూ లేచాను.

"ఇదుగో... డబ్బు. తీసుకోండి" అంది.

"ఫర్వాలేదు. ఉండనీ" అంటూ నా కెమేరాని టేబిల్ మీద పెట్టి గుమ్మం వేపు నడిచాను. గది తలుపులు దగ్గరగా వేసి మెట్లమ్మట క్రిందికి దిగాను.



# 19

మళ్ళీ బస్సెక్కి నేను నారాయణగుడా చేరుకొనే సరికి ఏడు గంటలయింది. రాణి చెప్పిన మాత్రల కోసం చాలా మెడికల్ షాపులు తిరిగాను. కొంతమంది లేవన్నారు. కొంతమంది డాక్టర్ ప్రిస్క్రిప్షన్ కావాలన్నారు.

ఉదయం నుంచీ సరైన తిండి లేదు. మధ్యాహ్నం తాగిన బీరునీళ్ళు... తిన్న చుడువా ఎప్పుడో కడుపులో ఇంకిపోయాయి. ఏదైనా ఘనపదార్థం కడుపులో పడితేగానీ నిలవలేని స్థితికి వచ్చేశాను. పర్స్ చూసుకున్నాను. ఫర్వాలేదు. వందరూపాయల పైగానే ఉంది. ఇంకో పదిరోజులు వీటితో నెట్టితేచాలు. ఫస్టొస్తుంది. జీతమూ వస్తుంది.

'రా' అన్నట్టు 'రాజ్‌కమల్' బార్ నన్నే చూసింది. దాని ప్రార్థన మన్నించ డానికని అటునడిచాను. మేడమెట్లెక్కి నా ఫేవరిట్ కార్నర్లో కూర్చున్నాను.

బేరర్ రాగానే కావలసిన వాటికి ఆర్డర్ ఇచ్చాను.

మళ్ళీ ఆలోచనలు నన్ను చుట్టు ముట్టాయి.

ఏమిటి నేను చేస్తున్న పని ? అఫ్ కోర్స్,.. ఇప్పుడు తాగబోతున్నాను. అదికాదు. ఇంతకు ముందు నేను చేసిన పనేమిటి? రామమోహన్ కోసం సికింద రాబాద్ స్టేషన్‌కి వెళ్ళేను. లేదు. వెనక్కి వచ్చెయ్యకూడదూ ? వీలర్ బుక్‌షాప్‌కి ఎందుకి వెళ్ళాలి? ఆల్‌రైట్,, వెళ్ళేను. 'కేక్స్ అండ్ ఏల్' కొనుక్కొని అయినా వెనక్కి రావచ్చుగా. ప్లాట్‌ఫామ్ మీద నిలబడ్డ రాణిని ఎందుకు చూడాలి ? కాసేపు చూసి, నాగరత్నం పోలికలు ఆమెలో వెదుక్కొని, కళ్ళకు విందు చేసి అంతటితో సంతృప్తి పడొచ్చుగా... ఆమెను పలకరించి, ఆమె ప్రయాణం వాయిదా వేయించి, హోటల్లో రూమ్ తీసుకుని, అందులో ప్రవేశపెట్టాల్సిన అవసరం ఏమొచ్చింది? నా బాధలు నాకు న్నాయి. వాటితో అఘోరించక మళ్ళీ ఈ తద్దినం తలకి చుట్టుకోవడం ఎందు కూ? నాలోని ఆక్టొపస్ హస్తాలు చాస్తు న్నదా? నాగరత్నం కోసం వెతికి వేసారి పోయిన... నాలోని మృగం స్త్రీ స్పర్శ కావాలని కోరుతున్నదా ? ఆమె అందుకు అంగీకరించకపోతే...? అఫ్‌కోర్స్... ఆమె అందుకు సిద్ధపడే వచ్చిఉంటుంది. అయితే మాత్రం-- ఎందుకీ శ్రమ ?

రోడ్ల మీదా, పచ్చిక మైదానాల్లో తిరిగి, మేసే జంతువుల్ని చూసి నేనేం అనుకొనేవాడిని? నేనూ ఈ మానవాకారం వదలుకొని ఆ జంతువుల్లో ఒక జంతువు నైపోతే ఎంత బాగుణ్ణు!— అని ఎన్ని సార్లు అనుకోలేదు? అవి నిశ్చింతగా— దొరికిన మేతతో తృప్తి పడతాయి. భవిష్యత్తులో ఉపయోగార్థం (డబ్బులా) ఆహారాన్ని దాచుకోవాల్సిన అగత్యం వాటికి లేదు. ఒకర్ని చూసి ఒంగి సలాంలు చేయనక్కర్లేదు. భవిష్యత్తు గురించి వ్యాకులపాటూ, బెంగా పడ నక్కర్లేదు. ప్రేమించనక్కర్లేదు. ప్రేమించబడనక్కర్లేదు. ప్రేమ భగ్న మైతే హృదయం చావనక్కర్లేదు.

ఎలాంటి బెంగలూ, బాధలూ లేని మరణం కోసం నేనెంతగా అర్రులు చాస్తున్నానో నాకు తెలీదా ? తెలిసి తెలిసీ పరిచయాలు పెంచుకోవడం ఎందుకు? కొత్త బాధలు తలకి చుట్టు కోవడం ఎందుకు ?

నేను ఆర్డర్ చేసిన వస్తువులు వచ్చే శాయి. గ్లాసులోకి సీసాలోని బీర్‌ని జాగ్రత్తగా వంపేడు బేరర్. నా ముందు పెట్టి వెళ్ళిపోయాడు. పొంగుతూన్న నురగని చూస్తూ గ్లాసెత్తేను... ఇందాక తాగుడు గురించి రాణితో అన్నమాట గుర్తొచ్చింది.

నేను పోజు కొడ్తున్నానా ?

నేను బలహీనుడినా ?

నేనెవర్ని ?

రెండు గ్లాసులు బీర్ తాగేటప్పటికి

కొంత మనస్తిమితం లభించింది. సిగరెట్ వెలిగించి చుట్టూ చూశాను. చుట్టుపక్కల టేబిల్స్ దగ్గర అయిదారుగురు ఉన్నారు. అందులో ఒక మొహం బాగా పరిచయమైనదానిలా ఉంది... కన్పించింది. కళ్ళజోడు. వంపులు తిరిగిన మీసాలు. నోట్లో పైపూ... ఇంకెవరూ రాఘవయ్యా. అతను మెడికల్ రిప్రజెంటేటివ్. కథలూ కాకరకాయలూ రాస్తుంటాడు. ఫర్వాలేదు. 'డోరిడెన్' మాత్రలు ఇతని ద్వారా సంపాదించవచ్చన్న ధీమా కలిగింది నాకు.

నన్ను చూస్తూనే విష్ చేశాడు రాఘవయ్యా, నేనూ విష్ చేశాను.

నా టేబిల్ మీది బీర్ సీసా ఖాళీ అయిపోయింది. మరొకటి తెమ్మన్నాను. చకచక అదికూడా ఫినిష్ చేసేసి లేచి నిలబడ్డాను. రాఘవయ్యని పిలిచి సమస్య వివరించాను. రాణి గురించి మాత్రం ఏమీ చెప్పలేదు. అతను మొదట సందేహించి, తన లెటర్ పేడ్ లోంచి కాగితం చింపి ఏదో రాసి ఇచ్చాడు. ఫలానా మెడికల్ స్టోర్స్‌లో ఇది చూపిస్తే టేబ్లెట్స్ ఇస్తారన్నాడు. థాంక్స్ చెప్పి కిందికి దిగాను. కౌంటర్లో బిల్లు ఇచ్చేసి 'జిన్' చిన్నదొకటి కొనుక్కొని జేబులో పెట్టుకొన్నాను.

రాఘవయ్య చెప్పిన ఆ ఫలానా మెడికల్ షాపు పట్టుకోడానికి అరగంట పట్టింది. టేబ్లెట్స్ తీసుకొని మళ్ళీ తిరుగు మొహం పట్టేను.

హోటల్ గదిలో అడుగు పెట్టేసరికి రాత్రి తొమ్మిది దాటింది... నా అడుగుల చప్పుడుని వింటూనే రాణి ఆత్రుతగా లేచి నిలబడింది. "టేబ్లెట్స్ తెచ్చారా?" అంది.

టేబ్లెట్స్ ఇచ్చాను ఆమెను చూస్తూ కుర్చీలో కూలబడ్డాను. గబగబ రెండు మాత్రలు మింగి గ్లాసుడు మంచి నీళ్ల గడగడా తాగింది రాణి. నురో రెండు నిమిషాల్లో ఆమె మొహంలోకి ఎక్కడ లేని కళా వచ్చేసింది. మంచం మీద కూర్చొని, రెండు చేతులూ పరుపు మీద ఆనించి "నౌ అయాం ఆల్ రైట్" అంది నవ్వుతూ.

నేను లేచి గది తలుపులు దగ్గరగా లాగి లోపల గడియ పెట్టాను. ఆ క్షణంలో రాణి మొహంలో ఏమైనా రంగులు మార్తాయేమో చూద్దామనిపించింది. కాని, వెంటనే వెనక్కి తిరగలేదు. జేబులోని జిన్ సీసాని టేబిల్ మీద కెమెరా పక్కని పెట్టేను. నెమ్మదిగా మంచం వేపు నడిచి ఆమె పక్కనే కూర్చున్నాను. రాణి అభ్యంతరం చెప్పలేదు. సరిగదా, నాకు దూరంగా జరిగే ప్రయత్నమైనా చెయ్యలేదు. కుడిచేతిని ఆమె భుజం మీద వేసి ఆమె కళ్లలోకి చూశాను. నవ్వి నవ్వని పెదిమల్తో రాణి నా కళ్లలోకి చూసింది.

"ఇందాక. స్టేషన్లో రమ్మనగానే నా వెనక ఎందుకు వచ్చావు?" అడిగాను.

"మీ కళ్లు చూసి..."

"ఏముంది నా కళ్లలో?"

"ప్రపంచంలోని అమాయకత్వం అంతా ఉంది. లోకంలోని దుఃఖం అంతా ఉంది. పాడని తియ్యని పాటలు

తిన్నాయి."

"ఉంటే?"

"అవి చూసి నన్ను నేను నిగ్ర హించుకోలేక పోయాను. ఆ కళ్లు నన్ను ఎక్కడికి తీసుకుపోయినా పర్వాలేదని పించింది. అవి నన్ను మోసం చెయ్య వన్న నమ్మకం ఏర్పడింది...అందుకే అలా వచ్చేశాను...!" అందింకా నవ్వుతూనే.

"ఏమో...నేను దుర్మార్గుడినీ హంత కుడినీ కూడా కావొచ్చుగా. అయితే ఏం చేస్తావు?"

"నా నగలూ డబ్బూ లాక్కొని నన్ను తన్ని తగిలేస్తారు. అంతేగా. అంతకన్నా దుర్మార్గం మీరేం చెయ్య గలరు? అందుబాటులో ఉన్న ఆడదాన్ని హత్య చేసేంత అవివేకం మీలో ఉందను కోను"

రాణి మాటలు వింటూన్నకొద్దీ నా మనస్సు నా వశం తప్ప సాగింది. ఆ మాటల్ని బట్టి చూస్తే ఆమె పిచ్చి దానిలా కన్పించడం లేదు. చపకబారు స్త్రీలా అంతకన్నా లేదు. ఈమె వెనుక ఉన్న మిస్టరీ ఏమిటి? అంతు చూడండే ఏం తోచదు నాకు.

"నీకు తెలుసో తెలీదో—నేను హంత కుణ్ణి. ఇదివరకో హత్య చేశాను" అన్నాను గంభీరంగా.

"వెరీ గుడ్. మరొక హత్య చేయ డానికి మీకేం అభ్యంతరం ఉండదన కొంటాను." అంది నన్నింకా టీజ్ చెయ్యాలని.

"నవ్వుతాలు కాదు"

"నేనూ నవ్వుతాలుకి అనడం లేదు"

"సరేగాని నీ గురించి చెప్పు"

"అన్నట్టు మీరు రచయితను కొంటాను?"

"అవును"

"నా కథ రాస్తారా?"

రజని గుర్తుకొచ్చింది. రజని నన్ను తన కథ రాయవద్దంది. ప్రామిస్ చెయ్య మంది. ఐనా తన గురించి అంతా సగం సగం చెప్పింది.

"రాయలేను. కథలు రాసే ఓపిక నాకెప్పుడో చచ్చిపోయింది"

"అయితే నేను చెప్తాను వినండి" అంటూ మంచం మీద వెల్లకిలా పడు కొంది. నేను కూర్చున్న చోటనే అలాగే ఉండిపోయాను. సిగరెట్‌ని పెదిమల మధ్య బిగించి అగ్గిపుల్ల గీశాను.

"మాది విజయవాడ దగ్గర ఓ చిన్న పల్లెటూరు. నాకు ఇద్దరు అన్నయ్యలూ. ఒక అక్కా. మా అమ్మా నాన్నా నా చిన్నప్పుడే పోయారు. పెద్దన్నయ్యకీ, అక్కకీ పెళ్ళిళ్లు అయ్యాయి. నేను. నానా గోలాఅల్లరీ చేస్తే నన్నుబి.యస్సీ. దాకా చదివించాడు మా పెద్దన్నయ్య. అంతలో అనుకోని మార్పు వచ్చి మా అందరి జీవితాల్ని చిందర వందర చేసింది. ఎవరెవరు ఎక్కడెక్కడ ఉంటున్నారో తెలీని అయోమయంలో నేను విశాఖపట్నం నుంచి మా ఊరొ చ్చాను. అక్కడ నాకు మిగిలిన బంధువు మా చిన్నాన్న ఒక్కడే. మా పిన్ని చి మా కులం కాదు. చిన్నాన్న వర్ణాంతర వివాహం చేసుకున్నాడు.. నలుగురు ఆడ

పిల్లలతర్వాత ఇద్దరు మగపిల్లలు వాళ్లకి. మా చిన్నాన్న ఆదర్శవివాహంమూలంగా ఆడపిల్లలెవరికీ పెళ్ళిళ్ళు కాలేదు. దీనికి తోడు ఇంట్లో దరిద్రం. పైగా నేనొక్కర్తిని వాళ్ళ పీకల మీదికి...చిన్నాన్న పెద్దమ్మాయి ఈ బాధ భరించలేక ఆత్మహత్య చేసుకొంది. మరో అమ్మాయి ఎవరితోనో లేచిపోయింది. మిగతా జనాలు జీవచ్ఛవాల్లా—బైటికేనా రాకుండా మారు మూల గదుల్లో చీకట్లో కాలక్షేపం చేసేవారు... ఇహ నేను. నేను విజయవాడలో హాస్టల్లో ఉండి చదువుకుంటున్నాను. ఆ రోజుల్లో మా లెక్చరర్ ఒకాయన నా వెంట తెగ పడేవాడు. నేను కూడా అతనికి అవకాశం ఇచ్చాననే చెప్పాలి... మా పెళ్ళి గురించి పెద్దలు మాట్లాడే స్థితి వరకూ వచ్చింది వ్యవహారం. ఇంతలో వాళ్ళకి మా వంశ వ్యవహారాలు తెలిసినట్లుంది. అంతే. మరి అటునుంచి ఉలుకు పలుకూ లేదు. ఈలోగా ఆ లెక్చరర్‌గారు ట్రాన్స్‌ఫర్ అయి మరో ఊరు పోయాడు..."

రాణి కథ కాస్త ఆసక్తికరంగానే ఉంది. శ్రద్ధగా వినసాగేను. ఆమె కథ షరా మామూలే కథ అయినప్పటికీ— ఆమె చెప్పే తీరులో ఏదో ప్రత్యేకత ఉంది. ఆ కంఠంలోని విషాదాన్నీ, డిటాచ్‌మెంట్‌నీ సరితూచే రాళ్ళు నా దగ్గర లేవు. గ్లాసులో కాస్త జిన్, నీళ్ళు పోసుకొని ఒక్కొక్క గుక్క గొంతులో పోసుకోసాగేను.

"అతనలా చెప్పకుండా చేయకుండా వెళ్ళి పోయినందుకు నేనేం షాక్ అవలేదు. ఎలాగూ అది నేనెప్పుడో ఎక్స్‌పెక్ట్ చేశాను. అయితే తెలిసి తెలిసీ నా కన్యాత్వం అతనికి అర్పించాననే నా బాధ. ఈలోగా హైదరాబాద్‌లో నాకొక రచయితతో పరిచయమైంది"

ఆమె మాటలకు అడ్డొస్తూ "ఎవరా రచయిత?" అని ప్రశ్నించాను.

"పేర్లు అడక్కండి ప్లీజ్!"

"ఓ. కే. కానీ" అంటూ గ్లాసులోకి మరికాస్త జిన్ పోసుకొన్నాను.

"అతనో రచయిత. మామూలు రచయిత కాదు. ఒక మాదిరి గొప్ప రచయిత. మంచి అభ్యుదయ భావాలు గల వాడు. ఈ వివరాలు చాలుగదా?" అంది రాణి.

"చాలు" అన్నాను.

"అతను నా కథంతా విన్నాడు. అర్థం చేసుకొని సానుభూతి చూపించాడు. అయితే ఏం లాభం? అతనికి ఇది వరకే పెళ్లయిపోయింది. ఇద్దరు పిల్లలు కూడానూ. అతను నన్ను పెళ్ళి చేసుకోక పోయినా ఫర్వాలేదు; ఉంపుడుగత్తెగానైనా ఉండిపోదాం అన్పించేది. అతను తరచూ డబ్బు ఇబ్బందుల్లో ఉండేవాడు. పెళ్ళాన్నే సరిగ్గా పోషించలేని వాడు; నా సంగతేం చూస్తాడు. నన్నేం ఉద్ధరించగలడు? ఇద్దరం ఏడాది పాటు కలిసి మెలిసి ఉన్నాం...చివరికి కొన్ని కారణాల వల్లా, అనేకమైన వత్తిడులవల్లా ఇద్దరం విడిపోయాం. సరిగ్గా అప్పుడేనేను పూర్తిగా కళ్ళు తెరిచాను. ఏదోఒక ఉద్యోగం సంపాదించి నాకాళ్ళ మీద నేను నిలబడక పోతేగాని లాభం

లేదనిపించింది. ఉద్యోగాల వేట ప్రారంభించాను. ఇంటర్వ్యూలకి వెళ్ళినప్పుడల్లా ఇంటర్వ్యూ చేసేవాళ్ళ చూపులు నా ఒంటిమీదే తారట్లాడటం నేను ఎన్నో సార్లు గమనించాను. కొంతనుండి మరీ సిగ్గూ ఎగ్గూ వదిలేసి వెర్రి కళ్ళతో సూటిగా చీర ఒలిచిగూడా చూసేవారు. మొదట్లో సిగ్గుతో ముడుచుకు పోయే దాన్ని. తర్వాత తర్వాత అది అలవాటై పోయింది. ఆఖరిగా శరీరాన్ని ఎరగా వేసి కూడా ఉద్యోగం సంపాదించలేక పోయాను... చిత్తుగా తాగి వచ్చి ఓ రాత్రల్లా నా శరీరాన్ని తన ఇష్టం వచ్చినట్టు వాడుకొని, 'ఈసారి రా... బెటర్ లక్ నెక్స్ట్ టైమ్!' అన్నాడు ఓ దుర్మార్గుడు...'' అంటూ పైట చెంగులో మొహం దాచుకొని వెక్కి వెక్కి ఏడవ సాగింది రాణి.

నేనామెను అలాగే కాసేపు ఏడవనిచ్చాను. ఓదార్చే కొద్దీ ఆ దుఃఖం ఎక్కువ అవుతుంది గానీ తగ్గదు. కొంత సేపటికి తనంత తానే ఏడుపు మానేసింది. మెల్లిగా లేచిసింక్ దగ్గరమొహం కడుక్కొని తువాల్తో తుడుచుకొంది. మళ్ళీ వొచ్చి మంచంమీద కూర్చొని కాసేపు నన్నే చూసి, వెల్లకిలా పడుకొంది.

"అంతటి అవమానాన్నీ దిగమింగుకొని మా ఊరు వెళ్ళేను. అక్కడా పరిస్థితి ఏం బాగులేదు. ఎంతసేపని ఇంట్లో కూర్చోను? బయటికి వస్తేచాలు. పదేళ్ళ కుర్రాళ్ళ దగ్గర్నుంచీ డెబ్భయ్యేళ్ళ ముసలి వెధవలవరకూ అందరూ నన్ను అదోలా చూసేవారు. 'ప్రయత్నిస్తేచాలు. పడ్తుందిరాపిట్ట' అని నాకు వినబడేలా వాళ్ళలో వాళ్ళు అనుకొనేవారు. అవి వినలేక ఎన్నోసార్లు చచ్చిపోదాం అనిపించేది. కాని అందుకు ధైర్యం లేదు... ఒక రోజు నేను ఒక్కతినీ బస్సు మీద విజయవాడ వెళ్ళేను. ఏవో పూసలూ గాజులూ కొనుక్కొని మాటినీ సినిమా చూద్దామని వెళ్ళేను. సినిమా నుంచి తిరిగి వస్తూంటే బస్టాండ్‌లో గౌరీ ఎదురుపడ్డాడు. వాడి అసలు పేరు గౌరీ శంకర్ కాని, అందరూ వాడిని 'గౌరీ' అంటారు. వాడు మా వూళ్ళో ఓ చిన్న సైజు రౌడీ వాడి నాన్న మా వూళ్ళో పెద్ద భూస్వామి. నన్ను అటకాయించి బ్రతిమాలాడు. విసుక్కున్నాను. బల ప్రయోగంచేశాడు. అప్పటికే నేను జీవితం మీద పూర్తిగా విరక్తి పెంచుకొన్నాను. ఏ ఆడదైనా ఒక్కసారే చెడిపోతుంది. ఎన్నోసార్లు చెడిపోవడం అనేది ఉండదు.ఒకసారి ఆఘ్రాణింపబడిన పువ్వు మళ్ళీ అనాఘ్రాతం కాలేదు. కాదు. తప్పని సరై వాడితో వెళ్ళాను. ఆ రాత్రల్లా వాడితో ఏదో లాడ్జ్‌లో గడిపాను. ఉదయాన్నే మూడు పది రూపాయల నోట్లిచ్చి బస్సు ఎక్కించాడు... అంతటితో అయిపోలేదు. మా ఇంటికే వచ్చి నాతో మాట్లాడేవాడు. మా వాళ్ళు నాతో పోట్లాట... వాడు ఎక్కడపడితే అక్కడే పలకరించేవాడు. రమ్మని కబుర్లు పంపేవాడు. రాకపోతే నాపరువు బైట పెడ్తానని బెదిరించేవాడు. ఏం చేస్తాను... లొంగిపోయేదాన్ని!" అంటూ ఆగింది. పైట చెంగుతో మొహం తుడుచు

కొని గుండెలమీద చేతులు వేసుకొంది.

సీసాలో మిగిలి ఉన్న జిన్ అంతట్నీ పోసుకొని ఖాళీసీసా ఓ మూలకి గిరాటు వేశాను. మంచినీళ్ళు కలుపుకొని ఆసక్తిగా రాణి కేసి చూడసాగేను.

"ఊళ్ళో చాలా మందికి మా విషయం తెలిసిపోయింది. ఎక్కడ చూసినా గుసగుసలు. మా కబుర్లే. చావాలంచే అధైర్యం.బతకాలంటే అడుగడుగునా అవమానాలు. చివరికి తెగించి ఎవరికీ చెప్పకుండా హైదరాబాద్ వచ్చాను. చివరి ప్రయత్నంగా ఉద్యోగం కోసం తిరిగాను. నిరాశే ఎదురైంది. మా చిన్నాన్నగారింట్లో దొంగతనంగా తెచ్చిన డబ్బు ఇంకా అయిదు వందలవరకూ ఉంది. అది ఖర్చయేలోగా— ఈ శరీరం మట్టిలో కలిసిపోవాలని నా కోరిక. ఏంచెయ్యాలో తోచక— ఏమీ తోచని పరిస్థితిలో సికింద్రాబాద్ స్టేషన్‌లో నిలబడ్డాను. అంతలో మీరొచ్చారు. నన్ను చూశారు. మీ కళ్ళు నన్ను ఆకర్షించాయి. నన్ను కవ్వించాయి... కారణం చెప్పలేను.... రమ్మన్నారు.మీవెంట మేకలా వచ్చేను... అంతే !"అంటూ తన కథను ముగించింది రాణి.

"అదన్నమాట సంగతి !" అన్నాను నేను.

"అవును. అది సరేగాని— నాదో కోరిక ఉంది...తీర్చరూ ?" అంటూ పడుకుని వున్నదల్లా లేచి కూర్చుంది.

"ఏమిటి ?"అన్నాను గ్లాసులోని జిన్ గడగడా ఒక్క గుక్కలో తాగేసి.

నా మెడచుట్టూ చేతులు వేసి నా బుగ్గలమీద మృదువుగా చుంబించింది. తను వెనక్కి వాలిపోతూ, నన్ను తనతో పాటు లాగి, మీదికి లాక్కుంది.

"తీరుస్తారా మరి?" అంది అల్లరిగా.

"తప్పక ప్రయత్నిస్తాను. ఏమిటది ?"

"నన్ను హత్య చెయ్యరూ ?" అంది రాణి. నన్ను తిన కౌగలిలోకి లాక్కుని, గట్టిగా బిగిస్తూ. ఆమె చేతులు నా వీపు మీద. గోళ్ళు గుచ్చుకొంటున్నాయి.

"చెప్పండి.... నన్ను హత్య చెయ్యరూ?"అంది గోముగా మళ్ళీ.

ఉలిక్కిపడ్డాను నేను.

నా బుగ్గల మీద ఆమె వెచ్చని పెదిమలు. మొహంమీద మోహంతో కూడిన వేడివేడి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. నా శరీరాన్ని తడుముతోంది ఆమె. ఆమె వెచ్చని మెత్తని శరీరం నా ఛాతీక్రింద... నేనేం అవుతున్నాను? నేనేం చేస్తున్నాను? నా చేతులు ఆమెను బిగిస్తున్నాయి. ఆ కౌగిలిలోని గట్టిదనానికి రాణి 'అమ్మా' అంది బాధగా.

'నన్ను హత్య చెయ్యరూ ?'— ఆ ప్రశ్న ఒక్కరు కాదు. ఇద్దరు కాదు. వందల మంది. వేలమంది. లక్షల మంది. అనేకానేక కంఠాలతో ఆ ప్రశ్న వేస్తూ నన్ను చిత్రవధ చేస్తున్నారు. ఆ ప్రశ్నలు గదినిండా హోరుమని ప్రతిధ్వనిస్తున్నాయి.

వంగి— రొమ్ముల మెత్తదనాన్ని అనుభవిస్తూ రాణి పెదిమల్ని– ఎర్రని పెదిమల్ని అందుకొన్నాను.



## 20

నాకు మెలకువ వచ్చేసరికి పదిన్నర అయింది. రాణి ఇంకా నిద్రపోతూనే ఉంది. నా చుట్టూ ఆమె చేతులు. చిన్నగా నోరు తెరుచుకొని నిద్రపోతూంది. ఆమెను చూస్తోంటే నెలలు నిండని పాపాయి గుర్తుకొచ్చింది నాకు. మృదువుగా ఆమెను తట్టిలేపాను. లేచి అందంగా బద్ధకంగా ఒళ్లు విరుచుకొంది. మళ్ళీ నా ఛాతీమీద చేతులు వేసి నిద్ర పోసాగింది. మళ్ళీ లేపాను. ఈసారి లేచి కూర్చుంది.

అంతలో ఇంటర్వ్యూ సంగతి జ్ఞాపకాని కొచ్చింది. మైగాడ్! ఒక్కక్షణం నా గుండె ఆగినట్టన్పించింది. గబగబ మొహం అదీ కడుక్కొని బట్టలు వేసు కొన్నాను.

"రాణీ, నేను మళ్ళీ మధ్యాహ్నం ఒంటిగంటకి వస్తాను. చిన్న పనుంది" అన్నాను తల దువ్వుకుంటూ.

"వేగిరంగా వచ్చేయ్యండి... ప్లీజ్ !"

"అలాగే"అని, కెమేరాని అందుకొని బైటికి నడిచాను.

హోటల్ లాబీలో ఆగి 'బ్లూమూన్'కి ఫోన్ చేశాను.

తారామణి నాకోసం రాత్రి పన్నెండు దాకా చూసిందట. షూటింగ్ ప్రోగ్రామ్ కేన్సిల్ అయింది. ఉదయం ఫ్లయిట్‌లో బొంబాయి వెళ్ళిపోయింది.

నా తల గిర్రున తిరిగిపోయింది. రాకరాక వచ్చింది అవకాశం. వచ్చింది కాస్తా—ఇట్టే చెయ్యిజారిపోయింది. నీరసంగా ఆఫీసువేపు నడిచాను.

నన్ను చూస్తూనే ఎడిటర్‌గారు అంతెత్తున ఎగిరాడు. మౌనంగా తల వంచుకొని అన్ని తిట్లూ తిన్నాను. నా చేతిలోని కెమెరా లాక్కొని— ఆరోజు వరకూ రావల్సిన జీతం రాళ్ళని నా చేతిలోపెట్టి 'గెటవుట్' అన్నాడు.

ఇంతవరకూ వచ్చేక ఇక ప్రాధేయపడినా ప్రయోజనం లేదనిపించి నా రూమ్‌వేపు బయలుదేరాను.

తాళంతీసి గదిలోకి అడుగుపెట్టాను. ఎప్పటిలాగే నా గదిగోడలమీద గాంధీజీ, నెహ్రూ, కెనడీ, ఎం. ఎన్. రాయ్, భగత్‌సింగ్, లెనిన్, గోర్కీ, మావోల ఫోటోలు చెక్కుచెదరకుండా ఉన్నాయి. ఓ మూల బల్లమీద నాలుగు దొంతుల్లో పేర్చిన పుస్తకాలు. మద్రాస్ మూర్ మార్కెట్లో, హైద్రాబాద్ ఆబిడ్స్‌లో నేను కొన్న సెకెండ్‌హేండ్ పేపర్ బేక్స్ అవన్నీ. ఒక్కొక్క పుస్తకం—నాకు చాలాసార్లు ఒకపూట భోజనాన్నిలేకుండా చేసింది. వాటికే నోళ్ళొస్తే ఒకోటీ ఒక్కొక్క దయనీయమైన సంఘటనని చెప్తాయి...మరో మూల మడత మంచం, ఇంకో మూల తాడు మీద నా మాసిన బట్టలు—ఇదే నా గది. నా అద్దె గది.

మంచం మీద కూర్చుని నిట్టూర్చేను.

ఇప్పుడేం చెయ్యాలి నేను ?

నాగరత్నం, రజని, రాజు, పార్వతి మహజబీన్, ఒక్కసారి నా కళ్ళలో మెదిలారు. వాళ్ళఅసంపూర్ణ-అస్తవ్యస్త జీవితాలు గుర్తుకొచ్చాయి. ఎంత అర్థాంతరంగా ముగిసాయి వాళ్ళ బ్రతుకులు. ఇవన్నీ కళ్ళారా చూసి కూడా, నేనెంత మొండిగా బ్రతికి ఉన్నాను ? ఇంకా ఏం సాధించాలని ? ఏం సాధించగలనన్ని ? ?

నేనింక ఈ తనువు చాలించి...చచ్చిపోతే...ఏం ?

ఎందుకో నాకు పాల్ గాగిన్ జీవితం జ్ఞప్తికి వచ్చింది...నా ప్రస్తుత పరిస్థితి వేరు...నాకు అతని జీవితమే ఎందుకు గుర్తుకు రావాలి...?

సుఖప్రదమైనజీవితాన్నీ, సంసారాన్నీ తన 35వ ఏట వదులుకున్నాడు గాగిన్. ఎందుకు ? తనలో అంత వరకూ నిద్రాణమై ఉండి అప్పుడే చైతన్యవంతమైన రంగులలోకం అతన్ని ఉక్కిరి బిక్కిరి చేసింది. పెయింట్ చేయాలన్న తపన బయల్దేరింది. ఏదైనా నేర్చుకునేందుకు అది వయస్సా ? కాదు. అయినా ఆ తపన అతన్ని దైహికంగా, మానసికంగా జయించింది. పిల్లనిచ్చిన తలిదండ్రులు ఈసడించారు. అయినాలెక్కచెయ్యక తన గమ్యం అన్వేషిస్తూ బయలు దేరాడు. తహితీద్వీపం...సుందర స్త్రీలు...మనోహరమైన సముద్రం.. బంగారు రంగు తీరం .. చిత్రమైన రాత్రుల్లో...చెట్ల నుండి పండి కింద పడే మధుర ఫలాలు...ఇవన్నీ అతని సబ్జెక్టులు అయ్యేయి. ఆనాడు ఎవరూ ఇతని చిత్రాలు ఆదరించలేదు. అయినా, పాల్ గాగిన్ తన పని మానలేదు. 'నిజమైన కళ అనేది ఒక పవిత్రమైన శక్తి. ఆ శక్తినిండిన స్వర్గాన్ని ఒకసారి అందుకోగలిగిన ఏ మనిషైనా కళకే తన జీవన సర్వస్వాన్నీ అంకితం చేస్తాడు' అంటాడు అతనే ఒక సందర్భంలో. కుష్ఠురోగం కాళ్ళూ చేతులూ తినేసినా, కళ్ళలోని వెలుగు అంతరించిపోయినా అతను బొమ్మలు వెయ్యడం మానలేదు. బ్రతికి నన్నాళ్ళూ దరిద్రంతో, అర్థాకలితో బ్రతికాడు. అతను చనిపోయాక అతని చిత్రాలకు గిరాకీ పెరిగింది. పెయింటింగ్ కలెక్టర్లు అతని పెయింటింగ్‌ల కోసం వేట ప్రారంభించారు.

బారుల్లో, వ్యభిచారగృహాల్లో, లాడ్జింగుల్లో దొరికినయ్ అతని చిత్రాలెన్నో. ఒక సీసాకోసం, ఒక క్షణం స్త్రీ సుఖం కోసం, ఒక రాత్రి నిద్ర కోసం వాటినతను అక్కడ అమ్ముకొన్నాడు... అదే గాగిన్ వేసిన పెయింటింగ్ ఒకదాన్ని 1959 లో 15 లక్షలు ఇచ్చి కొన్నాడు ఒక డీలర్. చెప్పకోదగిన గాగిన్ వర్ణ చిత్రాల ధర ఈనాడు ఊహకే అందదు !

ఏమిటీ విచిత్రం ? ఏమిటీ తమాషా? ఎవర్నడగాలి ?

'కెవాలియర్' లో చదివిన ఒక సంఘటన మళ్ళీ మరోసారి గుర్తుకొచ్చింది.

లీ ఆస్వాల్డు అనే వాడిని టిప్పిట్ అనేపోలీస్‌కాన్‌స్టేబుల్ పట్టుకోబోయేడు. అంతలో ఆస్వాల్డు పోలీసుని కాల్చేసి పారిపోయాడు. ఇది కేవలం పోలీస్

టిప్పిట్ గాడి అసమర్థత. ఇది జరిగిన కొన్నాళ్ళకే టిప్పిట్ భార్య పేర డాలర్ల వర్షం కురవడం ప్రారంభమైంది. టిప్పిట్ మరణానికి సానుభూతి కనబరుస్తూ అతని భార్యకు ప్రజలు విరాళాలు పంపారు...మిలియన్ డాలర్ల వరకూపోగైంది. ఒక సామాన్యమైన పోలీస్ కాన్‌స్టేబుల్ భార్య, వాడు బతికినన్నాళ్ళూ పేదరికం అనుభవించి, వాడి మరణంతో మిలియనీర్ అయికూర్చుంది. ఇది జరిగింది 1965లో...అమెరికాలో !

దేశాలు వేరైనా—మనుషులూ, మన స్తత్వాలూ ఒక్కటే. అందరూ గొర్రెలే. ఈ గొర్రెల్ని ఎవరో ఒకరు ఎటో ఒకవైపు తోలుకుంటూ పోవాలి...

నేనూ ఆ గొర్రెల దేశంలోనే ఉన్నాను. నేనూ ఒక జనారణ్యంలోనే సంచరిస్తున్నాను. నేనిప్పుడేం చెయ్యాలి?. ఎంత గొప్ప పుస్తకంలోనైనా విసుగు పుట్టించే పేజీలు కొన్ని ఉంటాయి. అలాగే ఎంత గొప్పవాడి జీవితంలోనైనా బోర్ కొట్టించే క్షణాలూ కొన్ని ఉండక తప్పదు ఇక నా సంగతి ఒక లెక్కా ? అలా అని సర్దుకుపోవాలానేను? ఎంతకని ? ఎన్నాళ్ళిలా ?

నా శరీరం నా స్వాధీనంలో ఉండకుండా పోతూంది. ఉత్తపుణ్యానికి ఎవర్నయినా చంపెయ్యాలనిపిస్తోంది. ఏ మాత్రం చిరాకుఎవరుకలిగించినా,అమాంతం మీద పడి వాళ్ళపీకనులిమెయ్యాలనిపిస్తోంది...అలా ఆలోచనల్తో సతమతం అవుతూ మధ్యాహ్నం ఒంటిగంటవరకూ కాలం గడిపాను. ఒంటరిగా కూర్చుంటే ఆలోచనలు ఇంకా ఎక్కువై బుర్ర పాడౌతుందని లేచాను... 'రాజ్‌కమల్'లో ఇరవై నాలుగౌన్సుల రమ్ బాటిల్ కొని దాన్ని పేపర్లో చుట్టేను.... అంతలో సికిందరాబాద్ వెళ్ళే డబుల్ డెక్కర్ బస్సొచ్చింది. పరుగెత్తి అందుకొన్నాను.

* * *

గదిలో రాణి లేదు. 'రాణీ' అని కేకవేశాను. 'ఆఁ' అంటూ బాత్‌రూమ్‌లోంచి ఆమె గొంతు వినిపించింది. వరండాలోంచి వెడ్తున్న బోయ్‌ని పిలిచి ఇద్దరికీ భోజనాలు తీసుకురమ్మన్నాను.... బాత్‌రూమ్‌లోంచి రాణి వచ్చిన పది నిమిషాలకు భోజనాలు వచ్చినై. ప్లేట్లు వగైరా టేబిల్‌మీద సర్ది బోయ్ వెళ్ళిపోయాడు. అప్పటివరకూ రాణి మొహం చూడలేదు నేను. చూసిన వెంటనే ఆశ్చర్యంవేసింది. ఆమె కళ్ళు ఎర్రగా ఉన్నాయి. అక్కడంతా బాగా ఉబ్బింది. మళ్ళీ ఏడ్చిందా? ఏమైంది ?

"అలా ఉన్నావేం రాణీ ?" అనడిగాను

"గౌరీ కనిపించాడు" అంది ముక్తసరిగా.

"ఏ గౌరీ ?"

"వాడే...గౌరీశంకర్. మా ఊరివాడే."

గతుక్కుమన్నాను.

"ఏమంటాడు ?"

"తనతో రమ్మంటాడు"

"ఎక్కడికి ?"

"ముషీరాబాద్‌లో చిన్న ఇల్లు అద్దెకు తీసుకుంటాడట. నన్ను అక్కడ ఉండ

మంటాడు..."

"పెళ్ళి చేసుకుంటాడా ?"

"అతనికి ఇదివరకే పెళ్ళయింది. పిల్లలు కూడా ఉన్నారు."

"నిన్ను ఉంచుకుంటాడన్నమాట !" అన్నాను కసిగా. ఆ కోపం ఎవరిమీదో నాకే తెలీదు.

"అవును" అంది రాణి క్రిందిచూపులు చూస్తూ.

"నువ్వేమన్నావు ?" గద్దిస్తున్నట్టు అడిగేను. నా గొంతులోని ఆ అధికారం గమనించి రాణి చివ్వున తలెత్తి నావేపు ఆశ్చర్యంగా చూసింది. అవును. నాకెవ రిచ్చారా అధికారం ?

"ఏమనగలను ? అతను చెప్పింది చెయ్యక తప్పదు."

"ఎందుకు తప్పదు? నాకిష్టం లేదను" అన్నాను.

"ఇష్టం ఉన్నా లేకపోయినా—అతను చెప్పింది చెయ్యాల్సిందే! లేకపోతే చంపు తాడు. నన్ను బజారుకి ఈడుస్తాడు. లేదా ఏ వ్యభిచార గృహానికో తీసుకు పోయి ఏ వందకో రెండు వందలకో అమ్మేస్తాడు..."

"అంత బలవంతుడా?"

"అవును మీకు ముందే చెప్పాను. వాడు పక్కా రౌడీ !"

"అంటే వాడి దుర్మార్గంలో— వాడి చేతుల్లో నీకిష్టం ఉన్నా లేకపోయినా, నలిగి నాశనం అవ్వాల్సిందే !"

"అవును. అంతే"

"వీల్లేదు. దీన్ని నేను ఆపుతాను. రోజూ ఇలా ఎంతో మంది ఆడపిల్లలు ప్రతిచోటా ఆహుతై పోతున్నారు. కనీసం ఇదొక్కటి ఆపుతాను. ఈ దుర్మార్గం ఒక్కటీ జరక్కుండా చూస్తాను."

"ఎలా ?"

"మనిద్దరం పెళ్ళి చేసుకో బోతున్నాం" అని చెప్తాను.

"ప్రయోజనం లేదు. మిమ్మల్ని తాళ్ళతో ఈ మంచానికి కట్టిపడేసి మరీ నన్ను లాక్కుపోతాడు. లేదా పట్టపగలు నడిరోడ్డు మీద మిమ్మల్ని హత్య చేసైనా సరే, నన్ను తన వెంట మేకలా లాక్కుపోతాడు.

నేను సిగరెట్ వెలిగించాను. నా చేతి వేళ్ళు వొణుకుతున్నాయి. అంటే నాలో ఆవేశం చెలరేగుతోంది నాలో అశాంతి బుసకొడ్తోంది. నాలోని అసహనం కట్టలు తెంచుకొంటోంది.

అంతలో అప్పుడెప్పుడో విశాఖలో హైమ అన్నమాటలు గుర్తుకు వచ్చాయి. 'గౌరీ' అన్న మాట, ఆ దౌర్భాగ్యుడి పేరు అప్పుడే ప్రప్రథమంగా విన్నాను. హైమను చేసుకోబోయే ఆ గౌరీగాడి ఊరు కూడా కృష్ణా జిల్లాయేనని ఆమె చెప్పినట్టు లీలగా గుర్తు.

ఈ గౌరీ, ఆ గౌరీ ఒకరు కాదు కదా!

"వాడి భార్య నీకు తెలుసా?" అనడి గేను రాణిని.

"మొదటి భార్య నాకు తెలుసు. ఎక్కడేనా కనిపిస్తే నాతో కాసేపు మాట్లాడేది. పెళ్ళయిన ఆర్నెల్లకే అతని బాధలు పడలేక నూతిలో పడి చచ్చి పోయింది. ఏడాదికల్లా గౌరీ మళ్ళీ పెళ్ళి

చేసుకున్నాడు..."

"చచ్చిపోయినామె పేరేమిటి ?"

"హైమవతి."

ఆ మాట వినగానే నా నవనాడులూ కృంగి పోయాయి. హైమ కథ అలా ముగిసిపోతుందనుకోలేదు నేను.

"తనే నూతిలో పడిపోయిందా? వాడే కావాలని తోశాడా ?" పళ్ల బిగువున అడిగాను.

"ఆత్మహత్య చేసుకుందనే అందరూ అనుకొనేవారు."

ఉస్సురని నిట్టూర్చాను.

స్కూళ్ళలో కాలేజీల్లో ఆడపిల్లలు నా కళ్ళ ముందు మెదిలారు. కట్నాలు పొయ్యలేని తలిదండ్రులు. దారిద్ర్యంతో మగ్గే తలిదండ్రులు... గుర్తుకొచ్చారు. మార్కెట్లో మొగుళ్ళను కొనుక్కోగలిగే వారు ఆ తాహతున్నవాళ్ళు కొనుక్కుంటు న్నారు. లేనివాళ్ళు ముసలివాళ్ళను కట్టు కొంటున్నారు. ఆ భాగ్యమూ లేనివాళ్ళు ఉంపుడుగత్తెలుగా, అనఫీషియల్ రెండో పెళ్ళాలుగా మారిపోతున్నారు. ఆ దారీ లేని ఇంకొందరు సీసాడు సారాకన్నా అతి చవగ్గా వేశ్యా వాటికల్లో అమ్ముడు పోతున్నారు. రౌడీల చేతుల్లో కొందరు, గూండాల చేతుల్లో కొందరు, ఉద్యోగా లిచ్చిన యజమానుల కామ దాహాల్లో కొందరు, బలహీనులమూలంగా కొందరు విఫల ప్రేమల్లో కొందరు, కపట ప్రేమల్లో కొందరు, ప్రతిక్షణం... ప్రతి రోజూ నలిగి నశించి పోతున్నారు. ఈ వ్యాధి దేశంలో ముదిరిపోయింది. దీనికి శస్త్రచికిత్స అనివార్యం. సంస్కరణలూ, చట్టాలూ, పోలీసులూ ఏమీ లాభం లేదు దీనికేదేనా కొత్తమందు కనిపెట్టాలి.

మరి కొంచెంసేపు ఆలోచించాను.

"రాణీ, ఇందాక నువ్వు నన్నో కోరిక కోరావు...గుర్తుందా?''

"అవును. ఉంది. నన్ను హత్య చెయ్యమన్నాను...''

"నిన్నుకాదు. వాణ్ణి — ఆ గౌరీ గాడిని చంపుతాను!'' అన్నాను.



## 21

ఆమాట వింటూనే అవాక్కయి నిల బడిపోయింది రాణి.

"ముందు భోజనం చేద్దాం రా. నిన్న కూడా ఏం తినలేదు " అంటూ కుర్చీలో కూర్చున్నాను.

అయినా రాణి కదలలేదు. తలెత్తి చూశాను. నిశ్చేష్టురాలై నన్నే ఇంకా అలా చూస్తోంది.

"రావేం?"

వచ్చికూర్చుంది...ఇద్దరం మౌనంగా భోజనం పూర్తి చేశాం. బెల్ నొక్క గానే బోయ్‌వచ్చి ప్లేట్లు తీసుకొని వెళ్ళి పోయాడు.

కుర్చీలో కూర్చొన్నవాడినల్లా లేచి సిగరెట్ వెలిగించాను. సిగరెట్ పీలుస్తూ కాస్సేపు పచార్లు చేశాను. ఆగి—

"అసలీ గౌరి నీ కలా కన్పించాడు?'' అనడిగాను.

"మీరు వెళ్ళిపోయాక ఒక్కదాన్నీ ఉన్నాను గదా, నాకేం తోచలేదు. అలా సికిందరాబాద్ స్టేషన్‌కి వెళ్ళి ఏద్దైనా వారపత్రికలు తీసుకొందామని వెళ్లేను... నాలుగైదు పత్రికలు కొనుక్కొని తిరిగి వస్తూంటే–కన్పించాడు. నాపై ప్రాణాలు పైనే పోయాయి. నా వివరాలు అన్నీ అడిగాడు. మీ గురించి తప్ప అంతా నిజమే చేప్పాను. నా వెంట ఇక్కడికి వచ్చాడు. నన్ను వదిలెయ్యమని కాళ్ళా వేళ్ళా. పడ్డాను వినలేదు. కోప్పడ్డాడు. కొట్టాడు.'రాత్రికి వస్తాను.ఆలోచించుకో' అని వెళ్ళిపోయాడు." అంది రాణి.

"పెళ్ళయి పిల్లలు ఉన్నవాడు కదా వాడికి నీమీద ఎందుకంత ఇది ?"

"నా వంటి అగ్రజాతి స్త్రీని ఉంపుడు గత్తెగా ఉంచుకోవడం వాడికో గౌరవం. వాడి అహంకారానికి, అహంభావానికి నిదర్శనం !"

"వాడి మాట వినకపోతే ఏం చేస్తానంటాడు?" అన్నాను. ఈ ప్రశ్నలన్నీ వేస్తూనే నేనో పథకాన్ని నా మనస్సులో రచిస్తున్నాను.

"వాడు చెయ్యడం సంగతి ఎందుకు? వాడి మాట వినక నేనేం చెయ్యాలి? నాకెవరు దిక్కు ?"

"పోలీస్ కంప్లయింట్ ఇస్తే ?"

"పోలీసులు నన్ను ఎన్నాళ్ళు కాపాడతారు? వాడి బారినుండి ?"

నేను ఆలోచనలో పడ్డాను. 'అదీ నిజమే' అనుకున్నాను.

"వాడి మాటకు తిరుగు లేదు. పైగా మా ఇద్దరి పేర్లూ మా ఊరి గోడల మీదికి ఎప్పుడో ఎక్కేయి..." అంది రాణి దీనంగా.

"నీకు వాడంటే ఇష్టమా?" అన్నాను సూటిగా ఆమె కళ్ళలోకి చూస్తూ.

"లేదు. ముమ్మాటికీ లేదు. వాడి పశుత్వానికి ఈ శరీరం ఒకప్పుడు లొంగిపోయింది... అంతే !"

"నీ మనసు?" అంటూ మరో ప్రశ్న వేశాను.

"అదంటూ నాకు ఉందా అని నా అనుమానం"

"డైలాగులు చెప్పకు !"

"డైలాగులు కాదు. నిజం. నా మనసు సంగతి నాకు తెలుసు. మీరన్నట్టు అదంటూ ఒకటి ఉండి ఎడిస్తే– ఇంతవరకూ ఎవరి ఆకర్షణలోనూ పడలేదని చెప్పగలను"

"ఇదివరకూ సంగతి కాదు ... ఇప్పుడు ?''

"చెప్పనా ?"

"అడిగింది అందుకే"

"అయితే చెప్తా. ఆ వెధవ మనస్సు ఇప్పుడు మేల్కొంది. మీ ఆకర్షణలో పడింది" అంటూ తల క్రిందికి దించుకొంది.

నా శరీరం ఒక్కసారి గర్వంతో ఉప్పొంగి పోయింది. నా హృదయానికి ఎంతో చేరువగా వచ్చి, దూరమైన నాగరత్నం గుర్తుకొచ్చింది.

"నిజంగానా ?" అన్నాను ఆనందంగా.

"అవును" అంది రాణి తల ఎత్తి చూస్తూ.

లేచి ఆమెను సమీపించాను. నడుం చుట్టూ చేతులు వేసి దగ్గరకు లాక్కు న్నాను.

"రాణీ, నేను చాలా దురదృష్ట వంతుణ్ణి" అన్నాను నా పెదిమల్తో ఆమె బుగ్గలను రాస్తూ.

"ఏం అలా అంటున్నారు ?"

"తర్వాత చెప్తాను గానీ ... నా మాటలు జాగ్రత్తగా విను !" అంటూ ఆమెను నడిపించి మంచం మీద కూర్చో బెట్టాను. నేనూ ఆమె ప్రక్కనే కూర్చు న్నాను.

"చెప్పండి. ఏమిటది?" అంది.

నా మస్తిష్కంలోని ఆలోచనలు ... రక రకాల ఆకారాల్తో ... రంగుల్తో ... వివిధ గతుల్లో పరుగులెడుతున్నాయి. రొద చేస్తున్నాయి. అసహనంగా గర్జిస్తు న్నాయి.

"ఏమిటది... చెప్పండి"

"నా దగ్గర నిద్ర మాత్రలు ఉన్నాయి. అవి చాలా పవర్‌ఫుల్ మాత్రలు. రెండు మాత్రల్ని మెత్తగా నూరి పొడి చెయ్యి. కాఫీలోనో టీలోనో అది కలిపి గౌరీ గాడికి ఇయ్యి. వాడు ఎలాగేనా అది తాగేలా చూడు. వాడు బాగా నిద్రపోయాక గది తలుపుకి ఉన్న గడియ తీసెయ్యి. నేను అంతవరకూ క్రిందని ఏ బార్‌లోనో ఉంటాను. వచ్చిన తర్వాత ఏం చెయ్యాలో అప్పుడు చెప్తాను" అన్నాను.

'అలాగే' నన్నట్టు తల ఊపింది రాణి.

"ఒకవేళ హడావుడిగా నన్ను తనతో బయల్దేరమంటాడేమో ! ?" అంటూ సందే హంగా చూసింది.

"అయినాసరే, ఎలాగైనా అతనిరాత్రి ఇక్కడ గడిపేలా చూడు !" అన్నాను.

"అలాగే. మీరు చెప్పినట్టే చేస్తాను."

"సరే, నాకు వేళైంది. మరి నేను వెళ్తాను. ఆ సీసాని ఎక్కడైనా దాచు" అంటూ లేచాను.

* * *

సాధారణంగా నాకు మధ్యాహ్నంవేళ ఓ అరగంట సేపు కునుకు తియ్యడం అల వాటు. ఏరోజైనా ఆపగటి నిద్రలేకపోతే- ఇహ ఆ వేళంతా చిరాగ్గా ఉంటుంది. హోటలు ప్రక్కనే చిన్న బార్ ఉంది. చుట్టూ అద్దాలు. సరైన ఏంగిల్ చూసు కొని కూర్చున్నాను. నా ఎదురుగా ఉన్న అద్దంలోంచి చూస్తే హోటలు గుమ్మం కనిపిస్తుంది. వచ్చి పోయేవాళ్ళు స్పష్టంగా కనిపిస్తారు. 'బాగుంది ఇక్కడే వెయ్యాలి మకాం' అనుకొన్నాను. ఒక బీర్ సీసా తాగి సికిందరాబాద్ స్టేషన్‌కి వెళ్ళేను. రామమోహన్ డ్యూటీకి ఇంకా రాలేదు. సెకెండ్ క్లాస్ వెయిటింగ్ రూమ్‌లో ఓ ఖాళీ బల్లమీద నడుం చేరేశాను. మరో పావుగంటకి గాఢమైన నిద్ర పట్టేసింది.

మళ్ళీ నాకు మెలకువ వచ్చేసరికి రాత్రి ఎనిమిది గంటలు దాటింది. లేచి స్టేషన్లోనే మొహం కడుక్కొని రుమాల్తో తుడుచుకొన్నాను. స్టేషన్ దగ్గరే ఉన్న మార్కెట్లో ఒక సంచీ కొన్నాను. సుత్తి ఒకటి కొన్నాను. చేంతాడు కొన్నాను.

మూడు మీటర్ల ఎర్రని గుడ్డ కొన్నాను. అవన్నీ సంచీలో పడేసి హోటల్ వేపు నడిచేను. మెల్లెక్కబోయి ఆ ప్రయత్నం విరమించాను. పక్కనున్న బార్‌లోకి వెళ్లాను. ఇందాక నేను సెలెక్ట్ చేసు కొన్న జాగా ఖాళీగానే ఉంది. వెళ్ళి అక్కడ కూర్చున్నాను. ఆకలి కడుపులో కరకరమంటూంది. ఏదైనా ఘన పదార్థం తిందామనిపించింది... ఇవాళ, శరీరం నా వశం తప్పేవరకూ తాగాలి. అలాగని చెప్పి, తెలివి తప్పేంతవరకూ తాగితే అసలుకే మోసం వస్తుంది... ఆ సంఘద్రోహిని... ఆ చీడపురుగుని... నిశ్శేషం చేసే ధైర్యం వస్తే చాలు.

బేరర్ రాగానే విస్కీ రెండు పెగ్గులు తెమ్మన్నాను. రెండు ఆమ్లెట్లు కూడా తెమ్మని చెప్పి సిగరెట్ వెలిగించాను.

చెయ్యాల్సిన పని గురించి పథకం వేయడం ప్రారంభించాను. ఎలాగయినా ఆ గౌరీగాడిని అంతం చెయ్యడమే నా ధ్యేయం. వాడెవడో నాకు తెలీదు. వాడి ముక్కూ మొహం కూడా చూడలేదు. కాని...వాడి క్రౌర్యాన్నీ, వాడి దుర్మార్గాన్నీ నేను చాలా మందిలో చూశాను. ఆ దౌష్ట్యాన్ని అణచాలి.

అదిసరే, నేనేమౌతాను?

నేనేమైనా ఫర్వాలేదు.

రాణి సుఖంగా ఉంటే చాలు.

ఎందుకని ?

రాణికీ, నాకూ ఏం సంబంధం ?

ఆమె బతుకు ఎలా ఏడిస్తే నాకేం? ?

కాదు.

నేను మనిషిని.

హృదయం చచ్చి, శరీరం ఇంకా బతికే ఉన్న మనిషిని. నాగరత్నం నిష్క్రమణతోనే నా బతుకు తన విలువను కోల్పోయింది. పైగా రజని, రాజు, పార్వతి, మహజబీన్, వీళ్ళందరూ, వీళ్ళకు జరిగిన అన్యాయాలూ చూసి చూసీ, విసుగెత్తిపోయాను ఈ జనారణ్యంలో వాళ్ళలాంటి వాళ్ళ జీవితాలు ఇంకా ఎన్నో చదివానెన్నో, చూశానెన్నో విన్నానెన్నో ! ఇన్నీ చూసి, బతికి ఉన్న నా మీద నాకే రోత. చావలేని, చచ్చే ధైర్యం లేని, బతికేందుకు గమ్యం లేని నామీద నాకే అసహ్యం! కనీసం రాణికైనా బతుకు మీద మమకారం పుట్టించాలి. రాణి చావకూడదు ! రాణి బతకాలి ! !

గ్లాసులోని విస్కీ పూర్తి చేశాను. ఆమ్లెట్ తినసాగేను.

ఇలా పెగ్గుల చొప్పున తాగితే లాభం లేదనిపించింది. ఒక హాఫ్ బాటిల్ తీసుకున్నాను. మరో రెండు ఆమ్లెట్లు తెమ్మన్నాను.

అలా ఆమ్లెట్లు తినడం......విస్కీ గొంతులో పోసుకోవడం......అంతే. బుర్రలో మరే ఆలోచనా పెట్టుకోలేదు. మెదడు దాదాపు మొద్దుబారే స్థితికి వచ్చే వరకూ తాగుతూనే ఉన్నాను. పావు తక్కువ పన్నెండు అయింది. 'ఇక లేవవచ్చు' అనుకున్నాను. లేచి బిల్లు చెల్లించాను. వాచ్‌మన్‌ని లేపి మెయిన్ గేటు తీయించాను. తడుముకొంటూ గది వేపు వెళ్లాను. లోపల జీరో వాట్ బల్బు వెలుగుతూంది. లోపలినుండి సడీ,

సవ్వడీ ఏమీ వినరాలేదు. తలుపు నెమ్మదిగా ముందుకు తోశాను. కొద్దిగా తెరుచుకొంది. మరి కాస్త తోశాను. రెండు అంగుళాల ఖాళీ ఏర్పడింది. శ్వాస బిగ పట్టి, చప్పుడు చెయ్యకుండా అందులోంచి చూశాను.

మంచం మీద లుంగీ కట్టుకొని ఒక ఆజాను బాహువు నిద్రపోతున్నాడు. చిన్నగా గురక శబ్దం విన్పిస్తోంది. అటు తిరిగి ఉండడం వల్ల మొహం స్పష్టంగా కనిపించడం లేదు. మెలితిరిగిన మీసాలు కనిపిస్తున్నాయి. ఆ ఆకారాన్ని చూసి, నాలాంటి వాళ్ల నలుగుర్ని అవలీలగా ఎడం చేత్తో ఒకేసారి విసిరి అవతల పారెయ్యగలడనుకొన్నాను...ఓ మూల కుర్చీలో రాణి కూర్చొని ఉంది. ఆమె కళ్లు తలుపు వేపే ఉన్నాయి.

నా కోసమే ఎదురుచూస్తోంది రాణి.

తలుపు మరికాస్త ముందుకు తోసి, నెమ్మదిగా గదిలోపలికి నడిచాను. నన్ను చూస్తూనే బరువుగా ఊపిరి తీస్తూ లేచి నిలబడింది రాణి. తలుపులు దగ్గరగా వేసి గొళ్లెం పెట్టాను. ఆమెను సమీపించాను.

"ఎంత సేపైంది నిద్రపోయి?" గొంతు తగ్గించి మెల్లిగా అడిగాను.

"అరగంటైంది"

ఓ సారి చుట్టూ చూశాను. కిటికీ తలుపులు అన్నీ వేసి ఉన్నాయి. చడీ చప్పుడూ లేకుండా వాతావరణం అంతా నిశ్శబ్దంగా ఉంది. సంచిలోంచి సుత్తి తీసి మంచం వేపు నడిచాను. వాడి మొహం చూశాను......మహా భయంకరంగా ఉంది! రాణి కేసి చూసి 'తాగేడా?' అని సైగల్తో అడిగాను. ఆమె అవునన్నట్టు తల ఊపింది. 'నిద్ర మాత్రలు కావు, ఇవి!' అన్నట్టు సీసా చూపించాను. 'అవును. అదే' అన్నట్టు మళ్లీ తల ఊపింది రాణి.

గదిలో పల్చని కాంతి.

మంచం మీద నిద్రపోతూ 'గారీ'

చేతిలో సుత్తితో నేను.

భయభ్రాంతయై నిలబడ్డ రాణి.

నేను ఎప్పుడో చిన్నప్పుడు చూసిన సైకో, డ్రాక్యులా చిత్రాలు...అందులో సన్నివేశాలు...నాకు లీలగా గుర్తుకు రాసాగేయి.

అందులో 'రక్తం తాగిన పిశాచం' సినిమా ఎంత భయంకరంగా ఉంటుంది?

నేను పాపం చెయ్యడం లేదు.

పవిత్ర కార్యం చేస్తున్నాను.

నేను అవకాశం కోసం చూస్తున్నాను. అవకాశం...అవకాశం... అవకాశం... అవకాశం కోసం చూస్తున్నాను.

అంతలో చెవులు చిల్లులు పడేలా దగ్గర్లోని స్టేషన్లో డీసెల్ ఇంజన్ కూత వినబడింది. ఒక్క క్షణం ఆలస్యం చెయ్యలేదు నేను. వాడి తలమీద సుత్తితో ఒక్క పెట్టున దెబ్బవేశాను. అక్కడితో ఆగిపోలేదు ఒకటి...రెండు...మూడు... పది ఇరవై ముప్ఫయ్.... అలా లెక్క మర్చిపోయే వరకూ వాడి తల మీద సుత్తితో బాదేను. నెమ్మదిగా వంగి వాడి నాడి చూశాను, అందలేదు. ముక్కు దగ్గర వేలు పెట్టి చూశాను, శ్వాస ఆడటం లేదు. సుత్తిని మంచంమీదికి గర్వంగా విసిరి రాణికేసి చూశాను.



## 22

శిలా ప్రతిమలా నిలుచుండి పోయింది రాణి.

బార్‌లో తాగిన విస్కీ నిషా ఒక్కసారి దిగిపోయినట్టనిపించింది నాకు. అంతకు ముందే తెచ్చి ఉంచిన 'రమ్' సీసా తెరిచాను. నీళ్ళయినా కలపకుండా అలాగే ఎత్తి పట్టి తాగేను. గొంతు సర్రున మండింది. ఒళ్ళు మరికాస్త వేడెక్కింది.

మంచం పక్కని దుప్పటి పరిచి 'గౌరీ' గాడి శవాన్ని దాని మీదకి దొర్లించాను. మూటలా కట్టి దానిని తాళ్ళతో బిగించాను. తెచ్చిన గుడ్డతో నా ముఖం మీదా, చేతులమీదా చిందిన రక్తాన్ని తుడుచుకొన్నాను. గదికి ఓ మూలని మూటను లాక్కెళ్ళి పెట్టాను.

అలసటగా మంచం మీద వెల్లకిలా పడుకున్నాను. కాసేపు అలాగే ఉండి, కళ్ళు మూసుకొన్నాను. నా ఛాతీ మీద మెత్తని స్పర్శకు కళ్ళు తెరిచాను. రాణి మంచం మీద కూర్చొని, నా మీదికి వాలి ఉంది.

"నా కోసం ఎంత పని చేశారు?" అంది రాణి.

నా కళ్ళ ముందు—

స్వేచ్ఛగా ఎగిరే పావురాలు
విచ్చలవిడిగా గంతులేసే హరిణాలు
నిర్భయంగా మేసే ఆలమందలు
—మెదిలాయి.

నా చెవుల్లో—

సుందరోద్యానాల్లో కొమ్మల మాటున దాక్కున్న పక్షుల వింత సంగీతాలు.

గాలి పాడే పాటల్లా అందమైన ఆడపిల్లల నవ్వుల చప్పుళ్ళు.

సాగర సంగీతంలా యుగ యుగాల స్త్రీల గాజుల గల గలలు.

—వినిపించేయి.

"నీ కోసం కాదురాణీ, నా సంతృప్తి కోసం!" అన్నాను.

"ఇప్పుడేం చేద్దాం?" అంది రాణి.

"తెల్లవారేవరకూ ఎలాగో మెల్లిగా కాలం గడుపుదాం. తెల్లారేక నిన్ను బస్‌స్టాండ్‌కి దిగబెడ్తాను... నువ్వు మీ వాళ్ళ దగ్గరకు వెళ్ళు!" అన్నాను.

"వాళ్ళెక్కడున్నారని వెళ్ళేది?" అంటూ కళ్ళు తుడుచుకొంది రాణి. లేచి బల్లమీద హేండ్ బేగ్‌లోని ఒక చిన్న ఫొటోని తీసి నాకు ఇచ్చింది.

"ఇదే మా ఫేమిలీ ఫొటో. ఇదొక్కటే నా దగ్గర మిగిలింది. మా అన్నయ్యలిద్దరు, మా ఒదిన, అక్క, బావ—ఇందులో ఉన్నారు. పెద్దన్నయ్య జైల్లో ఉన్నాడు. అక్క ఏమైందో తెలీదు. బావ చచ్చిపోయాడు. ఊహుఁ మా పెద్దన్నయ్య చంపేశాట్ట...అందుకే జైలు. చిన్నన్నయ్య ఏమయ్యాడో కూడా తెలీదు..."

ఆ ఫొటో చూస్తున్న నాకు కళ్ల

గిర్రున తిరిగినట్టయింది, పక్కనే బాంబు పడినట్టు త్రుళ్లి పడ్డాను.

ఫొటోలో ఉన్న రజనినీ, రాజునీ, నాగరత్నంనీ, రాణినీ ఇట్టే గుర్తుపట్టాను. నేను గుర్తు పట్టని మనుషులు...నాగ రత్నం అన్నయ్య... ఆమె భర్తా! అంటే...

"రాణీ, నాగరత్నం నీ కేమవు తుంది ?" అనడిగాను ఆదుర్దాగా.

"మా అక్కయ్య...!" అంది రాణి.

తెల్లబోయి చూశాను.

"మా అక్కయ్య నాగిరత్నం ఇప్పుడు ఎక్కడ ఉందో...! ఎంతో వైభవంగా పెళ్లి జరిగింది. మా బావ గారు కూడా ఎంతో బావుంటారు. మంచి ఉద్యోగం...ఇంతలో ఏమైందో మరి... మా అక్కయ్య ఎవరినో..." అంటూ ఇంకా ఏమో చెప్పబోయింది రాణి.

ఆమెను వారించి... "మరింకేం చెప్పకు. అంతా నాకు తెలుసు !" అన్నాను. అంతేకాని, రజని—రాజుల సంగతి చెప్పలేదు. చెప్పదల్చుకోలేదు అది వెల్లడించకుండా ఉండడమే మంచి దన్పించింది నాకు. అది విని రాణి తట్టు కోగలదా ?

"సరే—నిన్ను బస్‌స్టాండుకి దిగ బెడ్తాను. ఏ బస్ దొరికితే ఆ బస్‌లో బయల్దేరి ఎలాగో ఒకలా మద్రాసు చేరుకో. నీ భావి జీవితానికి అక్కడ పునాదులు వేసుకో...ఇదుగో... ఈ ఎడ్రస్‌లో 'ఎలిజా' అనే ఆవిడ ఉం టుంది. నేను పంపానని చెప్పు. ఆమె నిన్ను ఆదుకొంటుంది !" అంటూ ఎలిజా ఎడ్రసు ఇచ్చాను.

"మరి...మీరో ?"

"నా గురించి నువ్వేం అడగకు, దాని గురించి విచారించకు..." అన్నాను.

రమ్ బాటిల్ ఎత్తి మళ్ళీ గడగడా తాగాను.

* * *

తెలతెలవారేవరకూ నా ఛాతీ మీద గడ్డం ఆన్చి నన్నే తదేకంగా చూసింది. నేనూ ఆ కళ్ళతో కళ్ళు కలిపాను... కళ్లు మాట్లాడుకున్నాయి...హృదయాలు దగ్గరై...వీడ్కోలు పుచ్చుకున్నాయి...

ఆటో రిక్షాలో రాణిని బస్‌స్టాండ్‌కి దిగబెట్టి మళ్ళీ హోటల్ గదికి వచ్చాను. 'గౌరీ'గాడి శవం ఉన్న మూటను చూశాను. బల్లమీది బాటిల్లోని మిగతా ద్రవం కూడా తాగడం పూర్తిచేశాను.

నాగరత్నాన్నీ,

రజనినీ,

రాజునీ,

పార్వతినీ,

ఎలిజానీ,

మహజబీన్‌నీ,

రాణినీ

—ఆఖరిసారిగా నా మనోఫలకం మీద నిలిపాను. వారంతా ప్రతిబింబించారు.

జీవనగమ్యం చేరుకొన్నాను.

బతికి, చేయాల్సిందింకేమీ లేదు.

మెట్లమ్మట కిందికి దిగాను. టెలిఫోన్ వేపు నడిచాను. డైరెక్టరీ చూసి... 'పోలీస్ కంట్రోల్ రూమ్' నంబర్ వెదికాను. గబగబ డయల్ చేశాను..."హల్లో!"

*

## FORM IV [See Rule 8]

### Statement about ownership and other particulars

| | | |
|---|---|---|
| 1. Place of publication | : | 6-3-570, Eenadu Compound Somajiguda, Hyderabad-500004 |
| 2. Periodicity of its publication | : | Monthly |
| 3. Printer's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India | : | Yes |
| if Foreigner, state the country of origin | : | — — |
| Address | : | 6-3-570, Eenadu compound, Somajiguda, Hyderabad-500 004 |
| 4. Publisher's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India | : | Yes |
| if foreigner, state the country of origin | : | — — |
| Address | : | 6-3-570, Eenadu Compound Somajiguda, Hyderabad 500 004 |
| 5. Editor's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India? | : | Yes |
| if foreigner, state the country of origin | : | — — |
| Address | : | 6-3-570, Eenadu Compound Somajiguda, Hyderabad 500 004 |
| 6. Names and addresses of Individuals who own the news paper and partners or share holders holding more than one per cent of the total capital. | : | VASUNDHARA PUBLICATIONS 6-3-570, Eenadu Compound Somajiguda, Hyderabad 500 004 |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

for VASUNDHARA PUBLICATIONS

Date:
March 1, 1978

Sd/- RAMOJI RAO
Publisher

# అదీ సంగతి



కార్యక్రమం ముగిసింది. జనమంతా హాల్లోంచీ గుంపులు గుంపులుగా బైటికి వెళ్తున్నారు. ఆనాటి సాంస్కృతిక కార్యక్రమంలో, కళాకారులకి బహుమతి ప్రదానం చెయ్యడానికి ప్రఖ్యాత హిందీ సినిమా హీరో ద్వివేది వచ్చాడు. ద్వివేది బయటకువెళ్ళే లోపలే అతన్ని పత్రికా విలేకరులు చుట్టుముట్టి ప్రశ్నలవర్షం కురిపించసాగారు. అందరి ప్రశ్నలకీ చిరునవ్వుతో ఓపిగ్గా జవాబిస్తున్నాడు ద్వివేది.

ద్వివేది కేవలం హీరో మాత్రమే గాక మంచి గాయకుడు, క్రీడాకారుడు కూడా. అన్నిటికంటె విచిత్ర మేమిటంటే, ఆ మధ్యనే ఒక కుస్తీ పోటీలో పాల్గొని, ఛాంపియన్‌షిప్ గెల్చుకున్నాడు. హీరోగారి బహుముఖ ప్రజ్ఞకి దేశమంతా ఆశ్చర్యపోయింది. ఒక్క విలేకరి అడిగాడు "ఇంతవరకూ మీరు కళారంగంలోనే బహుముఖ ప్రజ్ఞకలవారనుకున్నాం. మధ్య మధ్య క్రికెట్, హాకీ కూడా ఆడుతుంటారని తెలుసు, కానీ, కుస్తీ పోటీల్లో మీరు పాల్గొంటారని మొట్ట మొదటి సారిగా తెలిసింది. ఇదివరకెప్పుడైనా కుస్తీ పోటీల్లో మీరు పాల్గొన్నారా?" ద్వివేది చిరునవ్వు నవ్వుతూ "నేను మల్లయుద్ధ యోధుణ్ణని నాకూ తెలీదు. మొన్న పాల్గొన్న పోటీయే నా మొదటి ప్రయత్నం. అంతకు ముందెప్పుడూ కండబలం చూపించలేదు. అసలావూహే లేదు నాకు" అన్నాడు.

"వండర్! మీకు అంతగా కండలు కూడా లేవు. మొట్ట మొదటిసారే రంగం లోకి దిగి, అంత పెద్ద ఛాంపియన్‌ని ఎలా ఓడించేశారండీ! మీ మాట నమ్మ మంటారా" అడిగాడు విలేకరి.

"ఈ రహస్యమేమిటో చెప్పాలి సార్ మా పాఠకులు చాలా ఆసక్తిగా ఎదురు చూస్తూంటారు ఇలాంటి విషయాల కోసం" అని మిగతా విలేఖర్లు రెట్టించారు.

"ఏముందండీ! ఈ మధ్య వరసగా ఓ అరడజను తెలుగుసినిమాలుచూశాను. వాటిల్లో హీరో, హీరోయిన్లు డ్యూయట్లు పాడుతూ పట్టినపట్లు బాగా గుర్తుపెట్టుకున్నాను. అంతే...అదేపట్లు పట్టేసరికి అంతలావు వీరుడూ మట్టి గరిచాడు. నాకు ఛాంపియన్‌షిప్ దొరికింది. అంతే-సింపుల్" అంటూ తన సీక్రెట్ చెప్పేశాడు ప్రఖ్యాత హీరో ద్వివేది.

—అనిల్

# టి.బి

కాలింగ్ బెల్ మోగడంతో వెళ్ళి తలుపు తెరిచాను.

మా ప్రక్క ఫ్లాట్ ఆయనొచ్చాడు. మేము కలకత్తా వచ్చి పదిరోజులే అయినా మా ఆవిడ పక్కవాళ్ళతో స్నేహం చేసేసింది.

పక్కింటాయనతో నాకు నిన్ననే పరిచయం అయ్యింది.

ఆయన్ని లోపలికి రమ్మన్నాను. సంభాషణ ఇద్దరికి చక్కగా అర్థమయ్యే ఇంగ్లీష్‌లోనే కొనసాగిస్తున్నాము.

కబుర్లు దొర్లి పోతున్నాయ్.

ఆయన నా వేపొకసారి చూసి "మీకు టి.బి. ఉందా" (డు-యు-హావ్ టీబి.) అనడిగాడు.

"మీ కెవరు చెప్పారు?" ఆశ్చర్యంగా—అనుమానంగా అన్నాను.

"మీ ఆవిడ—మాఆవిడతో అందట" అతనన్నాడు.

"అబ్బే లేదండీ" నేనన్నాను. కొద్దిసేపు తర్వాత అతనెళ్ళి పోయాడు.

నాకు తెలియకుండా నాకు టి. బి. ఎలా వచ్చిందబ్బా అనుకుంటూ వంటగదిలోకి ప్రవేశించాను.

"ఒసేవ్ ఇటు తిరుగు"

"ఏంటండీ?"

"నాకు టి.బి. ఉందని నువ్వు పక్కింటావిడతో అన్నావట." అన్నాను.

"మీకు టి.బి. నా? నేనన్నానా!! ఏడుపు ముఖంతో పద్మిని అంది.

"అవును—ఆయనంటున్నాడు—నీవట వాళ్ళావిడతో నాకు టి.బి. ఉందని చెప్పావట" మరింత వివరించాను.

"నేననట మేమిటండీ" పద్మిని ఏడుపు లంకించుకుంటూ అంది.

"సరే ఏడవటం దేనికి—ఊర్కో" అంటూ ముందు గదిలోకి పోయాను.

ఆ తర్వాత తెల్సింది అసలు విషయం మా ఆవిడ మాటల సందర్భంలో మాకు టి.వి (టెలివిజన్) ఉందని ఆమెతో చెప్పిందట. వాళ్ళామె ఆయనతో అది




చెప్పిందట. వాళ్ళు బెంగాలీలు కదూ—అందుకని ఆయనటి.వి అని పలకలేక—మీకు టి.బి. ఉందా అని అడిగాడు. ఆయన పాపం టి.వి. అనే అర్థంతోనే అడిగాడు.

—పినిసెట్టి

# హనీమూన్



కృష్ణమోహన్ మొన్నీమధ్యే పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళికూతురు సత్యభామ కూడా చాలా అందంగా ఉంటుంది. పెళ్ళి చాలా వైభవంగా జరిగింది. మంచి జంట అని చూసినవాళ్ళంతా ముచ్చట పడ్డారు. శోభనం అయిపోయాక బంధువులంతా అడిగారు కృష్ణమోహన్ని.

"ఏరా! హనీమూన్‌కి ఎక్కడికి వెళ్తావ్? అని. అనుభవంవున్న ఒకావిడ ఊటీ వెళ్ళండని సెలహా ఇచ్చింది. మరొకరు సిమ్లా వెళ్ళమనీ, ఇంకొకరు డార్జిలింగ్ బావుంటుందనీ తోచిన విధంగా చెప్పారు.

"ఏం సత్యా! ఎక్కడికి వెళ్దాం?" అన్నాడు కృష్ణమోహన్" అపర కృష్ణ పరమాత్మలా.

సత్యభామ సిగ్గుపడింది. అందర్లోనూ అలా అడిగేసరికి బుగ్గలు ఎరుపెక్కాయి. ఆ ఎరుపురంగు చూసిన కృష్ణమోహన్‌కు ఆపిల్స్ జ్ఞాపకం వచ్చాయి. వెంటనే "పోనీ కాశ్మీర్ వెళ్దాం" అని ఆమెని ఒప్పించాడు.

వారం రోజులకు సరిపడ సామాన్లు సర్దుకుని నూతన దంపతులు కాశ్మీర్ వెళ్ళారు.

అనుకున్న వారం మీద మరో రెండు రోజుల తర్వాత ఇద్దరూ తిరిగి వచ్చారు.

ఇంటికి రాగానే "బాగా జరిగిందా హనీమూన్'' అని అడిగారు ఒకరు చిలిపిగా. "ఆఁ చాలా బ్రహ్మాండంగా జరిగింది; మేమిద్దరం ఒక్క క్షణం కూడా ఒకర్ని విడిచి ఒకళ్ళం ఉండ లేదు. అందరూ మా గురించే వింతగా చెప్పుకున్నారు అక్కడ'' అన్నాడు కృష్ణమోహన్.

"అలా ఉండాలి మొగుడూ పెళ్ళా లంటే" అని దీవించిందో బామ్మగారు.

"ఏడిసినట్టే ఉంది; వెళ్ళిన వెంటనే అక్కడి మంచుకి మాకు ఫ్లూ వచ్చింది. ఇద్దరం మంచం దిగలేదు మొన్నటిదాకా. జ్వరం కొంచెం తగ్గిన వెంటనే తిరిగి వచ్చేశాం'' అన్నాడు కృష్ణమోహన్ హాచ్ అని తుమ్ముతూ నీరసంగా.

— హేళి

# రిలీఫ్



ఆండాళమ్మ వాళ్ళు మేడమీది పోర్షన్‌లో అద్దె కుంటున్నారు. భర్త ఎంత నిదానమో, ఆండాళమ్మ అంత హడావుడిమనిషి. చేసే ప్రతిపనీ వివరం తవరం లేకుండా వెనకది ముందు, ముందుది వెనకాచేసి గంతులేస్తుంటుంది. ఓ రోజున వీధిలో పాత గుడ్డలకి స్టీలు సామాన్లిచ్చే వాడి కేక విని మేడపైనుంచీ పిలిచింది. ఆ మనిషికి పిలుపు వినబడలేదు. అందుకని తనే హడావిడిగా మెట్లు దిగి రాబోయి జారిపడి కాలు విరగ్గొట్టుకుంది.

ఆస్పత్రిలో డాక్టరు ఎక్స్‌రే తీయించి ఎముక కొంచెం విరిగిందని కాలికిప్లాస్టర్ వేశాడు "పెద్ద ప్రమాదమేమీలేదు. త్వరలోనే కాలు మామూలుగా వచ్చేస్తుంది ఈ ప్లాస్టరు విప్పేవరకూ మీరు మెట్లు ఎక్కడం, దిగడం చెయ్యకూడదు తెల్సిందా" అని చెప్పి పంపించాడు డాక్టరు.

ఓ నెల్రోజులు గడిచినై. డాక్టరు ఆండాళమ్మ కాలు ప్లాస్టర్ విప్పాడు. పరీక్షచేసి "మీ కాలు పూర్తిగా బాగుపడింది. ఇకనుంచీ మీరు మామూలుగా తిరగొచ్చు" అని చెప్పాడు.

"అయితే మెట్లు ఎక్కడం, దిగడం కూడా చెయ్యవచ్చా" అడిగింది ఆండాళమ్మ,

"చక్కగా ఎక్కొచ్చు దిగొచ్చు" అని చెప్పాడు డాక్టర్. ఆండాళమ్మ ఓ నిట్టూర్పు వదిలి "హమ్మయ్య బ్రతికించారు, నెలరోజుల్నుంచీ నీటి గొట్టం పట్టుకుని పైకీ, కిందికీ పాకలేక చస్తున్నా[illegible]" అంది రిలీఫ్‌గా.

— శాలిని

Edited, Printed and Published by Ramoji Rao Ch for Vasundhara Publications. Printed at Colorama Offset Printers, Hyderabad. Office Address : CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004

